# భారతి

సాహిత్య మాసపత్రిక

జూలై 1983



వ్యవస్థాపకులు
దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

# భారతి

మాసపత్రిక

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)



జూలై 1983

సంపుటము : 60 సంచిక : 7



విడిపత్రిక వెల నాలుగు రూపాయలు

# విషయానుక్రమణిక

## జూలై 1983





# కురిసిన శిల్పాలు

## డా॥ సి. నారాయణ రెడ్డి

డాబా మీద పడుకుని
చూపుల్ని పేలుస్తున్నాను
తారాజువ్వల్లా.

అపరసంధ్య చిమ్మేసిన రంగుల్లో
ఆకాశం నిండా శిలా ప్రతిమలు.

పాలరాళ్ల చెక్కడాలు
ఇంద్రనీలాల కట్టడాలు.

అంతర్జాతీయ చిత్రశాలల్లోని
అనర్ఘ వర్ణ వర్ణ శిల్పాలు.

ఆకాశమే ఓ పెద్ద మ్యూజియం
అందులో ప్రతిమేఘం ఓ శిల్పం.

తమ చుట్టూ నున్న నున్నగా తడిమే
నా చూపుల్ని చూసి
నవ్వుకున్నాయి శిల్పాలు.

ఆ నవ్వులో రక్తం తెలుపెక్కింది.
కాళ్లూ చేతులూ కట్టేసుకున్న జడత్వం
ఉసూరుసూరు మంది
ఉరుమును గొంతులో నొక్కుకుని.

"ఎందుకు మాకీ సౌందర్యం?
మా గుండెల్లోని అమృత భాండాలకు
ఎందుకీ సంస్తంభనం?
ఒక్క నీటి చుక్కకోసం
ఊపిరుల చేతులెత్తి అరిచే ధరిత్రిని
తడివేళ్లతో తడమని మా అందమెందుకు?

ఆకాశమా!
ఎందుకీ రంగులు పూశావు
మా నలుపును ఏం చేశావు?
ఎందుకు చెక్కావు మమ్మల్ని
ఇన్నిన్ని వంపులతో.

పచ్చిక బయళ్లలోని పసి జింకల్లా
స్వచ్ఛందంగా ఎగిరేమాకు
ప్రదర్శన శాలలెందుకు?
గాలికేమయింది? కదలదేం?

ఈ అద్దాలశాలను బద్దలుకొట్టి
మమ్మల్ని వెలికి లాగదేం?
చల్లని శ్వాసతో మా ఒంటిని తవ్వి
కుండలతో జలసుధలను కుమ్మరించదేం?"

కలవరం ప్రశ్నలా లేచింది
కల్లోలం సమాధానంలా కీచింది
మబ్బుల గొంతుకల్లో ఉరుము విడుదలయ్యింది.
రకరకాల రంగుల శిల్పాల్లో
నలుపు చోరబడింది మెరుపుదాడిలా.

శిల్పాలు కదిలాయి
జీవకణాలు కరిగాయి
అందం అలుక్కుపోయింది.
ఆకాశం అదృశ్యమయ్యింది
ఆర్ద్రహృదయం తెగించి దూకింది
వెయ్యిజల్లుల కాళ్లతో.

అవనీతలం గటగటా తాగింది
ఆనందం తొణికే కోటి కళ్లతో.



శ్రీ సర్దేశాయి తిరుమలరావు

# మానవాత్మలో సమ సమాజం

(గత సంచిక తరువాయి)

ప్రాచీన సాహిత్యంలో అచ్చటచ్చట సమసమాజ బీజ భావాలు కన్పడుతాయి. రఘువంశరాజుల హయాంలో ప్రజల సంతానాన్ని రాజులే భరించి పోషించేవారట. "భరణాత్ పోషణా దపి" తలిదండ్రులు శిశువులకు "కేవలం జన్మహేతవః" అట. "ఉర్వివారికెల్ల నొక్క కంచము బెట్టి పొత్తుగుడిపి కులము పొలియ జేసి తలను చెయ్యిబెట్టి తగనమ్మ జెప్పరా" అని వేమన అన్నట్లు చెబుతారు. ఈ వాక్యములో సమానత్వమూ, సహజీవనమూ సూచింపబడ్డాయి. ప్రాచీన మంత్రంలోని "సహనౌభునక్తు" లోనూ ఈ భావమే వుంది. వేదంలో ఒక మంత్రం విశ్వాన్ని పక్షి గూడుగ జెప్పింది.6

నేటి మన దిగంబర కవులుకానీ, విరసం కవులు కానీ, "కొయ్య గుర్రం" కానీ, వ్యవస్థాపరమైన విశ్లేషణ శాస్త్రీయంగా చేయలేదు. వారి దృష్టిలో భూస్వామ్య, ధనస్వామ్య పద్ధతులు చారిత్రక భౌతికత్వంలో సంశ్లిష్ట దశలు కాక, వైద్యపరిభాషలో అభిశంసించేందుకు పనికివచ్చే వికృష్ట రోగదశలుగా తయారయి నందున, ఈ కవులు సమసమాజ నిర్మాణానికి "రాళ్ళెత్తిన కూలీలు" కాలేకపోతున్నారు. ఉన్న శిథిల కట్టడాలనైనా పూర్తిగా పడగొట్టే గట్టి ప్రయత్నం చేయడం లేదు. 'అ గోడలు పడి పోను" అని తిట్టడం మాత్రం చేస్తున్నారు. వీరు తిట్టు కవులు కానీ పడగొట్టు కవులూ కాదు, కట్టు కవులు కారు.

భూతప్రియులు, భవిష్యదభిమానులు ఒక విషయంలో ఒక్కటిగా కనబడతారు. ఆ విషయం ఏమంటే మరీ పూర్వ కాలంలో మనిషి సుఖ శాంతులతో వుండేవాడు. ఏ కారణం చేత నైతేయేమీ వాని పరిస్థితి రాను రాను దిగజారిపోయింది. ఆదం, ఈవుల ఈడెన్ వనంలో హాయిగా వుంటారు. సైతాను ప్రేరణపై దేవుని ఆజ్ఞనుల్లంఘించి, ఆస్తికోసం ఒకరి నొకరు చంపుకొనే ఇద్దరు కొడుకులను కని మానవాళి కంతటా దారిచూపినవారైనారు. ఈవు కోసం ఆదము కింకొకడు ప్రత్యర్థి వుంటే, సుందోపసుం దుల కథ అయ్యేది.

రూసో "మానవుడు స్వతంత్రంలో బుట్టినాడు కానీ ఎక్కడ చూచినా సంకెళ్ళలో కనిపిస్తాడు" అని తన "అతలం" "సోషియల్ కంట్రాక్టు" లో మొదటి వాక్యంగా వ్రాస్తాడు.

మార్క్స్ "లోకంలోని పని మనుషుల్లారా! ఏకంకండి. మీరు పోగొట్టుకొనేదేముంది. సంకెళ్ళు తప్ప" అని "కమ్యూనిస్టు మేనిఫెస్టో" అనే కరపత్రంలో వ్రాసినాడు.

రూసో గుర్తించిన సంకెళ్ళని మార్క్స్ తెంచుకొండంటు న్నాడు. రూసో సిద్ధాంతం భూస్వామ్య వ్యవస్థనుంచి పెట్టుబడి దారీ విధానానికీ, మార్క్స్ సిద్ధాంతం పెట్టుబడి దారీ విధానం నుంచి శాస్త్రీయ సమసమాజంకు దారి తీసినాయని విచారకులభి ప్రాయ పడతారు.

మన భారతీయు లేమంటారు? కాలాన్ని నాల్గు యుగా లుగా విభజించినారు. ఈ యుగధర్మం ఏలాగు మారిందో చదవడం ఆసక్తి కరంగా వుంటుంది. మహాభారతంలో హనుమంతుడు భీమునికీ, భీష్ముడు ధర్మరాజుకీ యుగ ధర్మాలు చెబుతారు.

**కృతయుగం:** కృతం కాని కర్తవ్యం కృతయుగాన లేదు పెద్దవారు ఉండంగనే పిల్లలు చచ్చిపోరు. దేవ, దానవ, యక్ష, గంధర్వ, రాక్షస, నాగ అంటూ జాతిభేదాలు లేవు. క్రియ విక్రియాలు లేవు. అప్పుడు ఒకే వేదం ప్రచారంలో వుండింది. కృష్యాది కర్మలు లేవు. అనుకొన్న మాత్రాన్నే ఫలం కలిగేది. అప్పుడొకే ధర్మం. అది సన్యాసం. వ్యాధులు, ఇంద్రియక్షయం, అసూయలు లేవు. ఏడ్పు వినబడదు. దర్పం, వికృతి, విగ్రహం, ద్వేషం, పైశునం, భయం, సంతాపం, ఈర్ష్య లేవు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు స్వకర్మ పరాయణులు. సమాచారం, సమాశ్రియం, సమజ్ఞానం, సమకర్మలు కలిగి ఉండేవారు. ఒకే దేవుడు, ఒకే మంత్ర విధి క్రియలు. పృథక్ ధర్మాలున్నా ఏక వేదానుసరులు. అకామ ఫల సంయోగం చేత నాలుగు వర్ణముల వారూ పరగతి పడసేవారు. కృతయుగ ధర్మం ఆత్మయోగ సమా యుక్తం. ధర్మం నాల్గు పాదాలు కలిగి వుండేది. సత్వరజస్తమో గుణాలు లేవు. విష్ణువు శుక్ల వర్ణుడు.

**త్రేతాయుగం:** త్రేతాయుగంలో సత్యం ప్రారంభం అవుతుంది. ధర్మంలోని ఒకపాదం పోతుంది. నరులు సత్య ప్రవృత్తులు. క్రియాధర్మ పరాయణులు. యజ్ఞం అది వివిధ ధర్మ క్రియలు మొదలిడతాయి. భావ సంకల్పం చేతనే క్రియా దాన ఫలాలు కలుగుతాయి. ప్రజలు ధర్మం తప్పరు. తపోదాన పరాయణులు. స్వధర్ములు. క్రియా వంతులు. సత్వగుణులు. అచ్యుతుడు ఎర్రని రంగువాడు.

**ద్వాపరయుగం:** ధర్మం రెండు భాగాలే. వేదం నాల్గుగా చీలిపోతుంది. కొందరికి నాల్గు, కొందరికి మూడు, కొందరికి రెండు, కొందరికి ఒక వేదం తెలిసివుంటుంది. కొందరికంటూ ఏ వేదమూ తెలిసి వుండదు. శాస్త్రాల్లోనూ, క్రియల్లోనూ భిన్నత వుంటుంది. తపస్సు, దానాది ప్రవృత్తులలో పడి ప్రజలు రాజసు లవుతారు. ఏక వేదం అర్థంకాక పోవడంచేత చీలిపోయింది. సత్వగుణం పోయినందువలన చాలా వ్యాధులు వస్తాయి. దైవోపద్రవాలు వస్తాయి. ఇటువంటి బాధలవల్ల జనులు తపస్సు చేయడం మొదలు పెడతారు. కామ కామం చేతనూ, స్వర్గకామం చేతనూ యజ్ఞాలు చేస్తారు. ధర్మం క్షీణించినందువల్ల ప్రజలు క్షీణిస్తారు. విష్ణువు పసుపు పచ్చని రంగు కల్గి వుంటాడు.

**కలియుగం:** వేదాచారం, ధర్మయజ్ఞ క్రియలు నాశన మవుతాయి. ఈతి, వ్యాధి అలసత్వం, క్రోధం, ఆకలి, దప్పి అధికమవుతాయి. యుగం మారినకొల్ల ధర్మం క్షయిస్తుంది. లోకం క్షీణిస్తుంది. జనుల భావాలూ క్షీణిస్తాయి. యుగక్షయ ధర్మం, ప్రార్థనాలకి విపరీత ఫలాన్ని ఇస్తుంది. కేశవుడు తామస గుణ సూచక కృష్ణ వర్ణుడవుతాడు. అటువంటి కలియుగం రాబో తుంది. కాచుకో అని హనుమంతుడు భీమున్ని ఎచ్చరిస్తాడు.

ఈ యుగ ధర్మాలను ఆధునిక దృక్పథంలో చూస్తే మొదట బాగుండేది. రాను రాను చెడిపోయింది. ఆదిమ వ్యవస్థ సమరూపంగా ఉండగా, రానురాను భిన్నరూపంగా పరిణమించింది. స్వంతానికి సంపాదించుకోవలెననే స్వార్థ బుద్ధి ఎక్కువయింది. దేవుడు తెలుపు, ఎరుపు, పసుపు, నలుపుగా మారినాడని చెప్పడంలో నలుపు క్షీణతతో ముడిపెట్టినట్లయింది. "ఇండియనులు పూర్వ యూరోపియనులు" అన్న నీరద చౌధరి అభియోగం సరియైనదే అని రుజువైంది. జనక్షయ అని యుగధర్మంలో వుండగా జన సంఖ్య ఎక్కువవుతూ వుంది. జరిగిపోయిన కాలం గురించి ఆశా పూర్వక ఆలోచనగానూ, జరుగుతున్న దానిని స్వ మనో ధర్మాను సారంగానూ, జరగబోవు దానిని కాలజ్ఞానంగానూ చెబు తున్నాడు చిరంజీవి హనుమంతుడు.

ఆది కాలంలో ఉండినటువంటి వ్యవస్థా స్వరూపం ఏమి అనే విషయాన్ని భీష్ముడు ధర్మరాజుతో శాంతిపర్వంలో ఈలాగు చెబుతాడు.

సత్య (కృత) యుగంలో రాజ్యం లేదు. రాజు లేడు. దండం లేదు. దాండికుడూ లేడు. ధర్మం చేత పరస్పరం రక్షించు కొనుచుండేవారు. అట్లు అన్యోన్యం పరిపాలించుకొం టూంటే, ఖేద మూలక మోహం ఆవరిస్తుంది. దీని వల్ల ధర్మం నాశనమైంది. మోహం నుంచి లోభం వచ్చింది. ఏది ప్రాప్తం కాదో, దానిని సంపాదించుకునేందుకు వెంపర్లాట ప్రారంభించి నారు. రాగవశాన కార్యాకార్య విమూఢులైనారు. అగమ్య గమనం, వాచ్యావాచ్యం, భక్ష్యాభక్ష్యం, దోషాదోషం అనే విచక్షణ లేకుండా పోయింది. ధర్మ విప్లవం అయింది. (ధర్మానికి విప్లవం అయింది మనం "విప్లవం" అనే మాటను మంచి అర్థంలో వాడుతాము. ప్రాచీనులు చెడ్డర్థంలో వాడినారు). అప్పు డింద్రాదులు పోయి బ్రహ్మతో మొరపెట్టుకొంటే, ఆ యప్పు లక్ష అధ్యాయాలు కలిగిన "నీతిశాస్త్రం" వ్రాసిచ్చి, దీన్ని అమలు పరుచు కొండి, అంతా సరిపోతుంది అంటాడు. (స్వాతంత్ర్యం వచ్చిం తర్వాత, మన ప్రజానాయకులు మనకేదో మంచిది చేస్తారు. ఆకలి, దప్పి, రోగం, అవిద్య, పేదరికం మున్నగు వాటిని తొలగించేందు కేమో చేస్తారని ఆశతో చూస్తూ వుండగా, ప్రపంచ రాజ్యాంగాల్లో అన్నింటికన్నా పెద్ద రాకాసి రాజ్యాంగాన్ని తయారుచేసి మన మొహాల పడవేసినట్లుంది బ్రహ్మగారి వ్యవహారం). బాబ్బాబు ఇది చదివేందుకే సాధ్యం కానంత పొడుగ్గా వుందే అమలేమి చేస్తామని వారు దానిని వాళ్ల చేత వీళ్ల చేత సంక్షిప్తం చేయించు కొంటారు—1000 అధ్యాయాలు కలదిగ. కొండపల్లి వీరవెంకయ్య కంపెనీ వారు ప్రకటించిన 25 శ్లోకాల "నీతి శాస్త్రం" (13" × 4") 1940 లో నా దగ్గరుండేది. ఇది బ్రహ్మ వ్రాసిన లక్షధ్యాయాల అతి సంక్షిప్తరూపమయి వుంటుంది.

ఈ నీతి శాస్త్రం పట్టుకొని ఇంద్రాదులు విష్ణువు దగ్గరకు పోయి దీన్ని అమలు పరచే విధానం చెప్పమంటారు. ఆయన వారినీ, వీరినీ పాలకులుగ సృష్టిస్తాడు. తుదకు వేనుడు అవత రిస్తాడు. ఈ వేనుడు విశ్వనాథ త్రిపురనేనుల మధ్య నలిగి పోతున్నాడు.[7] విష్ణువు చేసిన నిర్వాకం ఇట్లుంది. పెద్దవాళ్ళ పన్నన్నీ ఇలాగే వుంటాయి.

భీష్ముని కథనాన్ని ఆధునిక పరిభాషలో చెప్పితే ఆది కాలంలో చట్టం లేదు. రాజూ లేడు. రాష్ట్రం రాలిపోతుంది అనే దానికి సరిపోతుంది. లోభం ఆవరించింది. అంటే అంతా నాకే

కావాలననే ఆరాటం స్వంత ఆస్తి సంపాదించుకోవడం ప్రారంభమైంది. రాగవశత అంటే స్త్రీసాంగత్యం. స్వంత ఆస్తి, కుటుంబంల సంగతి తర్వాత.

హనుమంతుడూ, భీష్ముడూ చెప్పేదానిలో సమానాంశాలున్నాయి. మొదట అంతా బాగుండింది. బ్రౌనింగు కవి వ్రాసిన "పిప్పా పాట" లో వలె. తర్వాత చెడిపోయింది. ధర్మం ఎందుకు క్షీణించింది అని అడిగితే మోహం, లోభం, రాగం, ప్రేరేగినాయని జవాబు. పోలీసువారు ఎఫ్. ఐ. అర్.లో "మరణమునకు కారణము" అనే కాలం ప్రక్కన "ప్రాణం పోవుటవలన" అని వ్రాసినట్లుంది ఈ సంజాయిషీ. విశ్వనాథ అయితే పాశ్చాత్య నాగరికతా ప్రభావం అంటారు. మార్క్సిస్టుల విశ్లేషణ వేఱే విధంగా వుంటుంది. భూస్వామ్య పద్ధతిలో కౌలుదారులు రేగి భూస్వామిని తోసిరాజని తామే పెత్తందారు లవుతారు. వీరు పెట్టుబడిదారులవుతారు. పరిశ్రమలు స్థాపిస్తారు. రాను రాను పరిశ్రమల్లోని కూలీలు రేగి కార్మిక కర్షకుల ఆధిపత్యం స్థాపిస్తారు. భూస్వామ్య పద్ధతి, పెట్టుబడిదారీ పద్ధతి పడిపోవడానికి కారణ బీజాలు ఆయా పద్ధతులలోనే దాగుకొని వున్నాయి. ప్రతి వ్యవస్థయు తన నుండి పుట్టిన వ్యతిరేక శక్తుల మూలాన్నే అంతరిస్తుంది అనే సూత్రం ఇక్కడ అన్వయించుకోవలె.

యుగ ధర్మంలోకానీ, మార్క్సిస్టు ఆలోచనలోగానీ ఒకే అంశం అట్టడుగున కనబడుతుంది. మనిషికి ఆకలి వేస్తుంది. (శిశ్నోదర పరాయణత్వాలు రెండూ ఇచ్చట ఉద్దేశింప బడినవి). వానికి "తిండి" కావలె. అది దొరుకుతుందో లేదో అనే గిలి మనిషిని వెంటాడుతుంటుంది. దీని కోసం ఒక మనిషి ఇంకొక మనిషిని పీక్కొని తినడమే కాక, రేపటికింత ఉండనీ అని దాచుకొంటాడు. ఈ నైజం మూలాన్న స్వంత ఆస్తి వివాహ పద్ధతి అనే రెండు మానవుణ్ణి పీడిస్తున్నాయి. రేపటి సంగతి దేవుడే చూచుకొంటాడు అని భజన చేసేదాంట్లో, రేపటి సంగతి ఎట్లారా దేవుడా అనే దిగులు ఉంది రేపటి సంగతి దేవుడే చూచుకొంటాడని కాక రేపటి సంగతి దేవుడే చూచుకొనవలెననే నిస్సహాయ మనస్థితి తొంగి చూస్తూవుంది. పురందరదాసు "ఏసుక్కెదు వంబు గుల్, శ్రీహరితాన్ తెచ్చి యిచ్చున్" అంటారు. నారుపోసిన దేవుడు నీరు పోయడా అనేది ఇటువంటిదే. ఇంత నిస్సంగత్వం ఇంత "లలాట లిఖితా రేఖా పరిమార్జుం న శక్యతే" అనే మనస్తత్వం ఆర్థిక భద్రత లేక పోవడం, స్వంతఆస్తి లేదే అనే బెంగ, స్వంత ఆస్తి వుంటే అది దొంగలెత్తుకపోతారో, దొరలకొనో అనే బెంగ ప్రాతిపదికగా వచ్చినవేకానీ, ఆధ్యాత్మ గవేషణ బుద్ధివల్ల ఏర్పడినట్టివికావు. సమ సమాజంలో ఇట్టి అనిశ్చిత పరిస్థితి వుండదు. "ఆస్తి అంటే ఏమి? దొంగతనం" అని ప్రౌధాన్ వ్రాసినాడు. పురుషునితో స్త్రీకి సమాన ప్రతిపత్తిలేని వ్యవస్థలో వివాహం అనేది చట్టబద్ధ మానభంగం కాక మరేమి? యుద్ధాలు, సామ్రాజ్యాలు, విప్లవాలు, ధర్మాలు, అన్నీ వీటి కోసమే. మొదటివాడు రెండవ వానిపై ఆధిపత్యం చెలాయిస్తున్నాడు. దీనికి కారణమేమి? రెండవ వానికి లేనివి మొదటివాని దగ్గరున్నాయి కనుక ఇది తప్పనిసరి అవుతూన్నది. ఏది ఎవరికి ఎంత ఎప్పుడు కావలెనో అది వారికి అంత అప్పుడు దొరుకుతుంది అనుకొందాము. అప్పుడు స్వంత ఆస్తి, వివాహ పద్ధతి అంతరిస్తాయి. ఏడు జన్మాలకూ నీవే నా పతివి (దీనినే పాతివ్రత్య మంటారు) అనే ప్రవృత్తికీ దిన భత్యాని కెప్పటి కప్పుడు స్త్రీ తన నర్పించుకొనే వృత్తికీ (ఇది అత్యంత పురాతన వృత్తి అయిన వేశ్యా వృత్తి) ప్రాతిపదిక ఒకటే, అది స్త్రీకి ఆర్థిక భద్రత లేకపోవుట. స్వంత ఆస్తిపై మక్కువ, ఆర్జనమీద ఆరాటం ఎందుకుంటున్నాయి అంటే మనకు లభ్యమయ్యే వనరులు (అవి ఎంత ఎక్కువ అనిపించినా) పరిమితం కావడమే. పరిమిత వనరులు సంబాళించుకోవడమే మానవ నాగరికతా చరిత్ర వివసనం అనవచ్చును. ఈ వనరులు ప్రాకృతికాలు. భూమి, నీరు, గాలి. ఇప్పటి నాగరికతాస్థితి బట్టి చూస్తే గాలి యొక్కటి మాత్రం పరిమితి లేకుండా దొరికే వస్తువు. తక్కినవి పరిమితాలే. [బొంబాయి, టోక్యో లాంటి పారిశ్రామిక మహానగరాలలో పీల్చడానికి స్వచ్ఛగాలి కూడా కరవే. రాను రాను మనందరి మీదా మన శ్రేయో రాజ్యం "గాలిపన్ను" వేయబోతోంది. ఖబడ్దార్!] మనం గొప్పవని గౌరవించే గ్రంథాల పంక్తుల మధ్య చదివితే ఆర్థిక వనరులే ఆయా గ్రంథాలకు ఇతివృత్తములు అనే విషయం స్పష్టం అవుతుంది. ఋగ్వేదంలోని దాశరాజ్ఞ యుద్ధం, రామాయణం, మహాభారతం, ఇలియడ్ మున్నగు వాటిలో ఆర్థిక వనరులే ఇతివృత్తాలు. సిద్ధార్థుని మహాభినిష్క్రమణానికి కారణం ఆయన గణానికీ, ఇంకొక గణానికీ నదీ జలాల వినియోగం గురించిన తగాదాయే కారణమని అంబేడ్కరు అధునాతన సిద్ధాంతం. డికెన్సు నవలలకూ, గాల్స్‌వర్దీ "ఫార్‌సైట్ గాథ" అనే బృహన్నవలకూ స్వంత ఆస్తి విలాసాలు ఇతివృత్తాలు. ఇప్పుడు ఇంధనక్షోభ అట్టిది. ప్రాకృతిక వనరుల మీది యాజమాన్యం ఒక వ్యక్తికీ, ఒక కుటుంబానికీ, ఒక రాజ్యానికి వుంటే ఘర్షణ తప్పదు.

భీమసేనుడు సౌగంధిక పుష్పం కోసం పోయినపుడు యక్షులు "రేయ్ ఇది కుబేరుని[8] సరోవరం. ఆయన పర్మిషన్ లేంది నీళ్ల కూడా తాగరాదు తెలుసా" అంటారు. అప్పుడు భీమసేనుడు ఇట్లా అంటాడు:

ఈ పుష్పం కొండల నుండి పారే వాగులో పుట్టింది. మహానుభావుడు కుబేరయ్య ఇంట్లో కాదు కదా అందుకే దీనిమీద సర్వభూతాలకూ, కుబేరునికీ సమాన హక్కు వుంది. ఇటువంటి సార్వజనిక ద్రవ్యాలకై ఎవడు ఎవన్ని యాచిస్తారు ?[9]

ఇచ్చట "ద్రవ్య" పదం అర్థవంతమైంది. "ప్రకృతి ఐశ్వర్యం" అని అర్థం చెప్పుకోవచ్చు.

గాంధీమహాత్మునికి ప్రీతికరమైన ఈశావాస్యోప నిషత్తులోని మొదటి మంత్రం ఇట్లా అంటుంది.

ఈశావాస్య మిదం సర్వం
యత్కించ జగత్యాం జగత్
తేనత్యక్తేనభుం జీథా
మాగృధః కస్యస్విద్ధనం.

అంతా ఈశ్వరునికి చెందిందే. ఇది నా ధనం అని ప్రలోభించకు అని తాత్పర్యం. ఇచటి "ధనం" అనే పదం అర్థవంతమయిందీ, కీలకమయిందీ. ధనికులు ధనానికి ధర్మకర్తలుగా మాత్రమే మండవలెననేది గాంధి ఆర్థిక సిద్ధాంతం. తోడేళ్ళు గొర్రెలకు ధర్మకర్తలుగా ఉండడం వంటిదిది అని వాదించేవాళ్ళూ ఉన్నారు. భీమసేనుని వాక్యం తెలుగు వినండి:

"గిరినిర్ఝరుల బుట్టిన
సరసిజ వనమిదియు సర్వసామాన్యముగా
కరుదుగ నొక్కని యదియే
పరగ గుబేరుండు దీని బడసెనె మొదలన్"

(నన్నయ - మహాభారతం)

ఇటువంటి తగాదాయే పారిజాతాపహరణ సందర్భంలో వస్తుంది. శ్రీకృష్ణసత్యభామలు దేవలోకానికి పోతారు. అచట పారిజాతాన్ని చూస్తారు. పారిజాతాలని అన్నింటినీ శచీదేవి తానే తలలో ముడుచుకొంటుంది. మనుష్య స్త్రీ అయినందువల్ల సత్యభామకి లేదు. ఇది పసిగట్టి సత్యభామ తన భర్తని పారిజాత వృక్షాన్నే పెకలించి తీసుకురమ్మని పురమాయిస్తుంది. శ్రీకృష్ణుడా పని చేయబోతూ వుంటే నందన వనపాలకు లడ్డగిస్తారు. అప్పుడు సత్యభామ "ఈ పారిజాతం సముద్రమథన సమయాన సముత్పన్నమయింది. దీని మీద ఇంద్రునికి గాని, శచికిగాని, ఉండే అధికారం ఏమి? ఇది సర్వలోక సామాన్యమైంది. అందరికీ దీనిపై హక్కుంది. ఇంద్రుడు మాత్రమే హక్కుదారుడు కాడు" అని వారితో వాదిస్తుంది.[10] అక్కడికి ఆగకుండా "ఒక మానవ స్త్రీ పారిజాతాన్ని అపహరిస్తుందని నా మాటగా మీ శచితో చెప్పండి పొండి"◆ అని ఛాలెంజి చేస్తుంది. ఇది స్త్రీయొక్క తిరుగుబాటే కాక దేవతలపై మానవుల తిరుగుబాటు అనవచ్చును.

తోకతునుక : భీమసేనుడూ, సత్యభామ ఏమంటున్నా రంటే, ఇవి అందరికీ చెందుతాయి కాబట్టి మా ఇంటికి తీసుకపోయి పెరటిలో నాటుకొంటాము - అని.

ఇందులో ఇంకొక గమ్మత్తు కూడా వుంది. గావువాళ్లు కూడా తమకు అనూచానంగా వస్తూన్న లేక రావలసింది అనుకొన్న ప్రత్యేక హక్కు లేక సదుపాయం గనక రాకపోతే, అథవా తొలగింప బడితే "సర్వసమానత్వం" వంటి పరిభాష మాట్లాడుతూ, గుత్తాధిపత్యానికి వ్యతిరేకంగా వుద్యమం ప్రారంభించనయినా ప్రారంభిస్తారు. లేక ప్రారంభిస్తామని బెదిరిస్తారు. భీమసేనుడు, సత్యభామ ఇపుడా పని చేస్తున్నారు. ఈ ధోరణికి "బాబిట్రీ" అని పేరు.❖

సత్యభామ మానవస్త్రీగా, దేవరాణినే ఎదిరించింది. మరి ఇప్పుడు స్త్రీల స్థానం ఎట్లావుంది అనేది ఆలోచించవలసిన విషయం.

హిందూ సంఘంలో అన్ని ఆర్థిక పరిస్థితులకు మగవాడు బానిస. ఆడుది మగవానికి బానిస. హిందూ స్త్రీని బాస దాసి అని పిల్చుట యుక్తియుక్తంగా ఉంటుంది. పొలం, ఇల్లు, స్థిరాస్తి యైతే, సొమ్ములూ, ఆ సొమ్ములు తొడిగియుండే ఆడుది చరాస్థి. మొరార్జీదేశాయ్ గారి గోల్డ్ కంట్రోల్ ఆర్డరుకు అతీతమైన నగలు కల స్త్రీ, ఆస్తికాక మరేమిటి? అన్ని ఆస్తుల వలెనే స్త్రీని

◆ పారిజాతం తథాప్యేనం మానుషీ హారయామితే, శ్లో. 52

❖ ప్రఖ్యాత అమెరికన్ నవలారచయిత సింక్లేర్ లూయీ "బాబిట్" అనే నవల వ్రాసినాడు. ఈ నవల లోని ప్రధాన పాత్ర మిస్టర్ బాబిట్. ఇంటి స్థలాల అమ్మకపు ఏజంటుగా అచ్చపు అమెరికన్ పెట్టుబడిదారీ మనస్తత్వం కలవాడు. అట్టివాడు తన వ్యాపారంలోనూ, లావాదేవీల్లోనూ నష్టము వస్తే లేక వ్యాపార సహచరులు, కుటుంబ సభ్యులు తనతో ఏకీభవించనట్లయితే తాను సోషలిస్టు అవుతానని బెదిరిస్తూ వుంటాడు. ఇట్టి మనస్తత్వా న్నందుకే "బాబిట్రి" అని అంటారు.

అమ్మవచ్చును. కొనవచ్చును. జూదంలో ఒడ్డవచ్చును. ఓడవచ్చును. తాకట్టులో పెట్టవచ్చును. విడిపించుకో వచ్చును. గృహిణీం గృహముచ్యతే అనే నీతిలో కూడ గృహిణి ఆస్తి అనే భావం ఇమిడి వుంది. భారతనారీ గౌరవ గాథలన్నీ అనర్థదాయకాలు. అవి జరిగింది సుల్లక. కానీ నిజంగా వుండే వాళ్ళకి శాశ్వత పీడగా పరిణమించినాయి. సీత, సావిత్రి వంటి రాచరికపు స్త్రీలను ఆదర్శంగా తీసుకొండని చెప్పి సామాన్య స్త్రీ జీవితాలని చట్టుబండలు చేసినాయి మన శాస్త్రాలు. మగవాళ్ళ ఇక్కట్లు కన్నిటికీ అడుదానిని పాపాల భైరవిగా వర్ణించినాయి పురాణాలు. అన్ని దుఃఖాలకుస్త్రీయే మూలకందమని గ్రంథాలు ఘోషిస్తున్నాయి. పురుషులేం కాకూడదు? స్త్రీ కావలెను. తత్ఫలితాలు మాత్రం వద్దు. సంసారం వద్దు అని పెండ్లి చేసుకోకుండానే వున్నవాళ్ళ సంగతి అటుంచుదాం. చేసుకొన్న పెండ్లాం వద్దు. ఇదిగో సన్యసిస్తున్నాను అని పుట్టగోచి పెట్టుకొని పోయిన బాధ్యతారహిత వ్యక్తులని గొప్ప స్వాములుగా పూజిస్తున్నారు. "కిం సారం సంసారం" "సదా మోహాటవ్యాం చరతి" "సంసారం సాగరం దుఃఖం" ఓహో ఈ సమాస విలస నానికి హద్దూపద్దూ లేదు.11 "ఎంత నేర్చినా, ఎంతవారలైనా కాంతదాసులే" అని ఒకాయన మగవారిని ఎత్తిపొడుస్తాడు. దీనికి "విమెన్ లిబ్బరు" లు, "ఎంత నేర్చినా, ఎంతవారలైనా కాంతు దాస్యమేనా" అని తిరిగి ఎత్తిపొడువ వలెను.

మిమ్మల్ని పెళ్ళిచేసుకోండని ఎవరన్నారు? సంసారాన్ని తిట్టి మమ్మల్ని "బోరు" చేయుడని ఎవరన్నారు? కాంతా కనకాలను అనుప్రాసతో ఈసడించినారు. ఇంగ్లీషులో ఈ అనుప్రాస ఇంకా బాగుంటుంది. వెల్తు, విమెను, వైను అని. ఎట్టివారు ఈసడించినారు? ఇవి ఎక్కువై మొగం మొత్తినవారు అవి తక్కువై అలమటించి పోయేవారు. ("ఈ ద్రాక్షలు తప్పక పుల్లగుంటాయి" అనే నక్కబావ నైరాశ్యం అనుసరించి) కాంతా కనకాలు స్వంత ఆస్తులుగ అనుకొన్నందువల్ల "అంత వేదాంతు" లకు ప్రీతికరమైన ఈ విరక్తి కలుగుతుంది. కాంత ఒక వ్యక్తి అనీ, కనకం కొన్ని పరిశ్రమలకూ రసాయనాలకూ పనికివచ్చే ధాతువనీ తెలివిడి వస్తే ఈ వెర్రి వేదాంతమంత మవుతుంది. సంసారులే కాక సంసారం లేనివాళ్ళు కూడా స్త్రీ నిందకులే.

కుడుచుట కట్టుట పూయుట
తొడుగుటయును వివిధ దనతతులు గూడుట యె
క్కుడు వేడ్క సేయజాలవు
పడతికి బరపురుషగవయబాఋట వోలెన్.

[అనుశా. ప. అశ్వా 2, ప. 177]

అనేది భీష్ముడు మరణశయ్య మీదినుండి ధర్మరాజుకు చేసిన బోధనలలో ఒకటి. అంకు స్త్రీ నైజమని దీని తాత్పర్యం. "హంస వింశతి" "శుకసప్తతి" మున్నగు గ్రంథాలుకూడా ఇదే భావాన్ని నిదర్శనీకరించేందుకు "అంతరసాలు" పూరించే కథలల్లినాయి. ధర్మరాజుకుగానీ, భీష్మ బ్రహ్మచారికిగానీ స్త్రీయందు సద్భావం లేదు. కనుక చెప్పేవానికీ, వినేవానికీ బాగాకుదిరిందిచ్చట. వీరిని సైకో అనాలిసిస్ చేస్తే వీరు "ఒరేస్టెస్ కాంప్లెక్స్" (అంతరంగంలో మాతృద్వేషం) కల్గివున్నారని తేలుతుంది. ఆదిశంకరుల సంగతి వేఱు. తల్లిని "మోసం" చేసి ఉలుకు అశ్మ కలవాడు. అందుకే "చెడ్డ కొడుకంటూ ఉంటాడేమో కానీ చెడ్డతల్లి అంటూ ఉండదు". (కుపుత్రో క్వచిదపి భవతి, కుమాతా న భవతి) అనే మకుటంతో స్తోత్రం వ్రాసి చేయిదులుపుకొన్నాడు.

ప్రద్వేషిణి (ఈమె పేరు చూడండి. ఎంత దురుద్దేశపూర్వకంగా ఉందో!) దీర్ఘతముని భార్య. ఇతడు పుట్టుగుడ్డి. ముదుకడు. ఇతనిని భార్యే పోషిస్తూ వుంటుంది. ఎట్లా అని అడుగకండి. పైగా పెద్ద కుటుంబం. ఇతడు భార్యతో "నన్నేల మెచ్చవు?" అని అడుగుతాడు. దానికామె "భరించేవాడు భర్త. భరింపబడేది భార్య. అయితే ఈ రెండూ మన విషయములో ఉల్టా సీదా అయినాయి. ఎక్కడికైనా పొండి" అని అంటుంది.

"అనిన నిర్దయాత్మలని దీర్ఘతము డల్గి
సతులకెల్ల నపుడు శాపమిచ్చె

పతిహీనలయిన భామిను
లతిధనవతులయ్యు గులజలయ్యును ననలం
కృతలయ్యెడు మాంగల్య ర
హితలయ్యెడు గృపణవృత్తి నిధియు మొదలుగాన్"

(మహాభా. ఆదిప. ఆ 4. ప 28-29)

తన భార్యమీది కోపాన్ని లోకంలో వుండే స్త్రీలందరిపైనా అన్ని కాలాల్లోనూ చూపించవలెనా?

## అధో జ్ఞాపికలు

6. "యత్ర విశ్వంభవత్యేక నీడం" ఈ వాక్యాన్ని టాగోరు విశ్వభారతికి ముఖవాక్యంగా నిర్ణయించినాడు.

7. విశ్వనాథ సత్యనారాయణ నాటకం "వేనరాజు" త్రిపురనేని రామస్వామి చౌదరి నాటకం "ఖూనీ". ఈ రెండు నాటకాలు వేనుడి గురించినవే.

8. కుబేరుడు చెడ్డం బేరం చేసేవాడని మనం చమత్కరించుకోవచ్చు. కుబేరునికి మనిషి వాహనమని అంటారు. అంటే కుబేరుడు మనుషుల బుజాల మీద సవారి చేసేవాడని సంకేతం. "మేం పేదల కెంత మేలు చేస్తున్నాం చూచినావా" అంటూ ఒక బ్రిటిష్ ప్రభ్వి అనూరిన్ బెవాన్ (ఇతడు గొప్ప కార్మిక నాయకుడు) ను పంగిస్తే, "అవును. ఎంతైనా చేస్తున్నారు. వారి బుజాల నుండి దిగుట తప్ప" అని అన్నాడట. పెత్తందార్లు పేదవారి బుజాల మీద కూర్చొని సవారి వుంటారన్నదాని కిది నిదర్శనం.

9. ఇయంచ నలినీ రమ్యా జాతా పర్వత నిర్ఝరే
నేయం భవన మాసాద్య కుబేరస్య మహాత్మనః. 11

తుల్యాహి సర్వభూతానాం ఇయం వైశ్రవణస్యచ
ఏవం గతేషు ద్రవ్యేషు కః కిం యాచితు మర్హతి. 12

మహాభారతం – అరణ్యపర్వం
[చతుష్పంచాశదధికశతతమోధ్యాయః]

10. కాశచీ పారిజాతస్యకోవాశక్రః సురాధిపః సామాన్యః సర్వలోక స్యయదేషోమృత మంథనే సముత్పన్నస్తరుః కస్మాదేకోగృహ్ణాతి వాసవః

(విష్ణుపురాణం, 5వ అంశం, అధ్యా 30, శ్లో. 46-47)

11. లక్ష్మీ నృసింహ కరావలంబ స్తోత్రంలో ఏర్చి కూర్చిన పదజాలంలో సంసారాన్ని దుయ్యబట్టినాడు బ్రహ్మచారి అయిన ఆదిశంకరుడు. పై స్తోత్రంలోని కొన్ని శ్లోకారంభాలు చూడండి. సంసార సాగర.... .. సంసార ఘోర.... .... సంసార కూప .... .... సంసార భీకర.... .. . సంసార సర్ప .... ..సంసార జాల.... ....సంసార వృక్ష .... ..సంసార దావ .... ...

[సశేషం]

***

# స్పందన - ప్రతిస్పందన

## శ్రీ గజానన్ తామన్

"యం కామయే తం తముగ్రం కృణోమి"
తం బ్రహ్మాణం తం ఋషింతం సుమేధామ్ -

### 1. అతడు

ఏ ముకురమున నైన నువు మోమునరసినా
నీ కపోలికి కెంపు నించినది నేనే.
ఏ కల్పనా డోలికలో నీవు తూగినా
ఆ కల్పనల నిలకు దించినది నేనే.
ఏ రాగ మాధురికి నువు మేను మరచినా
నీ రాగ పరిధులను పెంచినది నేనే.
ఏ గేహ దీపానివై నీవు వెలిగినా
నీ దేహమును ద్యుతుల దేర్చినది నేనే.
ఎవని రాకకు నీదు నయనాలు వేచినా
నీ చూపునకు దిశను కూర్చినది నేనే.
జానన్న కాదన్న మరల జానన్నా
నీ హృదికి స్పందనల నేర్పినది నేనే.

### 2. ఆమె

వన మయూరము వోలె నీవెంత ఆడినా
చదలిలో మబ్బునై తేలినది నేనే,
ఉదయ సంధ్యలలోన ఏ ఋతువునైనా
హృదయ వీణియ నీది మేటినది నేనే.
కమనీయ కావ్యాలు నీ వెన్ని మలచినా
కమ్మ కస్తురి పదము లొసగినది నేనే.
ఏ బాట నే వేళ నీవు పయనించినా
నీడలా నీతోడు వచ్చినది నేనే.
ఏ ఇంట దీవెలను నేను వెలిగించినా
నీలోన దీపమై వెలిగినది నేనే.
కాదనిన ఔనవిన మరల కాదనినా
నీదేవినై ఇలను వెలసినది నేనే.

—*—

# ఐహికం

'అరవింద'

నాకేం తెలుసు!
ఈ పుట్టుకలకి మొదలు తెలియని దానిని
సర్వాంతర్యామి ఉనికిని చూడలేని దాన్ని
వేయివేల ఇంద్రధనుసులు
శతకోటి రాగాల సంగీతధ్వనులు
వివిధ పరిమళాల కుసుమ పరాగాలు
నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తుంటే
ఇది మూర్ఛో, కలో విచికిత్సో తెలియటం లేదు.

పరమాణువు ప్రతాపం
ఈస్ట్రోజన్ అద్భుత చర్యలు
నాలోపలి ఇంకాలోపలికి చూడమంటుంటే
నన్ను అమరత్వం వేపు నడవ మంటుంటే
ఈ ఆరోహణ- అవరోహణలో నేను ఎక్కడ ఉన్నాను!
మెట్లు, నిచ్చెనలు, రోప్‌వేలు కూలి పడిపోతున్నాయ్.

ఎంతపైకి ఎక్కినా, ఎంత లోపలికి దిగినా
అవే అపనమ్మకపు పొరలు— నాలో.
అపహాస్యపు నవ్వులు— ఎక్కడనుంచో!
నాకు భయంగా, జ్వరం తగిలినట్లుగా ఉంటుంది
నేను చూస్తున్నదీ— అనుకుంటున్నదీ—ఉన్నదీ
ఒకటేనా!

కాదు కాదు అంటూ తెరవెనక గొంతుకలు.
ఔను. ఔను. అంటూ ప్రేక్షక సమూహాలు.
ఈ సంగీతాలకి, రంగు మెరుపులకి
ఈ పరిమళాలకి, పరికరాలకి
దూర దూరంగా వెళ్ళాలని ఉంది.

వెడితే!
ఆభరణాలన్నీ వొలిచి, తెరని చీల్చి చూడాలని ఉంది.

చూస్తే!
అక్కడ...
అంతా ఒకటే వెలుగు
అంతా ఒకటే చీకటి
భయం, నిరాశ
సందేహం, సంశయం.
సంగీతం ఆపలేను.
స్పెక్ట్రమ్ స్విచ్ ఆర్పలేను.
మరిన్ని పరికరాలు చేర్చుకుంటూ
దోవపొడుగునా నీడల్ని పెంచుకుంటూ
పోతున్నాను....

లోపలికి కాదు, పైకి కాదు.
అయోమయపు రాచబాట లోకి.



డాక్టర్ బి. ఆర్. కె. రావు

# 1982 అర్థికశాస్త్ర నోబుల్ బహుమతి గ్రహీత ప్రొఫెసర్ జార్జి స్టిగ్లర్

## నోబుల్ బహుమతికి కారణాలు

స్వీడన్ రాయల్ ఎకాడమి అఫ్ సైన్స్ వారు 1982 వ సంవత్సరానికి అర్థిక శాస్త్రంలో నోబుల్ బహుమతిని అమెరికా సంయుక్త రాష్ట్రాలకు చెందిన ప్రొఫెసర్ జార్జి పి. స్టిగ్లర్‌కు ప్రదానం చేసారు. 1969 లో సెంట్రల్ బ్యాంక్ అఫ్ స్వీడన్ వారు అర్థికశాస్త్రంలో ఈ బహుమతిని ఏర్పర్చిన తర్వాత, ఈ గౌరవాన్ని పొందిన అమెరికన్ అర్థిక శాస్త్రవేత్తలలో ప్రొఫెసర్ స్టిగ్లర్ పదకొండవవారు. ప్రస్తుతం డాక్టర్ స్టిగ్లర్ చికాగో విశ్వ విద్యాలయంలో చికాగో గ్రాడ్యుయేట్ స్కూల్ అఫ్ బిజినెస్‌లో చార్లెస్. అర్. వాల్‌గ్రీన్ డిస్టింగ్విష్‌డ్ ప్రొఫెసర్‌గా (1958 నుండి) పని చేస్తున్నారు. "పారిశ్రామిక చట్రరూపాలపై విశేష ప్రాముఖ్యతగల అధ్యయనాలు చేసినందుకు, మార్కెట్ల కార్య నిర్వహణను అధ్యయనం చేసినందుకు, ప్రభుత్వం క్రమబద్ధం చేయడానికి గల కారణాలను, దానివల్ల సంక్రమించిన ఫలితాలను అధ్యయనం చేసినందుకు "నోబుల్ బహుమతి ప్రదానం చేస్తున్నట్లు" స్వీడిష్ రాయల్ ఎకాడమి వారు ప్రకటించారు. అర్థిక వ్యవస్థ క్రమబద్ధీకరణకు ప్రభుత్వ ప్రయత్నాలు అన్న విషయం మీద స్టిగ్లర్ చేసిన రచనలవల్ల ఆయన అర్థికశాస్త్ర ప్రపంచంలో ప్రఖ్యాతి పొందాడు. 1947 లో ప్రభుత్వ క్రమబద్ధీకరణపై ప్రత్యేక కృషి చేయడా కి స్టిగ్లర్ పూనుకున్నాడు.

## ముఖ్య విశ్లేషణలు - పరిశోధన

బాటక నియంత్రణ, కనీస వేతన చట్టాలు, ప్రజోప యోగ పరిశ్రమల (పబ్లిక్ యుటిలిటీస్) క్రమబద్ధీకరణ, సెక్యూరిటీలు, ఎక్స్ఛేంజి కమిషన్లపై స్టిగ్లర్ చేసిన పాండిత్యం గల విశ్లేషణకు ప్రఖ్యాతి లభించింది. క్రమబద్ధీకరణవల్ల ఆశించని యితర ఫలితాలు కల్గుతాయని, ఈ ఫలితాలవల్ల ప్రజా ప్రయోజనాలకు నష్టం వాటిల్ల వచ్చుని ఈ పరిశోధన ద్వారా స్టిగ్లర్ తేల్చారు. ప్రకటించగానే వివాదానికి గురికాబడ్డ యీ నిర్ణయాలు నెమ్మదిగా మంచి అమోదం పొందసాగినై.

## రీగన్‌కు సహాయం

క్రమబద్ధీకరణకు సంబంధించిన వ్యయలాభాలపై స్టిగ్లర్ తయారుచేసిన సిద్ధాంతము రవాణా పరిశ్రమపై పెట్టిన కొన్ని క్రమ బద్ధీకరణ నియంత్రణను తగ్గించేటట్లు చేయడంలో ప్రముఖ పాత్రను నిర్వహించింది. ప్రభుత్వ నియంత్రణను తగ్గించడానికి రీగన్ పరిపాలన చేసిన ప్రయత్నాలను డాక్టర్ స్టిగ్లర్ బాగా బలపర్చాడు.

## లభ్య ప్రశంస

ఒకే వస్తువు ధరలలో తేడాలు వుండటానికి తమకు విభిన్న పరిమాణాలలో సమాచారం అందినప్పటికి, విభిన్న కుటుంబాలు, కంపెనీలు ఒకే రకమైన నిర్ణయం చేయడంవల్ల విపణి వీధిలో ఏర్పడే ప్రభావాలపై స్టిగ్లర్ చేసిన విశదీకరణలు అతని నోబుల్ బహుమతి ప్రదాన ప్రకటనలో గొప్పగా కొనియాడబడినవి.

## ముఖ్య రచనలు

న్యాయ సూత్రాలపై జరిగిన అర్థిక విశ్లేషణ అనువర్తింపు చేసిన ప్రముఖుల్లోని ప్రారంభకులలో స్టిగ్లర్ ఒకరనే ప్రఖ్యాతి

ఏర్పడింది. ట్రస్ట్‌లకు వ్యతిరేకంగా న్యాయ చట్టాలను చేయవలసిన అవసరం ఏముందని ప్రశ్నించే అధ్యయనాలను స్టిగ్లర్ ప్రచురించారు. ఆర్థిక శాస్త్ర చరిత్రపైన స్టిగ్లర్ చాలా విస్తృతంగా వ్రాసి ప్రకటించారు. 1) ది థీరీ ఆఫ్ ప్రైయిస్ (1946) చాలా విశ్వవిద్యాలయాల్లో పాఠ్య గ్రంథంగా ఉపయోగపడుతున్నది. 2) ది ఇంటలెక్ట్యుయల్ అండ్ ది మార్కెట్ ప్లేస్ (1964) 3) ది ఎస్సేస్ ఇన్ ది హిస్టరీ ఆఫ్ ఎకనామిక్సు (1965) అనేవి స్టిగ్లర్ వ్రాసిన గ్రంథాలలో ప్రముఖమైనవి.

**చ దు వు - ఉ ద్యో గా లు**

డాక్టర్ స్టిగ్లర్ 1911 లో వాషింగ్టన్ రాష్ట్రంలో జన్మించాడు. 1931 లో వాషింగ్టన్ విశ్వవిద్యాలయంలో గ్రాడ్యుయేట్ అయ్యాడు. 1932 లో బిజినెస్ ఎడ్మినిస్ట్రేషన్‌లో నార్త్ వెస్టరన్ యూనివర్సిటి నుండి మాస్టరేట్ డిగ్రీ తీసుకున్నాడు. 1938 లో చికాగో విశ్వవిద్యాలయం స్టిగ్లర్‌కు డాక్టరేట్ ప్రదానం చేసింది. లండన్ స్కూల్ ఆఫ్ ఎకనామిక్సు, మిన్నెసోటా యూనివర్సిటి, కొలంబియా చికాగో విశ్వవిద్యాలయాలలో ఈయన బోధించారు. చికాగో విశ్వవిద్యాలయంలో మరొక నోబుల్ బహుమతి గ్రహీత డాక్టర్ మిల్టన్ ఫ్రీడ్‌మన్‌కు స్టిగ్లర్ సహోపాధ్యాయుడుగా వున్నారు. స్టిగ్లర్ 1964 లో అమెరికన్ ఎకనామిక్ ఎసోసియేషన్ అధ్యక్షులుగా ఉన్నారు.



# న ర క ం

## శ్రీ నిఖిలేశ్వర్

అణగిమణగిన అరాటపు లావా
లోలోపల మరిగి మరిగి
ఎగజిమ్మిన ఒకనాడు
కదలని ఆకుల సందున
దాగిన దవానలపు నాలుకలు
భగ్గున మండును మరునాడు,

గది లోపలి గీసిన నీడల్లో
నీరవ నిశ్శబ్దపు లయలు
కాంతి సాగరంలో మెరిసే హోయలు.

పరపరలాడే కాగితాల మీద
దిక్కుల మధ్య దిసమొలతో
తెల్లదనాన్ని సొంతం చేసుకుంటున్న
కలం— దిక్కు తోచకపోతే
అన్నింటి ముందూ దిగతుడుపే ! ....

కవిత పలాయనానికి ఆశ్రయమైతే
అప్పుడప్పుడు దూరే
గుహలోని చీకటైతే—

శీఘ్ర స్ఖలనంలోని అంతిమ ఘట్టం
చరమగీతంలో ఉబికే రాగం
స్తంభించిన అనురాగంలో వెదికే స్వప్నం
అనునిత్యం శంకించే మనస్సు పొందే నరకం !



శ్రీ పి. వి. పరబ్రహ్మశాస్త్రి

# హైదరాబాదులో గోవిందరాజ విహార ప్రాకృత శాసనము

సుమారు నాలుగైదేండ్ల క్రిందట హైదరాబాదు నగరమునకు తూర్పున నూతనముగ అభివృద్ధి యగుచున్న చైతన్యపురిలో మూసినదికి కుడిగట్టున ఒక నిలువు రాతి గుండుపైన ప్రాకృతశాసనమొకటి గుర్తించబడెను. కాని అస్పష్టముగా నుండుట వలన అప్పట్లో దాని ప్రతిబింబములు సరిగా తీయలేక శాసనము నిరుపయోగ మైనదిగా భావించి యుపేక్షించితిని. అచటివారు దీనిని దేవుడి గుట్ట యందురు. శాసనమున్న నిలువు రాతిక్రింద నొక చిన్న ఆవరణకు గోడగ నేర్పడియున్న కొండరాతిపై నరసింహస్వామి రూపమును అనవాలుగ గుర్తించి ఆ దేవుని కొసగుండ్ల నరసింహస్వామియను పేరుతో పూజించుచుండిరి. దానికి సంబంధించిన కార్యకర్తలు ఆ రాతిపైనున్న శాసనమును పరిశోధించవలసినదిగా పురావస్తుశాఖ డైరెక్టరు డాక్టరు వి. వి. కృష్ణశాస్త్రి గారిని ఇటీవల కోరిరి. వారి సహాయోద్యోగులు ఆ శాసనమునకు ప్రతిబింబములు తీయుటకై మిక్కిలి కృషి చేసిరి. కాని సరియగు ప్రతిబింబములు లభించలేదు. శాసనాక్షరములు లోతుగా లేకుండుటవలనను, రాయి నునుపుగా లేకుండుటవలనను శాసనప్రతిబింబము దుర్లభమయ్యెను. దీనికి తోడు శాసనము ఆ గుట్టమీది భూమి పైన సుమారు పది యడుగుల యెత్తున నుండుటవలన అక్షరములు నెమ్మదిగా చదువుట గూడ కష్టమయ్యెను. కాని ఆ దేవస్థాన కార్యకర్తల సహాయముతో నిచెనపై నిలుచుండి నెమ్మదిగా మూడు రోజులు ప్రయత్నించి ఆ శాసనమునకు ఒక మోస్తరుగా నకలు వ్రాయగలిగితిని. ఆ పాఠమును పురస్కరించుకొని గడచిన మార్చి మొదటి వారములో ఉత్తరప్రదేశ్ గోరక్పూరు విశ్వవిద్యాలయములో జరిగిన భారతీయ ఎపిగ్రాఫికల్ సొసైటీ తొమ్మిదవ వార్షిక సమావేశములో ఈ నూతన ప్రాకృత శాసనమును గూర్చి యొకపత్రము జదివితిని. ఒకప్పుడు పనికిరాదని విడిచి వేయబడిన ఈ శాసనము ఆ సమావేశములో చారిత్రకముగా విలువైనదిగా గుర్తించబడెను. చైతన్యపురి నరసింహస్వామి దేవస్థాన నిర్వాహకులు, రాష్ట్ర పురావస్తు శాఖాధికారులు నా కొసగిన సహాయమునకు ప్రోత్సాహమునకు వారికి కృతజ్ఞతలు దెలుపుచుంటిని.◆

**శాసన లిపి - భాష**

శాసనమంతయు ఆరు పంక్తులలో వ్రాయబడి యున్నది. కాని యిదియే పూర్తి శాసనమనుటకు సందేహము కలదు. ఇది యున్న నిలువు రాతికి శిఖర సమీపమున క్రిందినుండి సుమారు 30 అడుగుల ఎత్తున మూడు నాలుగు పంక్తుల వ్రాత యిదే లిపిలో గనుపించు చున్నది. ఆ వ్రాతకు ఈ శాసనమునకు సంబంధమున్నదో, లేదో చెప్ప వీలుగాకున్నది. దాని చేరువకు వెళ్ళి పరిశీలించుట కష్టసాధ్యమై యున్నది. క్రిందినుండి చూడగా అందు సంయుక్తాక్షరము లున్నట్లు కనుపించుచున్నవి. అందువలన అది సంస్కృత భాషలో రచింపబడియుండునని తోచుచున్నది. దానిని కూడ వీలుచూచుకొని చదువవలసి యున్నది. ఈ శాసనాక్షరములు బ్రాహ్మీ లిపికి చెందినవి. అయినను తెలుగు దేశములో నాగార్జున కొండ, అమరావతి, జగ్గయ్యపేట, అలూరు మున్నగు స్థలములలో క్రీ. శ. మూడు నాలుగు శతాబ్దుల కాలము నాటివిగా నిశ్చయించి చెప్పబడుచున్న శాసనముల బ్రాహ్మీ లిపి కంటె ఈ శాసన లిపి కొంత విలక్షణముగా నున్నది. ఈ క్రింది అంశములు ఆ విశేషమును సూచించుచున్నవి.

1. 'క', 'ర' అక్షరముల నిలువు రేఖలు క్రింది భాగమున ఎడమ వైపుకు కొద్ది వంకరను మాత్రమే తిరిగి నాగార్జున కొండ శాసనములందువలె పూర్తి వంపుతిరిగి లేవు.

2. 'ఇ' కారగుడి అక్షరము పైన ఎడమవైపు తిరిగిన వక్రరేఖగ జూపబడెను.

3. 'ల' అక్షరము నాగా. కొండ శాసనములందు వలె ఇప్పటి తెలుగు 'బి' వలె గాక ఇంచుమించు ఇప్పటి తెలుగు 'న' వలె ఉన్నది. ఇట్టి 'ల' అమరావతిలో ఒక చోట, ఘంటశాలలో ఒక చోట కనుపించును. గుప్తరాజుల శాసనాల్లోను, మధురలో కొన్ని చోట్ల ఇట్టి 'ల' అనగా తెలుగు 'న' ను బోలియుండునది బహుళముగా గానవచ్చును.

4. అనుస్వారము నాగా కొండ, అమరావతి శాసనాల్లో అక్షరములపైన బిందువుగా చూపబడును. కాని ఈ శాసనంలో అనుస్వారము లన్నియు చిన్న సున్నలుగ 'ం' అక్షరముల పైని జూపబడెను. ఉత్తరదేశ శాసనములందే యిట్టి అనుస్వారము ఆనాటి బ్రాహ్మీ లిపిలో కొన్నిట గనవచ్చును. మన ప్రాంతములో అరుదు.

5. 'గ', 'థ' అక్షరములు విడిచి మిగిలిన ప్రాథమికాక్షరములు తలకట్టు స్థానములో నొక చుక్కగాని, చిన్న అడ్డుగీతగాని గుర్తింప బడెను. ఈ యంశమున క్రీ. శ. 3, 4 శతాబ్దముల బ్రాహ్మీ లిపితో పోలియున్నవి.

మొదటి రెండు అంశములు నాగార్జున కొండ శాసనాల కంటెను పూర్వ దశను సూచించుచున్నవి.[1] కాని ఉత్తర దేశమందలి గుప్త శాసనాల్లోని లిపి యీమాత్రం వంపు కూడ లేని 'క, ర' లు కలిగియుండును. కనుక దక్షిణదేశ లిపిలోని అలవాటును వ్రాతగాడు అనుకరించినట్లు తోచును. అక్షరములు 10–15 సెం. మీ. ల విపులముగ వ్రాయబడెను. 'ల' ను మన యిప్పటి తెలుగు 'న' ను పోలియుండునట్లు వ్రాయుట క్రీ. శ. నాలుగో శతాబ్దం మధ్యకాలం నాటి సముద్రగుప్తుని అలహాబాదు శాసనంలోను[2] తదితర శాసనాల్లోను ఉత్తర దేశంలో కనుపించును. గుప్తరాజుల శాసనములందు గల కొన్ని అక్షరములను బోలినవి ఇటీవల కర్నూలు మండలములో క్రొత్తగా కనుగొనబడిన గుహాలోని వ్రాతలో గనవచ్చుచున్నవి. వీటిని ఇంకను పరిశోధించవలసి యున్నది. వీటిని బట్టి జూడ క్రీ. శ. నాలుగవ శతాబ్ద మధ్య కాలంలో జరిగిన సముద్రగుప్త చక్రవర్తి దక్షిణ దండయాత్ర తరువాత తెలుగు దేశములో దాని ప్రభావము కొంత మిగిలెనని చెప్పవచ్చును.[3] ప్రస్తుత శాసనాక్షరములలో కొన్ని గుప్త శాసనాక్షరములను పోలియుండుట విశేషము.

శాసన భాష ప్రాకృతమని చెప్పదగినను, నిజమునకు సంస్కృత ప్రభావము ఎక్కువగా కలిగి పాలీ భాషకు సన్నిహితముగా గనుపించును. భాష పూర్తిగా నాగార్జున కొండ శాసనాల్లోని ప్రాకృతానికి భిన్నముగా తోచును. శాసనమందు నాలుగవపంక్తిలో 'బమ్రిదేవ' అను పేరులో తప్ప మఱియెచ్చటను సంయుక్తాక్షరము గానరాదు. మనవైపున గల ప్రాకృత శాసనాల్లో సంయుక్తాక్షరము లనేకము వచ్చుచుండును. కాని యిందు అట్లు కాదు. అక్షరములనుబట్టి గాని, భాషలో సంస్కృత ప్రభావమును బట్టి గాని యీ శాసనము నాగార్జున కొండలోని ఇక్ష్వాకు శాసనాలకంటె కొద్దికాలము మాత్రమే తరువాతిదిగా కనుపించుచున్నది. పల్లవ సింహవర్మ యొక్క మంచికల్లు ప్రాకృత శాసనం[4] సుమారు క్రీ.శ. నాలుగో శతాబ్దం మొదటి పాదములోనిదిగా జెప్పబడుచున్నది. దానికంటె దీనినొక అర్ధ శతాబ్దం తరువాతదిగా జెప్పవీలగును. అట్లు చెప్పుటకూడ కొన్ని ఉత్తర దేశపు ఆ కాలపు బ్రాహ్మీ అక్షరములుండుటను బట్టియే. లేకపోయినచో ఇది కూడ మంచికల్లు శాసనము నాటిదని చెప్పవచ్చును. ఏమైనను లిపిని భాషను పురస్కరించుకొనియే యీ శాసన కాలమును ఊహించవలెను గాని శాసనమందు తేదీ లేదు. క్రీ.శ, నాలుగో శతాబ్దం చివరి ముప్పదేండ్లలోనిదిగా దీనిని చెప్పవచ్చును. అంతకు తరువాత కాలమునకు దీనిని సరిపెట్టుట యుక్తము కాదనిపించును.

## శాసన పాఠము

(ఇది ఫొటోనుండి చూచి వ్రాసినది మాత్రమే. కొన్నిచోట్ల సంశయములు గలవు. నిర్దుష్టమైన పాఠము లభించినపుడు సవరించు కొనవలసి వచ్చును.)

1. పురిమ వి[దాల] పాండహులావాస(ం) పుథగిరి మహా-
2. విహార పతి థాపకస వసుదేవ సిరి దామస మహా-
3. వీతరాగస [మదాఇ] పిండపాతిక [దా] మధరస
4. పరంపరాగతస బమ్రిదేవ [ధె] విరస పిసె [ ]
5. సంఘ [దేవెవ] గోవిందరాజ విహారస గంధక చివారిక
6. [....]త సెలాసంవాస ధ (ఘ) రం పతిథాపితం [॥*]

## హైదరాబాదులో గోవిందరాజ విహార ప్రాకృత శాసనము

### అర్థము

ఇందు సందేహాస్పదముగనున్న అంశములను విడిచినను ఈ క్రింది అర్థము తెలియుచున్నది.

"పుడగిరి యను చోటున మహా విహారము నొకదానిని ప్రతిష్ఠించిన వసుదేవ సిరి దాముడను మహా వీతరాగుని (........) పిండపాతిక శాఖకు చెందిన దామ ధముడను (బౌద్ధ సన్న్యాసి) యొక్క (శిష్య) పరంపరలో జేరిన బమ్రిదేవ [థ] విరునియొక్క శిష్య సంఘమున జేరిన (దేవెవ చేత ?) గోవిందరాజ విహారమునకు గంధాదులను. వస్త్రాదులను భద్రముచేయు (కొరకు ?) (వారి కొరకు?) శిలా (నిర్మిత) సంవాస గృహము ప్రతిష్ఠించబడెను."

ఇందు మొదటి పంక్తిలో 'పురిమ విదాల పాండహులా వాసం' అను భాగములో 'పాండహులావాసం' అనునది మాత్రమే కొంత బోధపడుచున్నది. 'పాండవులు' అను పదము తెలుగులో 'పాండహులు' అని తెలుగులో భ్రష్టరూప మనిపించుచున్నది. పది + ఆరు = పదహారు; పది + ఏడు = పదిహేడు; అట్లే పధ్నాలుగు, పదిహేను అను సంఖ్యాపదములే గాక, 'ఆడ' అనుటకు 'హాడ' అనియు కొన్ని పదములు అనవసరమగు 'హ' కార యుక్తముగ గలవు.

అట్లే 'పాండహులావాసం' పాండవుల నివాస స్థానము అను అర్థములో ప్రయోగింప బడెను. పాండవుల నివాసస్థాన మైనట్టి పుడగిరి అని అర్థమగుచున్నది. దక్కనులో పాండవు లనబడే గిరిజనులు గలరు. అంతేగాక పాండవుల గుళ్ళు, పాండవుల మిట్ట అని పిలువబడుచున్న కొన్ని గుట్టలు, వాటి దగ్గర కొన్ని మెగలిథిక్ సమాధులు (బృహచ్ఛిలా యుగపు జనులవి) అనేకం కనుపించుచుండును. కనుక ప్రస్తుత శాసనమున్న దేవుని గుట్ట పూర్వము పాండవులనబడు జాతివారు నివసించు చోటు కావచ్చును. అచటిదే పుడగిరి కావచ్చును. లేదా పుడగిరి యన బడు వేరొక కొండ యెచ్చటనో ప్రస్తుతము తెలియనిచోట ఉండి అది పాండవులనబడు జాతివారి స్థావరమై యుండినను కావచ్చును. పుడగిరి అనేది యెచ్చటగలదో నిశ్చయముగా తెలియదు. ఇది యొక బౌద్ధ విహారము గల చోటు కావలెను. సూర్యాపేట

తాలూకాలో ఫణిగిరి అనబడే చోట మహావిహార మొకప్పుడున్నట్లు తెలియుచున్నది. దానిని తెలుగులో 'పుట్టకొండ' అని పూర్వము పిలిచెడివారేమో. అదే 'పుధగిరి' అనియు తరువాత సంస్కృతంలో 'ఫణిగిరి' అనియు వ్యవహరించబడెనేమో తెలియదు. అచట బౌద్ధ విహారమొకటి యుండుటను బురస్కరించుకొని, కొద్ది నామ సామ్యాన్నిబట్టి చేసిన ఊహ మాత్రమే యిది. నిజమని విశ్వసించ రాదు. భావి పరిశోధనలను బట్టి నిర్ణయించ వలసినదే.

ఈ శాసనం బౌద్ధ విహారమును గూర్చి చెప్పుచున్నది కదా. ఉత్తర దేశములో పాటలీపుత్ర సమీపమున రాజగృహ మనెడి పూర్వమొక రాజధానీ నగరముండెడిది. బుద్ధుడు తనకు జ్ఞానోదయము కలుగక ముందు బోధి సత్వుడుగ కొంతకాలము రాజ గృహములో భిక్షాటన మొనర్చుచు దాని సమీపమున పాండవ పర్వతమను కొండపై గడిపెననియు, ఒకనాడు రాజ గృహమం దున్న బింబిసారుడను రాజు బోధిసత్వుడుగ నున్న గౌతముని చూచుటకై పాండవ పర్వతమునకు వచ్చి అతనిని రాజ గృహ మునకు వచ్చి తనతోబాటు రాచరిక జీవనము గడపవలసినదిగా కోరెననియు సుత్తనిపాతములో చెప్పబడెను.[5] తరువాత అశోకుడు ఆ పాండవ పర్వతముపై నొక విహారము నిర్మించెనట. మన శాసనములోని 'పాండహులావాసం' పుధగిరి లోని మహావిహారము దానికి సంబంధించినదేమో తెలియదు. పైజెప్పిన ఫణిగిరిగా 'పుధ గిరి' ని గుర్తించుట కంటె 'పాండహులావాసం' రాజ గృహము దగ్గరున్న పాండవ పర్వతముగా గ్రహించుటయే యుక్తముగా కనుపించుచున్నది. మన శాసనమందలి పాలీభాష, కొన్ని ఉత్తర దేశ బ్రాహ్మీలిపి పోలికలు గల వ్రాత యిందుకు ప్రోద్బలకముగా నున్నవి. ఈ శాసన మున్న చోటున కూడ విహారమొకటి యుండె నని యిందు చెప్పబడెను. స్తూపమున్నదేమో తెలియదు పైకి చిహ్నము లేవియు గనుపించుట లేదు. బహుశ ఇది హీనయాన బౌద్ధుల విహారమై యుండును. భావిపరిశోధనల వలన గాని యీ విషయము తేలదు. కనుక 'పాండహులావాస' పదమును గూర్చిన చర్చ యెట్టి నిర్ణయమును తెలుపజాలదు. దానితో జేరి యున్న 'పుధగిరి' ని గుర్తించుట కూడ అశ్లే యున్నది. అచట వసుదేవ సిరిదా ముడను వాడు మహావిహార మొకదానిని స్థాపించెను ఈయన బౌద్ధాచార్యుడో లేక బౌద్ధ మతాభిమానియగు శ్రీమంతుడో తెలియదు. మహాపీతిదాగ డను విశేషణ ముండుటను బట్టి బౌద్ధా చార్యుడగునని తోచుచున్నది. తరువాత పేర్కొనబడిన వాడు పిండపాతిక దామధరుడు. ఇతడు బౌద్ధాచార్యుడే. పిండపాతికు లను వారు హీనయాన బౌద్ధులలో నొక శాఖకు చెందిన వారు.[6] గృహస్థుల యిండ్లలో ఆతిథ్యము, విందులు అంగీకరింపక కేవల భిక్షాన్నముతోనే జీవయాత్ర గడుపు బౌద్ధసన్న్యాసులు పిండపాతికు లన బడుదురు. బౌద్ధ భిక్షువు లందరు ఈ నియమము పాటించెడు వారు కాదు. ఆంధ్రదేశములో లభించిన బౌద్ధశాసనములలో పిండ పాతికుల బ్రసక్తి అరుదుగ గానవచ్చును.[7] ప్రస్తుత శాసన ములో పిండపాతిక శాఖకు జెందిన దామధరుడు పేర్కొనబడు టయే గాక అతని శిష్య పరంపరలోని వాడైన బ్రమదేవ స్థవిరుడు ఇచటి గోవిందరాజ విహారమునకు యజమానిగ జెప్పబడెను. కనుక ఈ విహారము ఆ శాఖకు చెందినదియే కావచ్చును. మన ప్రాంతమున పిండపాతిక శాఖకు చెందిన బౌద్ధ విహారము ఇది యొకటి నిశ్చితముగ తెలియవచ్చు చున్నది. అచటి ప్రధానా చార్యుని శిష్యులలో నొకరు (పేరు స్పష్టముగ లేదు) ఈ గోవింద రాజ విహారమునకు అనుబంధముగ గంధ, వస్త్రాదులను భద్రము చేయుటకై లేక, వాటిని ఆ విహారమునకు సమకూర్చు వారి కొరకు ఈ శిలాగృహమును నిర్మించినట్లు ఈ శాసనము తెలుపుచున్నది. ప్రస్తుతము ఈ శాసనమున్న పెద్ద గుండుతాయి, దానిక్రింద నర సింహస్వామి గల చిన్న గుహ మాత్రము గలవు. విహారము యొక్క చిహ్నము లేవియు గనిపించుట లేదు. ఆ పరిసరములందు అచ్చటచట త్రవ్వి పరిశోధించుచో విహార నిర్మాణ చిహ్నములు లభించుట కవకాశము కలదు. హీనయాన విహారములకు అనుబంధ స్తూపములు ఒక వేళ యున్నను మిక్కిలి నిరాడంబముగ నుండెడివి.

ఈ శాసనములో ఆంధ్రదేశ చరిత్రకు సంబంధించిన ఒక విశేషాంశము గలదు. ఇచటి విహారము గోవిందరాజ విహారమని పేర్కొన బడెను చరిత్రకు తెలిసినంతలో క్రీస్తుశకము నాలుగు అయిదు శతాబ్దాలలో ఈ ప్రాంతమున రాజ్య మేలిన గోవింద రాజు విష్ణుకుండి వంశమునకు జెందిన గోవిందవర్మ తప్ప వేరొ కరు తెలియదు. ఈ గోవిందవర్మయొక్క తామ్ర శాసనమొకటి యిటీవల సుమారు రెండు దశాబ్దములకు పూర్వము మూసీనది యొడ్డున, నల్లగొండ జిల్లా, రామన్నపేట తాలూకాలోని తుమ్మల గూడెం గ్రామములో దొరికెను. దానితోబాటు ఆ వంశపు కడపటి రాజైన నగిన రెండవ విక్రమేంద్రవర్మ యొక్క తామ్రశాసనము

గూడ లభించెను. ఈ రెండు తామ్రశాసనములను నా మిత్రులు శ్రీ బి. యన్. శాస్త్రిగారు మొదట 1965 లో భారతిలో ప్రకటించిరి.8 వారే వీటిని మొదట సంపాదించిరి కూడ. తుమ్మల గూడెము ప్రస్తుత చైతన్యపురి శాసనమున్న చోటునకు మూసీ నదికి దిగువన సుమారు 40 కి. మీ. దూరమున గలదు. మఱియు ఆ శాసనములందు విష్ణుకుండి గోవిందవర్మ బౌద్ధమతావలంబి యనియు, దక్షిణా పథమునందు అనేక స్తూపములను, విహారములను నిర్మించెనని చెప్పబడెను.

"షడభిజ్ఞ ప్రాతిహార్య దర్శనానుగ్రహ జనిత సుగతశాసనాభి ప్రసాదస్య, విబుధ భవన ప్రతిస్పర్ధిశోభా సముదయానేక మహావిహార ప్రతిష్ఠాపనాధిగతానన్త బ్రాహ్మపుణ్య సంభారస్య మహారాజ శ్రీ గోవింద వర్మణః" అనియు,

"ప్రతి విషయ మతి బహుప్రకార మనోరమోదార కర్మాద్భుత స్తూప విహార చూడామణిభిరలంకృత సకల దక్షిణా పథస్య"

అనియు9 గోవిందవర్మ కీర్తింప బడెను.

కనుక ఆ విష్ణుకుండి వంశపు గోవిందవర్మయే హైదరాబాదు సమీపము నందున్న చైతన్యపురిలోని శాసనమందు అచటి విహార నిర్మాతగా పేర్కొనబడిన గోవిందరాజు అనుటలో సంశయము లేదు. పై నుడివిన తుమ్మలగూడెం శాసనమొక దానిలో గోవిందవర్మయే గోవిందరాజు అని కూడ పేర్కొన బడెను గనుక ఈ రెండు పేర్లు ఒకరివే తెలుపును. ఈ ప్రాంతము అతని యేలుబడిలో నున్నట్లు గూడ ఆ శాసనములే నిరూపించు చున్నవి. ఇంక కాలమును గూర్చిన అంశము చెప్పవలయును. ఆ శాసనములందు గోవిందవర్మ విష్ణుకుండి వంశమునకు మొదట స్వాతంత్ర్య రాజ్యమును సంపాదించి వంశస్థాపకుడైనట్లు సూచింప బడెను. చరిత్ర పరిశోధకులు అతని రాజ్యకాలము క్రీ. శ. 422 నుండి 462 వరకు కాగలదని అభిప్రాయపడిరి.10 కాని ప్రస్తుత హైదరాబాదు శిలా శాసనమందలి లిపియు, ప్రాకృత భాషయు కనీసమొక అర్ధ శతాబ్దమైనను పూర్వపు కాలమునకు చెందినవిగా తోచు చున్నవి దీనిబట్టి ఆ రాజుల కాలపట్టికను ఆ మేరకు ముందునకు అనగా పూర్వమునకు సర్దుకొనిపోవలసి వచ్చునని పించును. అందువల్ల డా. శంకరనారాయణగారు, డా. వెంకటరమణయ్యగారు నిర్ణయించిన చరిత్ర పూర్తిగా తారుమారు కావలసి వచ్చునని సంశయింప బనిలేదు. విష్ణుకుండి చరిత్రలో కాల నిర్ణయమును నిశ్చయముగా తెలుపునది తుమ్మలగూడెం రెండవ విక్రమేంద్రుని శాసనములో చెప్పబడిన శకవర్షము 488 సరియగు ఆ రాజు యొక్క 11 వ రాజ్యవర్షము. ఈ తేదీ క్రీ. శ 566 కు సరిపోవుచున్నది. అది అతని పదునొకండవ రాజ్య వర్షము గనుక ఆ రాజు క్రీ. శ. 555 లో రాజ్యాభిషిక్తుడై యుండునను విషయము నిశ్చితాంశము అతని పూర్వపు రాజుల కాలములను గూర్చి చేసిన నిర్ణయములన్ని ఊహామాత్రములే అందులో ఏకాదశాశ్వమేధయాజియు, చక్రవర్తి యనియు గీర్తి నొందిన ద్వితీయ మాధవవర్మ పెద్ద కొడుకు దేవవర్మయు ఇతని పుత్రుడు తృతీయ మాధవవర్మయు చరిత్రకు శాసనముల ద్వారా తెలియ వచ్చుచున్నను (ఈపూరు రెండవ శాసనము) వారిరువురి పూర్తి కాలమును రెండవ మాధవవర్మ చక్రవర్తి పరిపాలనా కాలములో అంతర్భావము గావించిరి. ఇందుకు ఊహతప్ప వేరొండు హేతువు బలమైనది కానరాదు. అట్లే మాధవవర్మ చక్రవర్తి రెండవ కొడుకు మొదటి విక్రమేంద్రుని రాజ్య కాలమును అవసరమును బట్టి 10-25 ఏండ్ల మధ్య యిష్టము వచ్చినట్లు సర్దుబాటు చేయుచుండిరి. ఇట్లు అవ్యవస్థముగా నున్న కాలములో దేవవర్మ, అతని కొడుకు మూడవమాధవవర్మల రాజ్యకాలమును విడిగా చూపుచు రెండవమాధవవర్మ చక్రవర్తి కాలమును, ఇతని తండ్రియైన ప్రస్తుత శాసన గోవిందవర్మ రాజ్యకాలమును సుమారు నలుబది, యేబది యేండ్లు ముందునకు అనగా పూర్వమునకు సర్దుబాటు చేయుట వలన వచ్చెడి తీరని చారిత్రక సమస్యలంతగా కనుపించవు. ఆ చరిత్ర నంతయు తిరిగి యిచట చర్చించుట సుదీర్ఘమగును. పరిశోధకులు ఇంతవరకు చేసిన ఊహామాత్రపు సూచనలలో కొన్ని సర్దుబాట్లు అవసరమగునని ప్రస్తుత శాసనమును బట్టి తెలియుచున్నది.

శాతవాహనుల తరువాత కృష్ణానదీ ప్రాంతమును ఇక్ష్వాకులు పాలించిరి. కాని వారి అధికారము ఉత్తరమున ఇప్పటి హైదరాబాదు వరకు వ్యాపించెననుటకు ఆధారములు లేవు. కనుక ఈ ప్రాంతమును సముద్రగుప్త దండయాత్ర వరకు ఏ రాజులు పాలించిరో తెలియదు. అనగా సుమారు క్రీ. శ. 225 నుండి 350 వరకు ఇచటి చరిత్ర సరిగా తెలియదు. గుప్త దండయాత్ర తరువాత ఈ ప్రాంతములో విష్ణుకుండి రాజులు నెలకొని యుండి యుందురని ప్రస్తుత శాసనమును బట్టి ఊహించ వీలగుచున్నది. వీరు తము 'భగవచ్ఛ్రీ పర్వత స్వామి పాదానుధ్యాతుల' మని శాసనములందు ప్రశంసించి కొనుటను బట్టి వీరు శ్రీపర్వతమునకు చేరువలోనే మొదటినుండి యుండియుందురు. అచట అమరాబాదు ప్రాంతమున చంద్రగుప్తి (సంద్రగుప్తి) నగరమను నొక శిథిల దుర్గము గలదు. కనుక విష్ణుకుండి రాజులు మొదట గుప్తరాజానుయాయులుగ తెలంగాణమునందు రాజ్యస్థాపన జేసికొని యుందురేమో పరిశోధించవలసి యున్నది.

## ము గిం పు

ప్రస్తుత శాసనము వలన లభించుచున్న నూతన చరిత్రాంశములు :

౧. హైదరాబాదు ప్రాంతములో దొరకిన మొదటి ప్రాకృత శాసనమిదియే.

౨. క్రీ. శ. 15-16 శతాబ్దములనుండి మాత్రమే అనగా మహమ్మదీయుల రాక తరువాతనే తెలియవచ్చుచున్న హైదరాబాదు ప్రాంతీయ చరిత్ర దీనివలన శాసనపూర్వకముగా క్రీ.శ. 4-5 శతాబ్దముల నాటికి గొనిపోబడుచున్నది. సుమారు 15 కి.మీ దూరమున గల కీసర గుట్టలో పురావస్తు శాఖవారు జరిపిన త్రవ్వకములనుండి కూడ క్రీ. శ. 2-5 శతాబ్దులనాటి చరిత్ర తెలియుచున్నదని ఆ యధికారుల అభిప్రాయము, వారి నివేదిక వెలువడవలసియున్నది.

౩. హైదరాబాదులో చేరియున్న చైతన్యపురి పూర్వమొకప్పుడు బౌద్ధమతానుయాయుల స్థావరమై యుండెను. అచట హీనయాన శాఖకు చెందిన పిండపాతిక సంప్రదాయపు భిక్షుకుల విహారముండెడిది.

౪. ఆ విహారమును విష్ణుకుండి వంశ స్థాపకుడని చెప్పబడు గోవిందవర్మ మహారాజు నిర్మించెను.

౫. ఆ రాజు యొక్కయు, ఆ వంశము యొక్కయు మొదటి శాసనము, ప్రాకృత శాసనము ఇప్పటికి ఇదియే కాదగును. అకాని తుమ్మలగూడెం తామ్రశాసనము తిరుగ వ్రాయబడినదై యుండునవి కొందరి అభిప్రాయము. ఇది శిలాశాసనము గనుక అట్టి సంశయమునకు తావు లేదు. ఇప్పటికి దొరకిన వారి శిలా శాసనములలో నిది రెండవది. కాలమునుబట్టి మొదటిది. వేరొ వేల్పూరు శిలా శాసనము ప్రకటించబడెను (ఎ పి. ఇం. 37, పుట 1 8)

౬. ఈ శాసనమందలి లిపిని బట్టి విష్ణుకుండి గోవిందవర్మ రాజ్యకాలమును సుమారొక యేబదేండ్లు పూర్వమునకు అనగా ఇప్పుడు గ్రహింపబడిన క్రీ శ. 422-462 కాక సుమారు క్రీ శ. 360-400 మధ్య సర్దుబాటు చేయుట యుక్తమని తోచును

౭. ఈ శాసనమును, తుమ్మలగూడెం మొదటి శాసనమును బట్టి విష్ణుకుండి రాజులు మొదట తెలంగాణములోని నల్లగొండజిల్లా, మహబూబు నగరం జిల్లాలో కల్వకుర్తి, అచ్చంపేట తాలూకాలతో గూడిన ప్రాంతమును పాలించుచుండెడి వారని విశదమగుచున్నది.

౮. ఉత్తర దేశపు కొన్ని పోకడలు ఈ శాసన లిపియందు భాషయందు పొడసూపుటను బట్టి సముద్రగుప్తుని దండయాత్ర ఫలితముగ ఈ ప్రాంతములో స్వల్పముగనైనా ఉత్తరాది సంపర్కము మిగిలియుండెనని తోచును.

## అ ధో జ్ఞా పి క లు

◆ ఇందుకు తోడ్పడిన వారిలో ముఖ్యులు శ్రీయుతులు లోకనాథంగారు, లూకానందరావుగారు, సి. సంగయగుప్తగారు, యన్. సింగుగారు, గ్రామాధ్యక్షులు భిక్షపతిగారు.

1. ఎపిగ్రాఫియా ఇండికా 35, పుటలు 13, 14 ల వద్దగల ప్లేట్లు
2. కార్పస్ ఇన్‌స్క్రిప్షన్- ఇండికేరం III - 6
   డి. సి. సర్కారు- సెలెక్టు ఇన్‌స్క్రి- ప్లేటు 45
3. శ్రీశైలమునకెదుట అమరాబాదు అడవిలో 'చంద్రగుప్తనగర'మని పేర్కొనబడు శిథిల ప్రాంతముకూడ ఈ సందర్భమున గమనించ దగియున్నది.
4. ఎపి. ఇండికా. 32, పుట 87.
5. సుత్తనిపాతము, పబ్బజ్జ సుత్త.
   ధర్మానంద కోశాంబి, 'బుద్ధభగవానుడు', 5 వ ప్రకరణము.
6. ఈ విషయము తెలిపి తోడ్పడినందుకు ప్రొ. అజయమిత్ర శాస్త్రి, నాగపూరు విశ్వ విద్యాలయ ఆచార్యులకు కృతజ్ఞతలు తెలుపుచుంటిని.
7. అమరావతి శాసనాల్లో (ఎపి. ఇం. X, లూడరు- పట్టిక, 1272) ఒకదానియందు మహా వనశాల వాసియగు వసు (ప్రశమ) యను పిండపాతిక బౌద్ధ సన్న్యాసి పేర్కొనబడెను.
8. భారతి 1965, జూన్ - పుటలు 14-28, జూలై - పుటలు 2- 14 'ఇంద్రపాల నగర తామ్రశాసనములు' అను శీర్షిక క్రింద- తుమ్మలగూడెం గ్రామమునకు అవలి యొడ్డున ఇంద్రపాల నగరము (ఇందుపురం) గలదు. ఒక తామ్రశాసనములో శకాభిధాన నగరము పేర్కొనబడెను. శ్రీ బి. యన్. శాస్త్రిగారి ప్రకటన తరువాత ఈ శాసనములను గూర్చి పలువురు పరిశోధకులు వ్రాసిరి. డా. యస్. శంకర నారాయణగారు రచించిన "ది విష్ణుకుండిస్ అండ్ దైర్ టైమ్స్" అనే గ్రంథము, డా నేలటూరి వెంకటరమణయ్యగారి "విష్ణుకుండినులు" అను గ్రంథము చూడదగును.
9. ది విష్ణుకుండిస్ అండ్ దైర్ టైమ్స్, పుటలు 172, 173.
10. పుట 13



# నిరీక్షణ కొండలు

ఈ కొండలు ఇట్లా ఎంతకాలంగా
ఎదురు చూస్తున్నాయో
ఆశతో....ఆర్తితో.
తనువంతా పచ్చదనం నింపుకొని
మనసులో వెన్నెల మడుగులుంచుకొని
ఆకాశపు ఆవలి అంచుకు
అదే పనిగా మేఘసందేశాలు పంపుతూ

సముద్రాల దారుల్లో
సమాధానాలు వెదకుతూ
పలకకుండా పలికిస్తూ
కదలకుండా నను కదిలించే
ఈ నిరీక్షణ కొండలు
ఏ నాటివో !

# మూగ భావాలు

బొట్టుబొట్టుగా మానవతా చెట్టు రాల్చిన
అత్తరు చుక్కల ఘుమ ఘుమలు
గుండెనిండా గుబాళింపుల పులకింతలు-

బొట్టుబొట్టుగా కన్నీటి చుక్కలు
ఆహుతైన తమ పసి శిశువులకై
ఆక్రందించే మూగ ఘోషలు-

ఎన్ని రాత్రిళ్ళు భరిస్తే
ఎంతగా గుండెను కోస్తే
ఆవిర్భవించాయో యీ అక్షర సృష్టిశక్తులు !

వ్యథా వేదనా సోధనా
బ్రతుకు బ్రతుకంతా నివేదన—

ఒక్క శాంతి పావురం కోసం
రక్తపు నదులు పారినట్లు—

దోసెడు భావాల కోసం
ఆకాశం పట్టనంత ఆవేదన నిండినట్లు—

మస్తకాన్నీ మానవత్వాన్నీ
గెలికేస్తూ గేలిచేస్తూ
టిక్కు టిక్కు మంటూ
నిశ్శబ్దపు సుత్తి దెబ్బలు!

నీలి సముద్రపు చైతన్యపు అలలు
శిలల పాదాల ముందు
తలలు బాదుకున్నట్లు
విఫలమైపోతున్న ఎన్నెన్నో కలలు!

ఫెళఫెళ మంటూ యింకా తెగిపడని సంకెళ్ళూ,
గనుల్లో కార్ఖానాల్లో
జీవితాలు శిలువవేయబడ్డ చిన్ని చిన్ని క్రీస్తులూ,

నా కళ్ళ తెలివిజన్లలో నిల్చి
ప్రశ్నిస్తూ పరిశ్నిస్తూ
రోదసి కెగసే మానవుని
వెంబడిస్తూ. .వెంబడిస్తూ.. .! ....!

# అనుభూతుల అలజడిలో...

కలలు విరిగినపుడు
కనులు చెమరినపుడు
కథలల్లుదును నేను
కవిత నొదును నేను.

పూలు విరిసినపుడు
పుడమి నవ్వినపుడు
పరవశింతును నేను
పరుగు లిడుదును నేను.

లోకాన శోకమే నిండినపుడు
ఏకాకి నా మది రగిలినపుడు
పాట నొదును నేను
పోరాట మొదును నేను.

మనసు ఎదిగినపుడు
మమత పొంగినపుడు
భావ మొదును నేను
అనురాగ మొదును నేను.

శ్రీమతి అదూరి సత్యవతీదేవి



శ్రీ ఏల్చూరి మురళీధరరావు

# త్రికాండశేషము అమరకోశమునకు శేషగ్రంథమా?

శ్రీ పురుషోత్తమ దేవకృతమగు త్రికాండశేషము[1] లాక్షణికము, కావ్యవిమర్శా వినోదులచే బహువ్యాఖ్యాన ప్రమాతము, సుప్రసిద్ధమునై గీర్వాణ భాషకు భూషాయమానముగా చెలువొందుచున్న యుత్తమ నిఘంటువు. ప్రసిద్ధ విషయ వ్యవహారభాజమగు ఈ యభిధాన కోశము అమరసింహ రచిత నామలింగానుశాసనమునకు శేషగ్రంథమగునా కాదా యని ఉభయకోశ దృష్టప్రత్యయులగు వారు కూడ సాలోచనులగుట కలదు. త్రికాండ శేషకర్తయే గ్రంథావతారికయందు

అలౌకికత్వా దమరః స్వకోశే
న యాని నామాని సముల్లిలేఖ
విలోక్య తైరప్యధునా ప్రచార
మయం ప్రయత్నః పురుషోత్తమస్య

అని స్పష్టముగా అమర గ్రథితములు కాని నామములను లోక ప్రచారము ననుసరించి తాను సముల్లేఖించుచున్నానని వ్రాసి యున్నాడు. అయినను పరంపరాగతముగా లభ్యపడుచున్న

మేదిన్యమరమాలా చ
త్రికాణ్డో రత్నమాలికా
రన్తిదేవో భాగురిశ్చ
వ్యాడిః శబ్దార్ణవ స్తథా.

ద్విరూపశ్చ కళిఙ్గశ్చ
రభసః పురుషోత్తమః
దుర్గోఽభిధానమాలా చ
సంసారావర్త శాశ్వతౌ.

విశ్వో వోపాలిత శ్చైవ
వాచస్పతి హలాయుధౌ.
హారావళీ సాహసాఙ్కో
విక్రమాదిత్య ఏవ చ.

హేమ చన్ద్రశ్చ రుద్రశ్చ
స్త్వమరోఽయం సనాతనః
ఏతే కోశాః సమాఖ్యాతా
స్సంఖ్యా షడ్వింశతిః స్మృతాః.[2]

అను నొకానొక పూర్వ రచిత శ్లోకావళియందు త్రికాండః, అమరోఽయం సనాతనః అని వేర్వేఱుగా నుదాహృతమై యుండుటచే నుపర్యుక్త త్రికాండశేషకోశము శేషగ్రంథమగుట త్రికాండమను కోశమునకా? లేక నామలింగానుశాసనమునకా? అను వికల్పాభిప్రాయమున కవకాశ మేర్పడి యేతద్విషయమును గూర్చి భారతీ పత్త్రిక 1980 ఏప్రిల్ సంచికయందు శ్రీమాన్ శ్రీమదిత్యాది వికాల శేషాచార్యులవారు సంశయమును ప్రకటించి యున్నారు. ఈ శ్లోకముల విమర్శింపగా ప్రాచీన విహితములుగానే కానుపించును. ఇందలి మేదినికోశము కర్త మేదినికరుడు (క్రీ. శ. 1203-1275). మల్లినాథాది కృత బహువ్యాఖ్యానముల యందు దీని ప్రస్తావము కలదు. అమరమాలాకారు డమరదత్తుడని యూహింపబడుచున్నాడు. అమరకోశ టీకా సర్వస్వములో వంద్యఘటీయము సర్వానందు (క్రీ. శ. 1159- ) డీతని నుదాహరించెను. రత్నమాలిక హేమచంద్రుని అభిధానరత్నమాలికయే యైనచో క్రీ. శ. 650 నాటిది. కాత్యుడను ప్రాచీనుడు రచించిన రత్నకోశము పేరు కూడా వినబడుచున్నది. దీనికి రత్నమాలికయను పర్యాయపద మున్నట్లు లేదు. ఇదియు నామనిఘంటువనియే సంభావింప బడుచున్నది. రంతిదేవుడు కోశకర్తగా మేదిని కరాదులచే కూడ సంస్మరింపబడియున్నాడు. భాగురి కోశభాగములు ప్రమాణములుగా బహుగ్రంథములలో నుదాహృతములు. క్షీరస్వామి సాయణాదులు నిందుండి గ్రహించినవి కలవు. వ్యాడి

కృతముగా నుత్పలినీ కోశమునుండి యొక శ్లోకము ప్రసిద్ధముగా లభించుచున్నది. ఉత్పలినీ కర్త శుభాంకు (క్రీ. శ. 1100) డనియు, వ్యాడి శుభాంకు లొక్కరే యనియును వాదములు కలవు. వాచస్పతి యను నాతడును దుర్గసింహుడను నాతడును శబ్దార్ణవ కర్తలుగా నగుపించుచున్నారు. ఈ యిరువురిలో వాచస్పతి ప్రాచీనుడని కొందఱ మతము. అమర మండనము వ్రాసి చరిత్రకెక్కిన శ్రీహర్షుడు ద్విరూపకోశము నొకదానినికూడ సంధానించి నట్లగపడుచున్నది.[3] ఇతడేకాక ద్విరూప కోశములను నిర్మించిన వారనేకులు కలరు. ఇట్లు పై నుదాహరించిన నిఘంటు శీర్షికా శ్లోకములలో మొదటిదాని యందు నెనిమిదింటి ప్రస్తావము కలదు. ఇక ద్వితీయ శ్లోక మందలి కళింగు డెవడో కాని కాళింగుడను వాడు ప్రయుక్తపద మంజరిని కూర్చెను. ఈతని గూర్చిన వివరము లేవియు నాకు లభింప లేదు. రభసపాలుడు కోశకారుడుగా ఘన శ్యామాదుల కావ్య వ్యాఖ్యానములలో కలడు. పురుషోత్తముడు ప్రస్తుత త్రికాండ శేషకర్త. ఈతని కాలాదికము, గ్రంథ కర్తృత్వములను గూర్చి వెనుక వివరముగా వ్రాసెదను. దుర్గుడు యాస్కనిరుక్తి వ్యాఖ్యాతగా బహుశ్రుతుడు. నామమాల అను కోశము దుర్గకృతముగా జెప్పుదురు. అభిధాన నామమాల, అభిధాన మాల అనునవి యొకే కోశమునకు నామాంతరము లని భావింప బడుచున్నది. అట్లుకాక అభిధానమాల నామమాలయే యగుచో నామమాలా కోశములు కూర్చినవారు పెక్కండ్రు కలరు. భోజరాజు కూడ నొక నామమాలను వ్రాసెను. సంసారావర్తకారుడు విక్రమాదిత్యుడను ప్రాచీన కోశకారుడని కొందఱ యాశయము. సంసారావర్తుడని కోశకర్తృనామమని కలదు కాని యది చింత్యము. కవిదీపికా నిఘంటువు చేసిన విక్రమాదిత్యుడొకడు కలడు. కాని సంసారావర్తకోశ మితనిదో కాదో తెలిసికొనుట కాధారములు మృగ్యములై యున్నవి. శాశ్వతుడును నతి ప్రాచీనుడు. ఈతని కోశము పేరు తెలియరాలేదు. క్రీ. శ. 1630 నాటి గణపవరపు వేంకటకవి యీతని కోశమును వేంకటేశ్వర విజయ విలాస చిత్ర కావ్యమున శాశ్వతమని పేర్కొనెను. గ్రంథములు కర్తృనామమున వ్యవహరింపబడుట సుప్రసిద్ధమే. విశ్వకోశము విశ్వ ప్రకాశ[4] కోశమే యైనచో దీని కర్త మహేశ్వర సూరి (క్రీ. శ. 1111- ). ఈ విశ్వ విశ్వ ప్రకాశ కోశముల యైక్య వాదము వివాద గ్రస్తము. దీనిని గూర్చి మరియొక వ్యాసమున విపులీకరించెదను. వోపాలితుడు కోశ కర్తగా స్మరింపబడినవాడే. ఈతని కోశమునుండి పురుషోత్తమ దేవుడు త్రికాండ శేషమునకై పెక్కు పదముల నెరవు తెచ్చుకొనెనని ఆనందరామ బారువా తన యమరకోశ పీఠికలో వ్రాసెను.[5] వాచస్పతి కూడ పూర్వుడే. శబ్దార్ణవ మీతనిదే యందురు. హలాయుధుడును పేరెన్నిక గన్నవాడు. ఈత డభిధాన రత్నమాలను కూర్చెను. పైనిగల రత్నమాలికా కర్త యీతడు కాడని యూహింపవలసి యున్నది. రత్నమాలాకోశము నిర్మించిన ఇరుగ దండేశుడు కలడు. కాని అ యీతని నానార్థ రత్నమాల యాధునికము. కాత్యకృతమునుగూర్చి వ్రాసియే యున్నాను. హారావళి పురుషోత్తమ దేవునిది. సాహసాంకు డనువాడు ప్రాచీనుడు. ఈతని కోశమేదో తెలియరాలేదు. విశ్వప్రకాశములో సాహసాంకుని పేరొకటి కలదు (శ్లో. ౫). విశ్వప్రకాశము కూర్చిన మహేశ్వర సూరి శబ్దభేద ప్రకాశమను[6] వేరొక కోశమును కూడ వ్రాసెను. అందు సాహసాంక పదము ఎవరో రాజునకు బిరుద పదము వలె కనుపట్టుచున్నది. మఱి వేఱొక సాహసాంకుడు కోశకర్త కలడేమో పరిశీలింపదగి యున్నది. విక్రమాదిత్యుని గూర్చి ముందు వ్రాసియున్నాను. హేమచంద్రాచార్యుడు (క్రీ. శ. 1145- 1232) అనేకార్థ సంగ్రహము, నిఘంటుశేషము మొదలుగా బహుగ్రంథములు రచించెను. దేశీనామమాల వ్రాసినది కూడ హేమచంద్రుడే. రుద్రుడు కూడ సనాతనుడుగా కోశకర్తలచే స్మరింపబడి యున్నాడు.

ఏవం విధముగా ప్రోక్తమగు నామావళిని విమర్శించి చూడగా ఉపర్యుదాహృత శ్లోకములు సార్థకముగనే భాసించుచున్నవి. వీనియందు కానవచ్చు వ్యాడి శుభాంకుడు కాదగునేమో యని యనుమానించిన శుభాంగు డనువాడు కూర్చిన కోశ మింకొకటి కనవచ్చుచున్నది. 'కళా చంద్రకళాయాం చ సౌందర్యే చ ధనే ద్యుతౌ విద్యాయా మభివృద్ధౌ చ శిల్పాద్యా వంశమాత్రకే', 'అబ్జశ్శశాంకే విజయే జ్వలనే జలజేఽం బుధౌ' అని యిత్యాదిగా శుభాంగు[7] నుదాహరింతురు. ఇదియే వ్యాడికోశము కాదగునేమో తెలియదు. 'భవ శ్శుభే ధనే రుద్రే విభూతౌ జననే సుఖే', 'నయనం లోచనే ప్రాప్తౌ జటాయా మంశుకే యుగే'[8]- ఇత్యాదులు బాగురి కోశమందలి వందురు. ఇట్లు చూచిన నుపరి శ్లోకములు పూర్వకృత ప్రమాణమనియే సంభావింప దగియున్నది. కావున మృగ్యమగు త్రికాండ కోశము కారణముగా వీని సామీచీన్యమును సంశయించి- త్రికాండః, అమరోఽయం సనాతనః-

అను నెడ వికల్పము నారోపించి యపరిశీలన కృతములుగా నిరాకరించుటను శీలిత నిఘంటువు లంగీకరింపరు. అట్లు త్రికాండమను కోశమొకటి కలదనియే సంభావించి, ఈ త్రికాండ త్రికాండశేష కోశముల సంబంధము పూర్వోత్తరాన్వయ సాపేక్షమా లేక నామ మాత్రమా యని శంకించుకొని సంస్కృత వాఙ్మయమున వెల్లి విరిసిన కోశములందు శేష గ్రంథము లుత్పత్తిల్లినది కలదేమో విమర్శించి చూచితిని. అట్లు చూచిన శేష కోశములు ప్రసిద్ధ కృతులకే రచితమగునా లేక యథాభిలాషముగా కూర్పబడునా యనునది తెల్లమగు ననియు నప్పుడు త్రికాండ నామ లింగాను శాసనముల యొక్క వాదమును గూర్చి విమర్శింపదగు ననియు సంభావించితిని.

ఈ పరిశీలనమున కానవచ్చిన పేళ్ళలో ప్రధానముగా భట్టోజీ దీక్షితుని అక్షర నిఘంటువు, మహీపుని అనేకార్థ తిలకము, సోమభవుని అనేకార్థ తిలకము, గదసింహ, మహాక్షపణకుల అనేకార్థ ధ్వని మంజరీ కోశములు, హేమచంద్రుని అనేకార్థ సంగ్రహము, జినదేవుని అభిధాన చింతామణి, హేమచంద్రుని అభిధాన చింతామణి, నృసింహుని అభిధాన చూడామణి, జటాధరుని అభిధాన తంత్రము, హేమచంద్రుని అభిధాన నామమాల, అభిధాన నామ మాలా పరిశిష్టము, హలాయుధుని అభిధాన రత్నమాల, మహాదేవుని అవ్యయ కోశము, జయ భట్టారకుని అవ్యయార్ణవము, రత్నమాలాకరుని ఆయుర్వేద పర్యాయరత్నమాల, రామశర్మ ఉణాదికోశము, అమరసింహుని ఏకాక్షర నామమాల, సౌభరి కృతమగు ఏకాక్షర నామమాల మాధవుని ఏకాక్షర నిఘంటువు, సదాచార్య భట్టారకుని ఏకాక్షర నిఘంటువు, కేశవుని కల్పద్రుకోశము, రామకవి కవి దర్పణ నిఘంటువు, విక్రమాదిత్యుని కవి దీపిక, వల్లభకృత కవి మంజరి తీర్థస్వామి కోమల కోశ సంగ్రహము, విశ్వనాథుని కోశ కల్పతరువు, భట్టోజీ దీక్షితుని క్రియా నిఘంటువు, హరిదత్తుని గణిత నామమాల, త్రివిక్రమాచార్యుని గీర్వాణ భాషాభూషణము, జైమిని కృతమగు జైమిని నిఘంటువు, పురుషోత్తమ రచిత త్రికాండ శేషము, బిల్హణ విరచిత త్రిరూప కోశము, వేదాంతాచార్యులవారి దశదీపము, పురుషోత్తమునిదే ద్విరూపకోశము, శ్రీహర్షునిదొక ద్విరూప కోశము, సౌభరి ద్వ్యక్షర నామమాల, వేంకటభట్టు నానార్థ కల్పవల్లి, మేదినికరుని నానార్థమంజరి, ఇరుగదండేశుని నానార్థ రత్నమాల, భాస్కర కృతమొకి నానార్థరత్నమాల కాళిదాసుని నానార్థ శబ్దరత్నకోశము, అజయపాలుని నానార్థ సంగ్రహము, అప్పయదీక్షితుల నామ సంగ్రహమాల, ధరణీశుని నానార్థ సముచ్చయము, శాస్త్రకవి నానార్థ సముచ్చయము, కేశవ స్వామి నానార్థార్ణవ సంక్షేపము, వరదరాజు నామ మాతృకా నిఘంటువు, ధనంజయుని నామమాల, దుర్గసింహుని నామమాల, భోజరాజు నామమాల, భార్గవాచార్యుని నామ సంగ్రహ నిఘంటువు, గోవర్ధనుని నామావళి, బాహ్లికేయ మిశ్రుని నిఘంటుకైకాధ్యాయము, వేణీదత్తుని పంచతత్త్వ ప్రకాశము, మయూరభట్టు పదచంద్రిక, విద్యాహంవీరమిశ్రుని పర్యాయ పదమంజరి, వాసుదేవుని పర్యాయ పదావళి, మహేశ్వరుని పర్యాయ రత్నమాల, ధనంజయుని ప్రమాణ నామమాల, కాళిదాసుని ప్రయుక్త పదమంజరి, నత్కీరుని బాలప్రబోధిక, సార్వభౌమమిశ్రుని భువనప్రదీపిక, పద్మనాభుని భూరిప్రయోగము, మంఖకవి మంఖకోశము, మదనపాలుని మదనపాల నిఘంటువు, మహీదాసుని మాతృకా నిఘంటువు, శ్రీధరుని ముక్తావలి, మేదినికరుని మేదినికోశము, నృసింహుని రత్నకోశము, పృథ్వీధరాచార్యుని రత్నకోశము, సాగరనంది రత్నకోశము, నరసింహపండితుని రాజ నిఘంటువు, నారాయణదాసుని రాజ వల్లభకోశము, రూపచంద్రుని రూపమంజరీ నామమాల, శివరామకవి లక్ష్మీనివాసకోశము, కేశవకవి లఘు నిఘంటు సారము, సాలేశ్వరుని లింగప్రకాశము, వరరుచి లింగవిశేష విధి నిఘంటువు, హేమచంద్రుని లింగాను శాసనము, క్షేమేంద్రుని లోకప్రకాశము, వరరుచిదే మరియొక వరరుచి కోశము, పురుషోత్తమ దేవుని వర్ణదేశనము, నందన భట్టాచార్యుని వర్ణాభిధానము, విశ్వకవి రచించిన విశ్వనిఘంటువు, మహేశ్వర సూరి విశ్వప్రకాశము, సారస్వత మిశ్రుని విశ్వమేదినీత్యాదులు, యాదవుని వైజయంతీకోశము, కృష్ణకవి వైభాషికకోశము, దేవకీ నందనుని వైష్ణవాభిధానము, త్ర్యంబకమిశ్రుని విశేషామృతము, బాణభట్టుని శబ్దచంద్రిక, మహేశ్వరసూరి శబ్దభేదప్రకాశము, మురారి సుప్రసిద్ధపదమంజరి, మహీపుని శబ్దరత్నాకరము, భట్టోజీ వ్రాసిన శబ్దభేదప్రకాశము, వామనభట్టు శబ్దరత్నాకరము, సుందరగణి శబ్దరత్నాకరము, మధురేశుని శబ్దరత్నావళి, హంవీరమిశ్రుని శబ్ద శబ్దార్థమంజూష, అగస్త్యుని శబ్దసంగ్రహ నిఘంటువు, గోవిందశర్మ శబ్దసాగరము, విట్ఠలుని శబ్దార్థ చింతామణి, రాక్షసుని శబ్దార్థ నిర్ణయము, వేంకటకవి శాబ్దిక విద్వత్కవి ప్రమోదకము, హర్షకీర్తి శారదీనామమాల, శివదత్తుని శివకోశము, పుండరీక విట్ఠలుని శ్రీపదకోశము, శ్రీహర్షుని శ్లేషార్థ పదసంగ్రహము, శంకరకృతము సంయమి నామమాల, సరిద్వల్లభుని సారస్వతవిలాసము, మురారి సుప్రసిద్ధ పదమంజరి, పురుషోత్తమ దేవుని హారావళి మొదలగునవి కాన వచ్చుచున్నవి. ప్రసిద్ధ కోశనామములు నిట్లు సమకూర్చితిని కాని యందు చేరనివి యాదునికములు, ముద్రితాముద్రితములు నొక రెండువందలకు పైగా కలవు. ఇవికాక 'భోగస్తు విభవే విత్తే కోదండేఽహి ఫణాంగయోః సంభోగ పాలనే హర్షే భోజనే

పణ్యయోషితి' - ఇత్యాదిగా తారపలాశకోశము, 'కరో వర్షోపలే హస్తే భానౌ తటితి వారిదే ఉపదాయాం ద్యుతౌ శ్రేష్ఠే శుండాయాం ప్రత్యయే ధనే'- ఇత్యాదిగా హైమవతి, 'అజః పితామహే విష్ణౌ కందర్పే శంకరే దకే' - అను విజయకోశము, 'అజో విధి రజో విష్ణు రజ శ్శంభు రజ స్త్వజః అజశ్రీ వాస్త కోపీహ రజో రామ పితామహః'- ఇత్యాది సుప్రసిద్ధ ధనంజయ కోశము మొదలుగా నెన్నియేని కోశములున్నవి. పరిశీలించిచూడగా వీనిలో నేయొక్కటియు నమరకోశమువలె నుత్తర దక్షిణదేశ పాఠములందు ప్రతీతమైనది కాని, శేషకోశము నుదయించినది కాని కానరాదు. ఒక్క యభిధాన రత్నాకరమునకు మాత్రము అభిధానశేషమను నుత్తర కోశ ముదయించినట్లు క్షీరస్వామి[9] యుద్ఘాటన వ్యాఖ్యలో పేర్కొని యున్నాడు. హేమచంద్రుని యభిధాన నామమాలకు అతనిదే పరిశిష్ట కోశమొకటి కలదని పేర్కొని యున్నాను. దానికే రత్నాకరమను నామాంతరము కలదో లేక హలాయుధుడు కూడ హేమచంద్రుని వలె శేషకోశమును కాలాంతరమున కూర్చెనో తెలియరాదు. దేశదేశాంతరములందెల్లెడల కావ్యశాస్త్ర బహువ్యాఖ్యానములందు అపరిహార్యముగా నామలింగాను శాసనము నుండి ప్రమాణీకరించిన భాగములు కలవు. ఇట్లు ఆ యీ ప్రసిద్ధమైన అమరోక్త కోశము బహుగ్రంథ పరిశీలన శ్రమాపనోదకమై సువర్ణ భూషాలంకృతయగు సాధ్వివలె పండితుల కంఠసీమల నాశ్రయించి

ప్రయోగవ్యుత్పత్తౌ ప్రతిపద విశేషార్థ కథనే
ప్రసత్తౌ గాంభీర్యే రసవతి చ కావ్యార్థరచనే
అగమ్యాయా మన్యై ర్దిశి పరిణతే రర్థ వచసో
ర్మతం చేదస్మాకం కవి రమరసింహో విజయతే[10]

అను కాలికనాథ భాషణము సమీరణముగా ప్రాచీనము, ప్రామాణికము, సూత్రప్రాయము, సువ్యాప్తమునయి శైక్షోపాధ్యాయికగా పఠన పాఠనములందు సుప్రతిష్ఠితమై యుండుటచే దీనికి నూటికి పైగా వ్యాఖ్యానములు, నైదారు శేషకోశములు నుదయించి విశిష్టమై వెలయు చున్నది. అధునాతన యుగమునందు కూడ మామిడి వేంకటార్య విక్రాల శేషాచార్య ప్రభృతి విపశ్చిద గ్రేసరులు సంధానించిన అమరశేషములు, శేషామరములు పెక్కు కలవు. కావున రూఢ్యను సారముగా త్రయః కాండాః యస్మిన్ సః అని చెప్పికొని అమరమే త్రికాండము కాదగుననియు త్రికాండ శేషమున కిదియే మూలగ్రంథమనియు నిర్ధారించుట యొక మార్గముగా గోచరించుచున్నది.

## నిఘంటు రచనా విధానము

ప్రాచీన విహితములైన సంస్కృత నిఘంటువులయందు[11] సాధారణముగా శబ్దార్థ నిర్ణయము, లింగాను శాసనము నుద్దిష్టములుగా పర్యాయ పదములను, నానార్థములను సమకూర్చుట యాచారమైయున్నది.[12] శబ్ద వ్యవహారమునకు అర్థవత్త్వమే ప్రాతిపదిక. అందుచేతనే శాస్త్ర గ్రంథములందన్నింటను అధికారి నిర్ణయముతో పాటు అర్థజ్ఞ ప్రశంస కూడ కావింపబడుచున్నది. "స్థాణురయం భారహారః కిలాభూదధీత్య వేదం న విజానాతి యోఽర్థమ్ యోఽర్థజ్ఞ ఇత్సకలం భద్రమశ్నుతే నాకమేతి జ్ఞాన విధూత పాప్మా"- "యద్ గృహీత మవిజ్ఞాతం నిగదేనైవ శబ్ద్యతే అనగ్నావివ శుష్కైధో న తజ్జ్వలతి కర్హిచిత్" అనికదా యాస్కుని[13] నిశితాభిప్రాయము! ఈ యర్థ నిర్ణయమునకు వ్యాకర్తల వలెనే నైఘంటికులు కూడ ఘంటాపథముగ సంయోగ విప్రయోగ సాహచర్య విరోధిత్వాదులను ప్రమాణీకరింతురు. వాక్యపదీయమునం దిట్లు కలదు: "సంయోగో విప్రయోగశ్చ సాహచర్యం విరోధితా, అర్థ ప్రకరణం లింగం శబ్దస్యాన్యస్య సన్నిధిః, సామర్థ్య మౌచితీ దేశః కాలో వ్యక్తిః స్వరాదయః, శబ్దార్థస్యా న్యవచ్ఛేదే విశేష స్మృతి హేతవః"[14] - మఱియు శాబ్ద బోధమును, వృత్తి జ్ఞానమును సామర్థ్యవంతము లగుటకై శాస్త్రకారులు శక్తి గ్రహమును సమీక్షించి యున్నారు. శబ్ద శక్తి ప్రకాశికయందు జగదీశ భట్టారకుడు "శక్తిగ్రహం వ్యాకరణోపమాన కోశాప్త వాక్యాద్వ్యవహారతశ్చ, వాక్యస్య శేషా ద్వివృతే ర్వదన్తి సాన్నిధ్యతః సిద్ధపదస్య వృద్ధాః (౧-౨౦)" అని వ్రాసెను.[15] వ్యాకరణము, ఉపమానము, కోశము, ఆప్త వాక్యము, వ్యవహారము, వాక్య శేషము, వివరణము, జ్ఞాతపదము ననువాని సాహచర్యము వలన శబ్ద శక్తి యెఱుక పడును. వేద శరీరమునకు ముఖ శ్రోత్రాయమానములైన వ్యాకరణ, కోశములకు పరస్పర సమన్వయముండుట సాజమే; అట్లు కావుననే నామముల లింగాదికము ననుశాసించు సర్వ శబ్ద సంబోధినిగా అమరసింహుడు నామలింగానుశాసనమును చేయగా, అందు విస్మృత ప్రాయమైన అలౌకిక శబ్ద జాతమును లౌకిక శబ్ద జాతమును వైదిక నిఘంటు వోపాలిత కోశ పాణినీయ వ్యాకరణముల నుండియు, అసంఖ్యాక కావ్య ప్రయోగముల బట్టియు స్వీకరించి అమర త్రికాండ శేషముగా పురుషోత్తమ దేవుడు త్రికాండ శేష కోశమును సంధానించి యున్నాడు.

## అమరకోశము - త్రికాండము

ఇప్పుడు త్రికాండశేషము అమరకోశ శేషకోశముగా భావనీయమేని అమరకోశమునకు త్రికాండమను పేర ప్రసిద్ధి కలదా?

అను ప్రశ్న ముత్పత్స్యమాన మగు చున్నది. దీనికి సమాధానమును పర్యాలోచింతము. కాండత్రయ పర్యాప్తమగు శ్రీమదమర సింహుని నామలింగాను శాసనము త్రికాండసంజ్ఞితమై పరిఢవిల్లు చుండుట సుప్రసిద్ధమే. ఇందుకు లోకప్రచారము, పండిత వ్యవహారమును మాత్రమే కాక

రఘునాథ చక్రవర్తి నిర్మిత త్రికాండ చింతామణి

రమానాథ విద్యావాచస్పతి కృత త్రికాండ వివేకము

రామనాథ సుకవి రచిత త్రికాండ రహస్యము

ఆదిగా ప్రచురమయిన అమరకోశ వ్యాఖ్యానము[16] లుదాహరణీయములు. గర్భితార్థ ప్రకాశకమగు నామకరణైకమాత్రముననే కాక వ్యాఖ్యానారంభ మంగళా శాసనములందు కూడ నివి యమర త్రికాండము లేక గ్రంథమని యుద్ఘోషించు చున్నవి. ఈ విధముగా పదార్థ వివిదిషాపరాయణులకు ముకుర ప్రాయము, సప్రమాణము, సార్థకము నగు కోశమును నిర్మించి "అమరసింహో హి పాపీయాన్ సర్వం భాష్యమ చూచురత్"- అను వ్యాజస్తుతికిని, "కవే రమర సింహస్య కృతి రేషా సునిర్మలా, ఆచంద్ర తారకం స్థేయా న్నామలింగాను శాసనమ్" అను సంస్తుతికి నాస్పదుడై, వ్యాకర్తృ లోకమున కృతార్థుడై "ఇంద్ర శ్చంద్రః కాశకృత్స్నాపిశలీ శాకటాయనః పాణిన్యమర జైనేంద్రాః జయన్త్యష్టౌ చ శాబ్దికాః" అనునట్లు శబ్దవిద్యా సంప్రదాయ పరివర్తకుడై అమరసింహుడు పండిత లోకమునకు గౌరవార్హుడుగా వెలుగొందు చున్నాడు. కావున నామలింగాను శాసనము ప్రాజ్ఞ ప్రతిజ్ఞాతమై ప్రఖ్యాతమైన నాటి నుండియు దుర్గమ గీర్వాణ విద్యారణ్యమున పాథేయమగుచున్నను అది నాతి విస్తరమగుటచే శిష్టపద సందర్భాభిలాషులగు శాబ్దికు లనేకులు నిఘంటు నియంతలై యశస్కాయులైరనుటకు "నాప్తం వారాంనిధి మమర ముఖ్యై ర్యత్ ప్రయాసై ర్మథిత్వా, పారం ప్రౌఢై రహమహమికయా సార సర్వస్వ మస్య" -అను శబ్దరత్న సమన్వయ కర్త శాహజీ ప్రభువు వాక్యమే ప్రమాణము. వినయవినమ్రుడగు అమర సింహుడే కోశాంత మందు 'శేషం తు జ్ఞేయం శిష్టప్రయోగతః' అని వ్రాసి యున్నాడు. విషయాదికమును విమర్శించి చూడగా నమరకోశమునకు అర్వాచీనములగు బహుగ్రంథముల రచనా సందర్భ మంతయు అమర ప్రణాళికానుసారియే కాని వేఱొకటి కాదు. చివఱికి పరిభాషాదిక వివృతి యందు కూడ నామలింగాను శాసనమున

ప్రాయశో రూపభేదేన సాహచర్యా చ్చ కుత్రచిత్
స్త్రీ పుం నపుంసకం జ్ఞేయం తద్విశేషవిధేః క్వచిత్
భేదాఖ్యానాయ న ద్వన్ద్వో నైకశేషో న సంకరః
కృతోఽత్ర భిన్నలిఙ్గానా మనుక్తానాం క్రమాదృతే
త్రిలిఙ్గ్యాం త్రిష్వితిపదం మిథునే తు ద్వయో రితి
నిషిద్ధలిఙ్గం శేషార్థం త్వన్తాథాది న పూర్వభాక్

(౧=౩–౫)

అను వాక్యములను చూచియే నానార్థ రత్నమాలయందు[17] ఇరుగదండేశుడు-

రూపభేదా త్సాహచర్యా త్కంఠోక్త్యావా విభావయేత్
లిఙ్గా న్యథాది త్వన్తం వా పదం పూర్వేణ నాన్వయి
త్రిష్వితి త్రిషు లిఙ్గేషు జ్ఞేయం ద్వన్ద్వే ద్వయోరితి
లిఙ్గాన్తర నిషేధోఽత్ర శేషలిఙ్గ విధాయకః

అని అనుస్యూతీకరించి యున్నాడు. అమర మార్గము సుధీజన క్షుణ్ణముగా నిరూపిత మగుటచేతనే కాబోలు మేదినికరుడు[18] స్వీయ కోశమునందు కించిద్విభేదముతో

ప్రాయశో రూపభేదేన విశేషణ వశాత్ క్వచిత్
స్త్రీ పుం నపుంసకంజ్ఞేయం విశేషోక్తే శ్చ కుత్రచిత్
త్రిలిఙ్గ్యాంత్రిష్వితి పదం మిథునే తు ద్వయోరితి
నిషిద్ధలిఙ్గం శేషార్థం త్వన్తాథాది న పూర్వభాక్

అని యిత్యాదిగా వ్రాసియున్నాడు. ఈతడు అమర త్రికాండ శేషములు రెండింటిని చూచినట్లు గ్రంథాంతమున కలదు. ఈ విధముగా అన్య కోశముల మాటయే అమర విధానము ననుసరించి యిట్లుండగా పురుషోత్తమ దేవుడు చికీర్షిత కోశము శేష గ్రంథము కావున పూర్వోక్త నామలింగాను శాసన పరిభాష నంతయు నామ్రేడితము చేయక అధ్యాహారము చేసి "వర్గ క్రమ స్తథా నామలిఙ్గయో స్తూపదేశతా, పరిభాషాదికం సర్వ మత్రాప్య మరకోశవత్ (అమరసింహవత్- అని పాఠాంతరము)"- అని వ్రాయుటచే నిది అమర త్రికాండశేషమే యనుట నిర్వికల్ప మగు చున్నది. ఇందున కతీతమగు ప్రయోగమొక్కటియు పురుషోత్తమీయము దృష్టి గోచరము కాదు. అన్య తంత్రములను సమాహరించుట, నామ లింగాదులను అనుశాసించుట అనునవి ఉభయ కోశములందును సమానముగానే వెలయుచున్నవి. అందుచేతనే త్రికాండశేషమునకు సారార్థ చంద్రికా వ్యాఖ్యానమును జగదుపకృతికై నిర్మించిన శీలస్కంధ మహాతీర్థుడు కూడ

"అథ ఖలు శ్రీమాన్ పురుషోత్తమదేవః సుధీవర అచార్యామరసింహకృతే నామలిఙ్గానుశాసనే అభిధానశాస్త్రే ప్రాయేణానుపదిష్టానాం సంజ్ఞాశబ్దానాం పరిదీపనాయ స్వచికీర్షితస్యాస్య త్రికాణ్డశేష కోశస్య..."

అని యవతారికలో వ్రాసియున్నాడు. శేషాద్రి రమణ కవుల సిద్ధాంతము దీని కనురూపముగనే యున్నది. పురుషోత్తమ దేవుడు 'అలౌకికత్వా దమరః స్వకోశే' అను శ్లోకమున చెప్పిన పరికారము అమర సింహునికంటె తన కాలమునాటికి ప్రచురమైన శబ్దములకు శాశ్వతత్వమును కల్పించుటకై శేష గ్రంథమును సంకల్పించి యుండునని సంభావించుట ఆ యీ హేతువులచేత సార్థకమగుచున్నది. ఈతడుకూడ బౌద్ధుడు, అమర మతానుయాయి; ఇందుకు సందేహము లేదు. చూడుడు —

జయన్తి సన్తః కుశలం ప్రజానాం
నమో మునీన్ద్రాయ సురాః స్మృతాశ్చ
(స్మృతాః స్థః అని పాఠాంతరము)
స్తుతాసి వాగ్దేవి దయస్వ మాత
ర్విదేహి విఘ్నానివ మఙ్గలాని

అను మంగళాచరణ శ్లోకమును, కోశగత శాక్యముని వాక్యావళియు దీనికి ప్రబల ప్రమాణములు. పూర్వము బౌద్ధాద్య వైదిక మతానుయాయులు తమ వాఙ్మయమునకు విస్తృత ప్రచారమును కల్పించుకొనుటకై వేదమతానుకూలముగా స్ఫురించు వాక్య జాతమును సమకూర్చుటయు, తద్వ్యాఖ్యాతలు కూడ నిట్టి విషయమున నుదాసీనులై సహకరించుటయు క్రొత్త విషయములు కావు. అమరపద పారిజాతమున మల్లినాథసూరి యస్యజ్ఞానేత్యాది పంక్తులను విష్ణుపరముగానే సమన్వయించెను కాని, శాక్యగౌతమముని ప్రస్తావము తేనేలేదు. అట్లు పురుషోత్తమ దేవుడు కూడ నుభయ తారకముగ అమర మతమునే యనుసరించినట్లు కానబడుచున్నది.19

సంస్కృత భాషయందలి కోశములన్నియు పర్యాయః ద నానార్థ రచనా భేదమునే రెండు విధములుగా గోచరించుచున్నవి. అక్షర క్రమ నియమముచే నీనియందింకను నవాంతర భేదములు కలవు. ఇవి యన్నియు సాధారణముగా నామ నిఘంటువులై ప్రాయికముగా "ఉణాద్యన్తం కృదన్తం చ తద్ధితం సమాసజమ్, శబ్దాను కరణం చేతి నామ షడ్విధం స్మృత" మ్మను మర్యాదాను సారముగా నుపకల్పింప బడెను. అమరఖండనమను నమరకోశ ప్రత్యక్షర విమర్శన గ్రంథమున శ్రీహర్ష పండితుడు పర్యాయ పద నానార్థములను ఏక కోశమున రూపొందించుట ప్రమాణశాస్త్ర విరుద్ధమని అమర గ్రథిత శబ్దజాతమును విమర్శింపగా ఆంధ్రుడగు శాంతయారి కృష్ణసూరి సాహిత్యకల్పలతికా మహాగ్రంథమున20 అమరమండనమను పంచమ భాగములో శ్రీహర్షుని విమర్శనపాస్తము చేసి అధ్యాయ విభాగమును కాండపర్యాప్తియు శబ్దజాలమును శాస్త్రసమ్మతములే యని నిరూపించి యున్నాడు. ఈ సాహిత్య కల్పలతిక యొక గొప్ప విమర్శ గ్రంథము. పూర్వము కావ్యశాస్త్ర విమర్శకులైన ధీమంతులు అధ్యయనాధ్యపనము లందు గడిదేరిన పిమ్మట కాని గ్రంథ రచనకు గడగినవారు కారు. అందుచేత పూర్వపక్ష సిద్ధాంత తర్కసారము కాని శాస్త్రగ్రంథము ప్రాచీన కృతము సాధారణముగా లేదు. స ర్ధమును ఈ గ్రంథము నందు శాస్త్ర సమ్మతముగా నిరూపితమైనట్లు పురుషోత్తమదేవుడు అమర ప్రణాళికానుసారముగా పర్యాయపద నానార్థ భాగములను ఒకే కోశమునందు సంగ్రహించి యున్నాడు.

## త్రికాండమను కోశము వేఱొకటి కలదా?

ఈ విధముగా కాక త్రికాండశేషము త్రికాండమను వేఱొక కోశమునకు శేష గ్రంథమగునేని ఆ గ్రంథమిప్పుడు అన్వేష్టవ్యమై యున్నది. త్రికాండమందన త్రికాండ రహస్య వ్యాఖ్యాద్వితయ సుప్రకాశమానమగు వైదిక త్రికాండ గ్రంథ మొకటి పురాతనమే కలదు కాని ఆచార వ్యవహార ప్రాయశ్చిత్త కాండలతో ధర్మశాస్త్రవైషయికముగు నది యిది కాదు. సుజనాచార్యుని శబ్ద లింగార్థ చంద్రికకు త్రికాండమను నామాంతరము కలదు కాని అది యాధునికతరము. శబ్ద సంగ్రహ రూపమగు కోశమొకటి యున్నదని వాదము కొఱకై యంగీకరించినను, పూర్వోత్తర శబ్ద సంహితచేత ఆ యుపర్యుదాహృత దుర్లభ త్రికాండకోశము పర్యాయపద నానార్థములందు దేదేని యొకటి కాని, యుభయము కాని విషయముగా కల యభిధాన కోశమై యుండును. పూర్వ వ్యాఖ్యాతలు ప్రమాణీకరించిన ఆ కోశము నందలి వాక్యములనేకత్రపఱచి దాని స్వరూప మిదమిత్థమని నిర్ణయింపనగును.

అమరకోశమునకు టీకా సర్వస్వమను21 ప్రశస్త వ్యాఖ్యానమును సంతరించిన సర్వానందుడు ప్రాచీన కోశ కారులగు అజయ భాగురి రభస రుద్ర వరరుచి వోపాలిత వ్యాడి ప్రభృతులను ప్రమాణములకై సముదాహరించియున్నాడు. ఈతడు వంగదేశీయుడు, పండ్రెండవ శతాబ్దినాటివాడు. అమరునిచే శేఖరిత మైన వస్తు సామగ్రి నుల్లేఖించుచు నీతడు —

"అన్యతన్త్రాణి వ్యాడి వరరుచి ప్రభృతీనాం తన్త్రాణి సమాహృత్య ఏకీకృత్య అత ఏవ సంపూర్ణమిదం, యత త్రికాణ్డో

త్పలిన్యాదీని నామమాత్ర తన్త్రాణి వ్యాడి వరరుచ్యాది ప్రణీతాని తు లిఙ్గమాత్ర తన్త్రాణి ....”

అని 'సమాహృత్య' - ఇత్యాది శ్లోకమును వ్యాఖ్యానించి యున్నాడు. పదక్రమమును బట్టి చూడగా ఇందు వ్యాహరింపబడిన త్రికాండము వ్యాడి కర్తృకముగా స్ఫురించుచున్నది. అట్లు కాకున్న త్రికాండోత్పలిన్యాదులు నామనిఘంటువు లనియు, వ్యాడి కృతాదులు లింగమాత్ర బోధకము లనియు సమన్వయింప వలెను. సర్వానందుడు తన వ్యాఖ్యానమునందు వ్యాడి ప్రోక్తముగా నుద్ధరించిన వాక్యములు ఈ త్రికాండము నందలివో లేక మఱియొక గ్రంథములోనివో తెలియరాదు. వ్యాడి యిట్లు చెప్పెననియు, నిది త్రికాండములోని దనియు నొకే యుదాహృతి నొసగినవారు లేరు. అయినను విమర్శకులు వ్యాడి కర్తృకముగా ఉత్పలినీ కోశమును పేర్కొందురు. అభిధాన చింతామణియందు హేమ చంద్రాచార్యుడు వ్యాడి రచితముగా నుత్పలినీ కోశభాగముల నిచ్చినట్లు కల్పద్రు కోశమున కేశవస్వామి ప్రస్తావించెను. త్రికాండ చింతామణి వ్యాఖ్యానమునందు రఘునాథ చక్రవర్తి 'కజ్కతీతి చ ప్రసాధనీతి త్రికాండే'- అని త్రికాండమును పేర్కొనెను. వ్యాడి కోశము ఉత్పలిని అనియు, వరరుచి కోశము లింగాను శాసన మనియు, కాత్యుని కోశము నామమాల అనియు ప్రసిద్ధి కలదు. అట్లగునేని త్రికాండ కోశమునకు ఒకనాడు ప్రచారము కలిగి కోశాంతర వ్యాప్తిచేత అది యణగిపోయియుండును. ఈ త్రికాండ కర్త యెవ్వరని పరిశోధించి సంస్కృత వాఙ్మయ చరిత్రలో[22] (క్రీ. శే.) మహోపాధ్యాయ, అభినవ వాగనుశాసన మల్లాది సూర్య నారాయణ శాస్త్రిలవారిట్లు వ్రాసిరి:

“భాగురి పేరెత్తి క్షీరస్వామి తన నామ లింగాను శాసన వ్యాఖ్యలో( బెక్కుచోట్ల( గొన్ని పాదము లుదాహరించియున్నాడు. [యద్భాగురిః సర్వర్తు పరివర్తస్తు స్మృత స్సంవత్సరో బుధైః ఇత్యాదులు, కాలవర్గాదులు- అని యిట నధోజ్ఞాపిక]. కాని, యితని కోశము పేరెత్తలేదు. సర్వానందాదులు కొందరు త్రికాండము పేరెత్తి కొన్ని శ్లోక పాదములు తమ వ్యాఖ్యలలో నుదాహరించి యున్నారు. కాని భాగురి పేరెత్తలేదు. ఐనను, ఆ యుదాహృత శ్లోక పాదము లొకటి రెం డేకీభవించుటంజేసి భాగురి త్రికాండమను కోశము నిర్మించెనని యూహింపబడుచున్నది.”

(ద్వితీయ భాగము- పుట 430)

కాని శ్లోక పాదము లొకటి రెండింటి యేకీభావము గ్రంథైక్యమునకు సాధకము కాని బాధకము కాని కానేరదని భావింపదగి యున్నది. అయినను సాహిత్యకులు భాగురి రచితముగా త్రికాండ కోశమొకటి కలదని చెప్పికొనుటయే కాని, దీని పర్యాప్తిగాని విషయ విన్యాసముగాని యిట్టిదని యూహించుటకు వలసినన్ని యుద్ధారములు లభించుటలేదు. కాని అమరసింహుడు భాగురి కోశమును చూచెననుటకు ఆధారములు కలవు. అతడు చూచినను అమరకోశ వ్యాఖ్యానవేళ కది స్మృతిమాత్ర తంత్రముగా క్షీణించి యుండును. లేకున్నచో అట్టి దుర్లభ కోశమును సంపాదించియు పురుషోత్తమ దేవుడు తద్విషయమును సహస్రజిహ్వలతో వర్ణింపక మఱుగు పఱచి అమర సింహుని పేరు మాత్రమే స్మరించుటకు కారణము దురూహము. అమరసింహుడు తనకు పూర్వమందున్న నామమాలా లింగాను శాసనముల ప్రకాశికలను అభిమానించి వాని నేకత్ర పఱచి నామలింగాను శాసనముగా తన కోశమును రూపొందించి యుండును. అమరసింహుడు చూచిన భాగురి కోశము త్రికాండ పర్యాప్తమే యైనను అది అమర త్రికాండ ప్రణాళికకు మార్గ దర్శక మనుటకు ఆధారములు లేవు, అది నామమాత్ర తంత్రమని సర్వానందుడే యన్నాడు కదా !

అంతేకాక మాధవీయ ధాతువృత్తియందు[23] సాయణాచార్యులవారు వరాభూ శబ్దమును భాగురి హ్రస్వాంతముగా నంగీకరించినట్లు వ్రాసిరి. చూడుడు-

“తథా భాగురి రపి హ్రస్వాన్తం మన్యతే, యథాహ చ-

భార్యా భేకస్య వర్షాభ్వీ
శృఙ్గే స్యాన్మద్గురస్య తు
శిలీ గణ్డూపదస్యాపి
కచ్ఛపస్య ధులిః స్మృతా”

కాని ప్రయోగముల నిది దీర్ఘాంతముగానే రూఢమై యున్నది. తక్కిన కోశములన్నియు దీర్ఘాంతమునే గ్రహించినవి. ఇట్లు కొన్ని హేతువులచే భాగురి కోశము ప్రాచీనమని యంగీకరింప వచ్చును కాని అది త్రికాండశేషమునకు మూలమై యుండదు. అయినను మహేశ్వరుని విశ్వప్రకాశ కోశమును 1911 లో ప్రకటించిన శీలస్కంధయతిగారు గ్రంథ పీఠికయందు “ఇట్ క్లెయిమ్స్ గ్రేటర్ ఆంటిక్విటీ దాన్ ఎనీ ఆఫ్ ది శాన్‌స్క్రిట్ వొకాబులరీస్ ఇన్ యూస్ ఎమాంగ్ ది స్టూడెంట్స్ ఆఫ్ ది ప్రెసెంట్ డే సచ్ యాస్ త్రికాండకోశ, మేదినీకోశ, అండ్ హేమకంద్రకోశ” అని వ్రాసియుండుట వింతగ నున్నది. శీలస్కంధుని పేరు చెప్పకయే ఆయన వ్యాసమును అనువదించి వావిళ్ళవారి విశ్వకోశ ముద్రణమునకు 1931 లో తమపేర పీఠికను వెలయించుకొన్న శ్రీ ఉత్పల వేంకటరంగాచార్యులవారు కూడ “ఇది

త్రికాండ హేమచంద్ర మేదిన్యాది కోశముల కంటెం బూర్వము రచింపబడెను." అని వ్రాసిరి. 1911 నాటికే త్రికాండశేషము మూడు సార్లకు పైగా నాగరి లిపిలో ముద్రితమైనట్లు తెలియు చున్నది. ఆ తర్వాత 1916 లో శీలస్కంధుడు సారార్థచంద్రికా సహితముగా త్రికాండ శేషమును ముద్రించినప్పుడు పూర్వముద్రిత ప్రతులను తాను విలోకించినట్లు వ్రాసెను. అట్లయిన నత డాంగ్లమున పొరపాటుగా వ్రాసినది త్రికాండమని యైనను, త్రికాండ శేషమే ఉద్దిష్టమై యుండును. కావున శీలస్కంధుడు త్రికాండ మను కోశమును చూచినట్లు భావనీయము కాదు.

ఇది యంతయు నిట్లుండగా పురుషోత్తమ దేవుడు త్రికాండ శేషమని యేల పేరిడెనన్న అమరమునకు త్రికాండి యను ప్రసిద్ధి నాడే యుండుటయు, భాగురి త్రికాండము ఒకవేళ అమరసింహు నకు మార్గదర్శక మైనచో ఈ పేరు ఉభయతారకముగా నుండునని యతడు భావించుటయు హేతువులు కావచ్చును.

మరియు విమర్శించి చూడగా అమర త్రికాండ శేషములు రెండింటను కాండ విభాగము, వర్గీకరణము, శబ్దసంగ్రహము నేకవిధముగనే యున్నవి. రెండింటను

ప్రథమ కాండమున -

స్వర్గ వ్యోమదిక్ కాల ధీ శబ్దాది నాట్య పాతాళభోగి నరక వారివర్గులు,

ద్వితీయ కాండమున-

భూమి పుర శైల వనౌషధి సింహాది మనుష్య బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర వర్గులు,

తృతీయ కాండమున-

విశేష్యనిఘ్న, సంకీర్ణ నానార్థ అవ్యయ లింగాది సంగ్రహ వర్గులు

అవిరుద్ధముగా సమకూర్చ బడియున్నవి. ప్రత్యేకముగా నొక్క స్వర్గ వర్గును మాత్రము పరిశీలింపగ

దేవతల నివాసస్థానము, మింట ఎల్పులు, రాక్షసులు, బుద్ధదేవులు, బ్రహ్మ, విష్ణువు, అతని కుటుంబము, అను యాయి వర్గము, అతని అలంకారములు, శివుడు, అతని అనుసారివర్గము, విభూషణాదులు, అగ్ని, సముద్రములోని అగ్ని, మంట సెగ, అగ్నికణము, విప్పువంని వేడిమి, అడవులలో రగులొకను కార్చిచ్చు, వీనితోపాటు ఇతర ప్రసిద్ధ దేవతలు ఇత్యాది విషయముల పర్యాయ పదములు రెండింటను నొకే తీరున వరుసగా చెప్పబడి యున్నవి. ఇంతటి సాదృశ్య సారూప్యములు గ్రంథకృద్వినిశ్చితము కాక యప్రతర్కితము, కాకతాళీయము నగుట యసంభవము కదా!

ఈ యుపర్యుక్తాభిప్రాయమునకు ప్రోద్బలకముగా మఱి కొన్ని అంతరంగిక సాక్ష్యములు కూడ లభించుచున్నవి. అమర కోశము నందలి కాండ విభాగమును గూర్చి వ్యాఖ్యాత లందఱకు నేకాభిప్రాయము కుదిరినట్లు అందలి వర్గ విభాగమునుగూర్చి కుదరలేదు. ద్వితీయ తృతీయ కాండములందు అమరుడు మొదట వర్గ విభాగమును, చివఱ కాండ పరిసమాప్తిని సూచించు శ్లోకములను వ్రాసెను. ప్రథమ కాండమున మాత్రము రెండింటిని చివఱనే కూర్చెను. అందతడు "స్వర్గాదికాణ్డః ప్రథమ స్సాఙ్గ ఏవ సమర్థితః" అని వ్రాసిన భాగమును పెక్కుమంది "స్వరాదికాణ్డః ప్రథమస్సాఙ్గఏవ సమర్థితః" అని పఠింతురు. "ఉక్తం స్వర్వ్యోమ దిక్కాలధీవాక్ఛబ్దాది" మొదలుగాగల పాఠము కూడ కాండాంతరము నందు "స్వరాదికాణ్డః" అనియే యుండదగునని సూచించుచున్నది. అమరకోశ వ్యాఖ్యానమున ముకుట భట్టు ప్రథమ కాండమున నాట్యవర్గు వఱకు కల భాగమును స్వర్గ వర్గముగా విభాగించెను. పెక్కుమంది వ్యాఖ్యాత లీతనిమార్గమునే యనుసరించిరి. క్షీరస్వామి కూడ స్వర్వర్గు నుండి శబ్దాది వర్గుదాక కల భాగమంతటిని స్వర్గ వర్గమనియే భావించెను. ఔత్తరాహుడైన వంద్యఘటీయము సర్వానందుడు, దాక్షిణాత్యుడగు లక్ష్మణుడు వ్రాసిన వ్యాఖ్యల తీరును పరస్పర భిన్నముగా నున్నది. రామతర్క వాగీశుడు తన వ్యాఖ్యానమున ముకుట మతమును ఖండించి స్వరాది కాణ్డః అను పాఠమునే స్వీకరించెను. క్షీరస్వామి వ్యాఖ్యలో పాఠాంతరములు మిక్కుటముగా నుప్పతిల్లి యుండుటచే నతని యభిప్రాయ మిచట స్పష్టము కాదనుకొన్నను, చాల కాలము క్రితమే ఈ విషయమున ఉత్తర దక్షిణదేశ పాఠములందు వివాదము పొడచూపినదని భావింపవచ్చును. త్రికాండశేషమున పురుషోత్తమదేవుడు కూడ ప్రథమ కాండమును స్వరాదిగా వర్గీకరించియుండుటచే రామతర్క వాగీశుని మతమే ఆదరణీయము కాదగునని విమర్శకుల యాశయము. అంతేకాక ఈ ప్రథమకాండమునందే పాతాళభోగి వర్గును పాతాళవర్గము, భోగివర్గము అని విభజించుట కలదు. పురుషోత్తమదేవుడు పాతాళభోగి వర్గః అని యేర్పఱచి యుండుటచే అమరకోశము వ్రాత ప్రతులందలి పాతాళభోగివర్గా అను పాఠము సరికాదని నిశ్చయింప వచ్చును. ఇట్లే వ్యోమ దిగ్వర్గము విషయమున కూడ వాదము కలదు. వనవర్గు, ఓషధివర్గు కలిసి వనౌషధి వర్గు అయినట్లే ఇది కూడ వ్యోమదిగ్వర్గమని వ్యవహరింప దగును. పెక్కు ప్రతులలో పురుషోత్తమీయ పాఠ

మం దిట్లే యున్నది. తృతీయ కాండమున అమరుడు నానార్థవర్గు చివర నానార్థవ్యయముల నొసగి వెంటనే అవ్యయ వర్గును మొదలిడి యుండుటచే నానార్థవ్యయవర్గమును నానార్థవర్గులో చేర్చదగునా అవ్యయవర్గులో చేర్చదగునా యని సందేహ ముదయించు చున్నది. ఇది యొక ఉత్థాపిత సమస్య. క్షీరస్వామి అవ్యయవర్గుతో కలిపి పఠించెను. మల్లినాథుడు నానార్థవర్గుతో కలిపి వ్యాఖ్యానించెను. అమరుడు నానార్థవర్గు చివర "పరిచ్ఛదే నృపార్హేఽర్థే పరిబర్హోఽవ్యయాః పరే" అని వ్రాసినచోట అవ్యయాః (ఽవ్యయాః) పరే అని ప్రత్యేకముగా విడదీసి చదువుటకు వీలులేదు. అందుచేత దీనిని నానార్థవర్గుతో కలిపి పఠించుటయే యుక్తము. ఈ యెడ పురుషోత్తముడు అమరుని కంటె స్పష్టముగా నానార్థవర్గును నిర్వహించియుండుట గమనింప దగియున్నది. ఇట్లు పురుషోత్తమునకు అమర మతముతో గల భావైక్యమును గుర్తించియే ఆనంద రామ బారువా పండితుడు[24] అమరకోశమున సందేహము కలిగి నపుడెల్ల త్రికాండశేషమునే ప్రమాణీకరించి యున్నాడు. ఔఫ్రెష్ట్, బర్నెల్ మొదలుగా గల పెక్కుమంది పండితులు త్రికాండశేషమును అమరశేషమను పేరనే తమతమ విమర్శనము లందు వెలయించి యున్నారు.

ఈ విషయమును విశేష పరిశ్రమము లేకుండ కేవలము శబ్దసంగ్రహ మును పరిశీలించినంతనే తేటతెల్లము కాగలదు. ఉభయ కోశములందును విష్ణుపర్యాయ పదావళిని చూడగా నామలింగాను శాసనమున -

విష్ణుర్నారాయణః కృష్ణో వైకుంఠో విష్టరశ్రవాః
దామోదరో హృషీకేశః కేశవో మాధవః స్వభూః
దైత్యారిః పుండరీకాక్షో గోవిందో గరుడధ్వజః
పీతాంబరోఽచ్యుతః శార్ఙ్గీ విష్వక్సేనో జనార్దనః
ఉపేంద్ర ఇంద్రావరజ శ్చక్రపాణి శ్చతుర్భుజః
పద్మనాభో మధురిపు ర్వాసుదేవ స్త్రివిక్రమః
దేవకీనందనః శౌరిః శ్రీపతిః పురుషోత్తమః
వనమాలీ బలిధ్వంసీ కంసారాతి రధోక్షజః
విశ్వంభరః కైటభజి ద్విధుః శ్రీవత్సలాంఛనః
(పురాణ పురుషో యజ్ఞపురుషో నరకాంతకః
జలశాయీ విశ్వరూపో ముకుందో మురమర్దనః)

అని యుండగా త్రికాండశేషమునందు-

అథ హరి శతబిందు శ్రీకర శ్రీవరాహ
జిత పరపురుష శ్రీగర్భ షడ్బిందవనంతాః
నరకజి ద్ధృతధామా కేశవో జన్మకీలః
క్రతుపురుష నృసింహ శ్రంథ జహ్నూశ్చదేవాః
కోకః పురాణపురుషో నలినేశయశ్చ
వాసు ర్నారాయణ పునర్వసు విశ్వరూపాః
అః శ్రీనివాస ధరణీధర వామ నైక
శృంగాశ్చ వృష్ణి వృషశత్రు దశావతారాః
సోమగర్భాది దేవాదివరాహ స్వర్ణబిందవః
గదాగ్రజో ముంజకేశీ సదాయోగీ సనాతనః
రంతిదేవ శివకీర్తనౌ త్రిపా త్సోమసింధు
రపి రాహుమూర్ధ్నచిత్
కాలనేమి యవనారి పాండ వాభీల సింధు
వృష కృష్ణకేశినః
హేమశంఖః శతావర్తో మను సాత్వత వారిశాః
వర్ధమానః సతానందో జగన్నాథః సుయామునః
పూతనా ధేనుకారిష్ట కేశి చాణూరసూదనః

అని వ్రాయబడి యున్నది. ఈ యుదాహృత పర్యాయపదావళి యంతయు పురుషోత్తమదేవుని యప్రతీతపద సంపాదనాభిలాషమును, ప్రసిద్ధ నామలింగానుశాసన త్రికాండ శేషగ్రంథ నిర్మితీషను తెల్లము చేయుచున్నది కదా!

ఈ విధముగా అమరకోశ త్రికాండ శేషోభయ గ్రంథ సకృద్వ్యాఖ్యాత శబ్దార్థ సంప్రతిపత్తి నుపలక్షించి దృష్టప్రత్యయులగువారు కూడ రెండింటను సమానముగా గోచరించు పదజాలమును గూర్చి సందేహించుటను గూర్చి[25] వివరింపవలసియున్నది. స్పష్టార్థప్రతిపత్తి, గుణాంతర విధానము, ఛందఃప్రతిసవ్యమును హేతువులుగా శేషగ్రంథముల యందు మూల కోశము నుండి యంశము లవతరించుచుండుట పునరుక్తము కాక తప్పదు.[26] ఈ దోషము శేషకోశము లన్నింటికి సామాన్య విషయము. ఈ విధముగనే త్రికాండశేషమునందు కూడ అక్షతాంశుమదకూపారాది శబ్దములు కొన్ని పునరుక్తములు కలవు. వాని పరిమితిచేత నిది అమరకోశ పరిశిష్టము కాదనుటకు బలము చాలదు.

అంతేకాక యత్కర్తృకమో తెలియని యొకానొక పూర్వరచిత శేషామరకోశమందు అమరము త్రికాండ సంజ్ఞితమే అను వివృతి యొకటి కానవచ్చు చున్నది.[27] మహేశ్వరసూరి రచించిన నామలింగాను శాసన వ్యాఖ్యానమునందు-[28]

కోశస్యేవ మహీపానాం కోశస్య విదుషామపి
ఉపయోగో మహాన్యస్మాత్ క్లేశస్తేన వినా భవేత్

గోమాన్తక ప్రాన్తజుషా శ్రీమహేశ్వర శర్మణా
కృతా టీకామరేకోశే సంక్షిప్తార్థా సుబోధినీ

సా మయా పూరితా కోశాంతర శబ్దాభి పూరణాత్
భాషాపర్యాయశబ్దైశ్చ క్వచిల్లింగాది భేదతః

త్రికాండశేషో హైమశ్చ విశ్వకోశోఽథ మేదినీ
ఏవ మాదిషు యే శబ్దా లిఖితా స్తే క్వచిత్ క్వచిత్.

అను నవతారిక కలదు. అతనికి కోశాంతర శబ్దాభిపూరణమునకై త్రికాండశేషమే ముందుగ గోచరించుటను చూడగా నానాటికి నిది రూఢ్యనువాదమే యనిపించుచున్నది.

కాలక్రమ పరిగతిని పర్యాలోకించినను పురుషోత్తమ దేవుడు అమర నిఘంటు శేషగ్రంథకారు డగుటకు విప్రతిపత్తి కాన రాదు. అమరసింహు డదమ పక్షమున నాల్గవ శతాబ్ది కన్న ప్రాచీనుడు కాగా త్రికాండశేష ద్విరూపకోశ హారావళ్యేకాక్షర నిఘంటువులకు, జకార సకార భేదకోశములకు కర్తయగు పురుషోత్తమ దేవుడు పదునూడవ శతాబ్దియుత్తరార్థమున కర్వాచీను డగుచున్నాడు. నానార్థసంగ్రహకోశ పీఠికయందు అనందరామపండితు29 డీతడు వంగదేశీయుడు హలాయుధ వంశోత్పన్నుడు నని వ్రాయగా, మహారాష్ట్ర కవిచరిత్ర యను విమర్శ గ్రంథమున నీతడు కటకము రాజధానిగా కళింగదేశము నేలిన యోధ్రక్షత్రియుడనియు శాలివాహన శకము 14వ శతాబ్దమున నుండెననియు కలదని పురుషోత్తమీయ నిర్ణయసాగర ముద్రణమున దుర్గా ప్రసాద కాశీనాథ పండితులు పీఠికలో వ్రాసిరి. విల్సన్ ఈతడు మహేశ్వరునికన్న ప్రాచీనుడు కాదగునని యూహించెను. కాని మహేశ్వరుని శబ్దభేద ప్రకాశమును చూచియే పురుషోత్తమ దేవుడు ద్విరూప కోశమును కూర్చెనని అనందరామ బారువా యూహించెను. త్రికాండశేషము నుండి మేదినికరుడు, ఉజ్వల దత్తుడు, రఘునందనుడు, శివదత్తుడు, మల్లినాథుడు మొదలగువారు పలుచోట్ల నుదాహరించుటచే వీరికంటె ప్రాచీనుడని మాత్రము భావింపవచ్చును. ఈతని చరిత్రాదికమును గూర్చి శుశ్రూష యింకను నల్లే వీనుమిగిలియున్నది. ఈతడు బౌద్ధుడనియు, జైనుడనియు వాదము లల్లే యున్నవి.

ఉపలభ్యములగు నాధారములను విమర్శించి చూడగా పురుషోత్తమ దేవుని త్రికాండశేషము నామలింగాను శాసనమునకు శేషగ్రంథము కాదనుట యసిధారా వ్రతమనియే నిర్ధారిత తాత్పర్యార్థ మగుచున్నది.

## అనుబంధ జ్ఞాపికలు

1. ముద్రితము -

   (i) చంద్రప్రకాశ యంత్రాలయము బొంబాయి. శక. 1788

   (ii) నిర్ణయసాగర ముద్రాలయము, బొంబాయి, శక. 1811

   (iii) శీలస్కంధ సారార్థ చంద్రికా వ్యాఖ్యతో, 1916.

   (iv) వావిళ్ల ప్రతి (శేషాద్రిరమణకవుల పీఠికతో).

2. అమరకోశము, బొంబాయి సంస్కృత సిరీజ్ ముద్రణ, 1886, చూ. పీఠిక, పుట 1.

3. అసుర ఖండనము, శ్రీహర్షుడు, చెన్నపురి జి. ఒ. ఎమ్. ఎస్. (సంస్కృత) లిఖిత ప్రతి, సం. 982, డి. 1595. చూ. ముద్రిత ప్రతి, డా॥ వి. రాఘవన్ పీఠిక.

4. విశ్వప్రకాశము : మహేశ్వరసూరి విరచిత విశ్వకోశముగా వావిళ్ళ ముద్రణ, 1931, 1958. శీలస్కంధయతి పీఠికతో, 1911.

5. నామలింగాను శాసనము, సం. అనందరామ బారువా,

6. శబ్దభేద ప్రకాశము, సం. అనందరామ బారువా, పబ్లికేషన్ బోర్డు, అస్సాం, 1969.

7. చూ. చాటుపద్య రత్నాకరము, శ్రీనాథచాటువుకు సంస్కృత వ్యాఖ్య (సం. దీపాల పిచ్చయ్యశాస్త్రి, 1961, పుట ౨౨, ౨౩. రః పుమాన్ వ్యాపకే దీప్తౌ సమర్థేఽతిశయే బలే - ఇత్యాదిగా కూడ శుభాంగుని వని.

8. - అందే, పుట ౨౨ ౨౩.

9. నామలింగానుశాసనము, క్షీరస్వామివ్యాఖ్యతో, సం.వి.జి.ఓ కా., పూనా, 19 3.

10. సదుక్తి కర్ణామృతము, శ్రీధరదాస సంకలితములో శాలికనాథ సూక్తిగా నుదాహృతము.

11. కోశము, నిఘంటువు అనునవి యేకార్థ బోధకములు కావు. అయినను వ్యవహారమున పర్యాయ పదములుగానే సంభావితములు. వివరములకై చూ. శబ్దార్థ కల్పతరువు, మామిడి వేంకటార్యుడు.

12. చూ. విహితేకార్థ నానార్థ
దేశ్యశబ్ద సముచ్చయః
నిఘణ్టుశేషం వక్ష్యేఽహం
నత్వార్హత్పద పఙ్కజమ్ – నిఘంటు శేషము.

13. యాస్క– నిఘంటువు, మోతీలాల్ బనార్సీదాస్, ఢిల్లీ, 1967, ౧-౧౮, ౧౯ చూ. పుట 40.

14. వాక్యపదీయము, భర్తృహరి, (సం) కె వి. అభయంకర్, యూనివర్సిటీ ఆఫ్ పూనా, పూనా, 1965. ౨-౩౧౫, ౩౧౬ చూ. పుట. ౪౨.

15. సంస్కృత్ కోష్ ఉద్భవ్ ఔర్ వికాస్ (హిందీ), డా. బాల ముకుంద ద్వివేది, అలహాబాద్, 1975, పుట 53 నుండి.

16. అమరకోశ వ్యాఖ్యలొక నూట యేబది వఱకున్నటు తెలియు చున్నది. ఒక కొన్ని ప్రసిద్ధము లిట నుదాహృతములు:

అమరకోశ పంజిక – బృహస్పతి కృతము
అమరకోశ పంజిక – నారాయణ శర్మ
(పదార్థ కౌముది)
అమరకోశ పదవృత్తి – అజ్ఞాత కృతము.
అమరకోశ మాల – పరమానందుడు.
అమరకోశ వ్యాఖ్య రాఘవేంద్రుడు
అమరకోశ వ్యాఖ్య – రామశర్మ
అమరకోశోద్ఘాటనము – క్షీరస్వామి
అమర కౌముది – నయనానంద రామచంద్రుడు.
అమరటీక – శ్రీధరుడు
అమర పద పారిజాతము – మల్లి నాథుడు
అమరపద్మ ముకుటము – రంగాచార్య
అమరబోధిని – లింగభట్టు
అమరబోధిని – విశ్వ ముకుందశర్మ
అమర వివేకము – మహేశ్వరుడు
అమర వృత్తి – రామస్వామి
అమర వ్యాఖ్య – లక్ష్మణశాస్త్రి
కామధేనువు – కర్తపేరు తెలియదు.
కాశిక – కాశీనాథుడు
క్రియా కలాపము – ఆశాధరుడు
గురు బాలబోధిని – భాను దీక్షితుడు.
గురు బాలబోధిని – మంజుభట్టు
టీకా సర్వస్వము – సర్వానందుడు
త్రికాండ చింతామణి – రఘునాథ చక్రవర్తి
త్రికాండ రహస్యము – రామనాథ సుకవి
త్రికాండ వివేకము – రామనాథుడు
పదచంద్రిక – రాయ ముకుటుడు
పదమంజరి – లోకనాథుడు
ప్రదీప మంజరి – రామేశ్వర శర్మ
బాలబోధిని – గోస్వామి
బుధ మనోహరము – మహాదేవ తీర్థుడు.
బృహద్వృత్తి – అజ్ఞాత కృతము.
ముగ్ధబోధ – భరతమల్లిక రచన.
వ్యాఖ్యా ప్రదీపము – అచ్యుతోపాధ్యాయ
వ్యాఖ్యామృతము – శంకరాచార్యుడు.
వ్యాఖ్యాసుధ – భానుజీ దీక్షితులు
(రామాశ్రమి)
శబ్దార్థ దీపిక – నారాయణ విధావినోద
సుబోధిని – నీలకంఠుడు

ఇవి కాక మాన్యభట్టు, లింగమసూరి మొదలుగా పెక్కండ్రు వ్రాసినవి కలవు. వీరిలో ననేకులు త్రికాండ శేషమును తఱచు ప్రమాణీకరించుట చూడనగును. పీయూషా దులు అమరవ్యాఖ్యలో అమరశేషమనియే త్రికాండశేషము నుదాహరించిరి.

17. నానార్థ రత్నమాల – ఇరుగ దండేశుడు, వాందారి పాపన్న శాస్త్రులవారి తెలుగు టీకతో, శ్రీరంగ ముద్రాక్షరశాల, మద్రాసు, 1897.

18. మేదిని కోశము, మేదినికరుడు, వావిళ్ళ, 1932.
షట్చత గాథాకోశ ప్రణయన విఖ్యాత కౌశలేనాయం మేదినికరేణ కోశః ప్రాణకరసూనునా రచితః – అని యుండు టచే మేదినికోశమనియే యుండదగును. (అష్టా. 6-3-63) చే సాధ్యరూపము. చూ॥ నానార్థ సంగ్రహము, అనందరామ బారువా పీఠిక (పుట 22).

19. అమరుడు బౌద్ధుడని రామాశ్రమిలో కలదు. జైనుడని వాదించువారు కూడ కలరు. పెక్కు బీహార్-ఉత్తరప్రదేశ్-మధ్యప్రదేశ్-ప్రతులందు యస్యజ్ఞానేతి శ్లోకమునకు ముందు-

జినస్య లోకత్రయ వందితస్య
పజౌలయే త్పాదసరోజ యుగ్మమ్
నమః శ్రీశాంతినాథాయ కర్మారాతివినాశినే
పంచమ శ్చక్రిణాం యస్తు కామ స్తస్మైజినే

అను శ్లోకములు కలవు. అమర పురుషోత్తమదేవు లిరువురను బౌద్ధులుగా, జైనులుగా, హిందువులుగా సంభావించిన వ్యాఖ్యానములు కలవు. ఇదియొక తేలని వివాదము.

20. సాహిత్య కల్పలతిక, శాంతలూరి కృష్ణసూరి, మద్రాసు జి. ఒ. యం. యస్. (సంస్కృత) లిఖిత ప్రతి, సం. 23516, ఆర్. 2604 (ఎ).

21. అమర కోశము, వంద్య ఘటీయము సర్వానందుని టీకా సర్వస్వముతో, త్రివేండ్రం సంస్కృత సీరీస్, సం. 38.

22. సంస్కృత వాఙ్మయచరిత్ర, మల్లాది సూర్యనారాయణ శాస్త్రి గారు, ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైద్రాబాద్, 1961.

23. మాధవీయ ధాతువృత్తి, సాయణాచార్యులు, చౌఖాంబా ప్రతి. పు. 86.

24. చూ. అధోజ్ఞాపిక 5., అమరకోశ పరిష్కృత ముద్రణము.

25. చూ. భారతి, శ్రీ చిరంజీవి లేఖ, 1980 జులై

26. తెలుగులో నిట్టి ఘట్టము కలదు. చూ.

గీ. ఆంధ్ర నామ సంగ్రహమునందుఁ జెప్పని
కొన్ని తెనుఁగు మఱుఁగు లన్ని కూర్చి
యాంధ్రనామ శేష మనుపేరఁ ....

చెప్పెదనని ప్రతిజ్ఞ చేసి, పైడిపాటి లక్ష్మణకవి ఆంధ్రనామ సంగ్రహమునకు శేషకోశము నుపకల్పించిన అడిదము సూరకవికి పెక్కు పదములను పునరుక్తము చేయక తప్పలేదు. మచ్చునకు రెండు మాత్రము చూ.

(i) ఆంధ్రనామ సంగ్రహము -

ఎద యన డెందం బనఁగా
మది యనఁగా నెడదనంగ మఱి యుల్లము నా
హృదయమునకు నివి యొనఁగును
విదితంబుగ నాహ్వయములు .. "

ఆంధ్రనామ శేషము -

మది డెంద ముల్ల మెద యన
హృదయంబున కాఖ్యలయ్యె.. "

(ii) ఆంధ్రనామ సంగ్రహము -

కొదవ కొద కుందు తగ్గు తక్కువ కొఱంత వెలితి కొఱలొచ్చు కడమ నా వెలయు న్యూన సమభిధానములు....

ఆంధ్రనామ శేషము -

కొఱ కొఱఁత తక్కువ వెలితి కొదవ కడమ యనఁగ నూనంబునకు నాఖ్యలై తనర్చు.

ఇట్టివి తప్పవు కదా !

27. చూ. మద్రాసు జి. ఒ. ఎమ్. ఎస్. (సం) డి. 1773.

28. నామలింగాను శాసనము, మహేశ్వరుని అమర వివేక టీక, మద్రాసు జి. ఒ. ఎమ్. ఎస్. (సం) డి. 1636.

29. నానార్థ సంగ్రహము, సం. ఆనందరామ బారువా, అస్సాం, 1969. చూ. పీఠిక (పుట 25).



# మాతృమూర్తి

తినడానికి
మూడేరొట్టెలు
వున్నప్పుడు

తినేవాళ్ళు
నలుగురు
అయినప్పుడు

తనకేమాత్రం
ఆకలిలేదు
అన్నవ్యక్తి

తప్పకుండా
అయ్యింటుంది
మాతృమూర్తి.

# టు - లెట్

నా హృదయంలో
గది కాళీగా వున్నది

అది పదిలంగా
చూసుకొనే వారికి
ఇవ్వాలని వున్నది

సూటిపోటి
మాట మేకులు
కొట్టని వారికి

చీటికిమాటికి
కోపతాపములు
చూపని వారికి

రాగ జ్యోతితో
శాంతి కాంతులను
నింపే వారికి

ఇవ్వాలని వున్నద
నా హృదయంలో
గది కాళిగా వున్నది.

"జోశ్యభట్ల"



శ్రీ గణపతి రామచంద్రరావు

# రస మౌలిక తత్త్వము

'నహి రసాదృతే కశ్చిదర్థః ప్రవర్తతే' యని నాట్యశాస్త్రము నందు భరతముని యర్థప్రవృత్తికి తదంతర్గత రసము కారణ మని తెలిపియున్నాడు. అర్థము, రసము, రస స్వభావము మరియు నర్థ ప్రవృత్తి యనబడు నాలుగు విషయము లర్థమైనవారికి భరతుని యభిప్రాయము స్పష్టముగా తెలియగలదు. రస మౌలిక తత్త్వ మీ సూత్రమునందు నిక్షేప రూపముననున్నది. దీనిని తెలియ గల్గిన వాడు మాత్రమే సాహిత్య శాస్త్రమునందు సంచారి భావాను భావ విభావము లనబడినట్టి మానవునియొక్క గుణకర్మ స్వభావములను గూర్చి తెలియగలుగును. గుణకర్మ స్వభావముల వలన మానవునిలో పుట్టునట్టి రసము వాని శరీరముయొక్క నవ విధములగు ప్రవృత్తులకు కారణ మగుచుండునని భరతముని భావము.

ఇపుడు భరతముని సూత్రమునందలి యర్థశబ్ద వివేచనము చేయబడుచున్నది. నామ రూపములను కలిగి యున్నట్టి లోకము నందలి వస్తువులన్నియును శబ్దశాస్త్రమునందు పదార్థములనబడినవి. పదము లౌకిక వస్తు నామమునకు మరియు నర్థము లౌకిక వస్తు రూపమునకు ప్రతీకలు కాగా పదార్థమనునది లౌకిక వస్తువునకు ప్రతీకగా నిల్చినట్టి శబ్దశాస్త్రము నందలి పారిభాషిక పదమగు చున్నది. నిత్యవ్యవహారమునందు మనకు నామోచ్చారణము వలన భౌతిక వస్తురూపము మనములో భాసించునట్లు శబ్దవిదులకు పదోచ్చారణము వలన నర్థము మనోగోచరమగు చుండును. ఒక పదార్థ మర్థమగుట యనగా నా పదముచే సూచింపబడునట్టి నామము గల భౌతిక వస్తువు యొక్క రూపము మనోగోచరమగుట. ఇట్లు శబ్దశాస్త్రము నందలి యర్థములన్నియు భౌతిక వస్తు రూపములని తెలియుచున్నది. శబ్దశాస్త్రమునం దర్థపరిశీలనము చేయుట యనగా లోకమునందలి చరాచర వ్యక్తావ్యక్త భౌతిక వస్తువుల యొక్క స్వరూప స్వభావములను పరిశీలించుట యగుచున్నది. ఎవ్వరీ యర్థ స్వరూపము నిట్లర్థము జేసికొనిరో వారు మాత్రము ఇమ్ముందు తెలుపనున్న యర్థత్రయము నర్థము జేసికొనుటకై యధికారు లయ్యెదరు.

ఇపు డర్థత్రయము తెలుపబడు చున్నది. శబ్దార్థములు విభిన్న తత్త్వములు. శబ్దము దివ్యమైనదని తత్త్వవేత్తలు, శాశ్వతమైనదని భౌతిక శాస్త్రవేత్తలు తెలిపియున్నారు. త్రిగుణాత్మకమైన సృష్టిలో గల సకల భౌతిక పదార్థములకును, మానవులకును దేహత్రయము భాసించునట్లు శబ్దమునకు కూడా దాని దేహత్రయ మనబడునట్టి యర్థత్రయము కలదు. శబ్దము యొక్క శక్తియే యర్థ మనబడినది గావున శబ్దము తన శక్తిత్రయముచేత నర్థత్రయధారణము చేయుచున్నది. అది తన యభిధా శక్తిచేత రసదేహమును, వ్యంజనాశక్తిచేత ధ్వనిదేహమును, లక్షణాశక్తిచేత నలంకార దేహమును కల్పించుకొనినది. పదార్థ ప్రాణుల స్థూలదేహములకు సంబంధించిన విజ్ఞానమును శబ్దము తన స్థూలదేహమగు నలంకారము ద్వారా, సూక్ష్మదేహములకు సంబంధించిన విజ్ఞానమును తన సూక్ష్మదేహమగు ధ్వనిద్వారా, కారణదేహములకు సంబంధించిన విజ్ఞానమును తన కారణదేహమగు రసముద్వారా మానవులకు ప్రబోధించుచుండును. మానవుని స్థూల సూక్ష్మ కారణ దేహములు వరుసగా మాయాజీవ ప్రకృతి స్వరూపములగునట్లు శబ్దము యొక్క స్థూల సూక్ష్మ కారణ దేహములు వరుసగా యక్షరము, పదము మరియు నర్థస్వరూపములై యున్నవి. అనగా మాయాస్వరూపమగు నక్షరము వలన శబ్ద స్థూల శరీరమగు నలంకారము, జీవస్వరూపమగు పదము వలన సూక్ష్మశరీరమగు ధ్వని, ప్రకృతి స్వరూపమగు నర్థము వలన కారణదేహమగు రసమేర్పడినవి.

మానవునకు దేహత్రయాతీతమగు నవ్యక్త శరీర మొకటి యున్నట్లు శబ్దమునకును నలంకార ధ్వని రస దేహత్రయాతీతమగు ఛందశ్శరీరము గలదు. అట్టి ఛందమునుండి యక్షరపదార్థ త్రయోత్పత్తి కొనసాగుచుండును. ఛందోరూపమున నున్న శబ్ద స్వరూపమును తెలియగల్గిన జ్ఞాని వైదిక పరిభాషలో ఋషియనియు, సాహిత్య శాస్త్ర పరిభాషలో కవియని పిలువబడుచుండును. ఛందము వేదాంగములం దొకటిగా, విద్యగా ప్రసిద్ధి చెందినది. ఛందము నుండి సాహిత్యశాస్త్రము మరియు సాహిత్యమునందొక భాగముగా నలంకారము వెలువడినవను రహస్యమును తెలియని రాజశేఖరకవి

తన కావ్యమీమాంసలో వేదార్థ గ్రహణమునకై యలంకారము నేడవ వేదాంగముగా గ్రహింపవలెనను తన యభిప్రాయమును చెప్పియున్నాడు. రసాలంకార ధ్వని తత్త్వముల రహస్యముల నెఱుగగలిగినవారు మాత్రము శబ్దముయొక్క ఛందోరూపమును తెలియగలుగుట కధికారులయ్యెదరు.

ఇంతవరకు భరతముని సూత్రము నందలి యర్థశబ్ద వివేచనము చేయబడినది. అర్థత్రయ స్వరూపము వివరింపబడినది. ఇపుడు రస శబ్దము వివేచన చేయబడు చున్నది. రస శబ్దమునకు ముఖ్యార్థము జలము. భౌతిక ద్రవ్యమగు జలము సాహిత్య పరిభాషలో రసముగా వ్యవహరింప బడినది. సాంఖ్య దర్శనము ననుసరించి రసము తన్మాత్రయనియు దానిచే జలమేర్పడు ననియు తెలియుచున్నది. అవ్యక్త ప్రకృతి రూపమున నున్న రసము యొక్క వ్యక్తమగు వికృతి రూపము జలము. జలమునుండి విశ్వ మావిర్భవించిన దనెడు తైత్తిరీయోపనిషత్తులోని రససృష్టి కథనము ననుసరించి భూమి మరియు దాని యందలి సకల భౌతిక పదార్థములును రసపదార్థములని తెలియవచ్చు చున్నది. అట్టి రసపదార్థముల బూడిద కూడ రసముగా వ్యవహరింప బడినది. విశ్వమంతియును రస స్వరూపము కలది యగుటకు కారణమది రసము నుండి పుట్టుటయే కారణమని తైత్తిరీయము తెలుపుచున్నది. వేదము లందు తేజశ్శబ్ద జలసృష్టుల ప్రస్తావన కలదు. అందు చివరిది యగు జలసృష్టిని గూర్చి 'రసోవై సః యని తైత్తిరీయము తెలుపు చున్నది. జలసృష్టి లక్షణములను తెలియగలిగినవారు మాత్రమే తక్కిన తేజశ్శబ్దసృష్టులను గూర్చి తెలియగలుగుట కధికారి కాగలరు.

తైత్తిరీయోపనిషత్తునందు 'అసద్వా ఇదమగ్ర ఆసీత్' (2-7) యని చెప్పబడిన జలసృష్టిని గూర్చి ఋగ్వేదము 'సలిలం సర్వే అ ఇదం' 10-129-3 యనుచు, తైత్తిరీయారణ్యకము 'ఆపోవా ఆసన్ సలిలమేవ' 1-23-1 యనుచు, తైత్తిరీయ బ్రాహ్మణము 'ఆపోవా ఇదమగ్రే సలిలమాసీత్' 1.1.3.5—6 యనుచు, తైత్తిరీయ సంహిత 'ఇదమగ్రే సలిలమాసీత్' 5.6.4.2—3 యనుచు తెలియజేయుచున్నవి. ఉపనిషత్తులో నసత్తు యనబడినదే తక్కిన గ్రంథములందు జలమని స్పష్టముగా చెప్పబడినది కావున నసచ్ఛబ్దము జలమునకు బదులుగా ప్రయోగింపబడినదని తెలియు చున్నది. ఉపనిషత్తునందలి 'రసోవై సః' యను వాక్యమునందలి 'సః' యను శబ్దము తొలుత నేది యసద్రూపమున నుండెనో యది యను నర్థమున ప్రయోగింపబడినది. తొలుత నసద్రూపమున నుండినది రసమును నర్థమున 'రస' శబ్దము వాడబడినది. తక్కిన గ్రంథములు జలమునుండి ప్రపంచోద్భవమును గూర్చి తెలియ జేయుచుండగా తైత్తిరీయోపనిషత్తు జలముయొక్క యవ్యక్త రూపమగు రస తన్మాత్రనుండి సృష్టి కొనసాగెనని తెలియజేయు చున్నది. సూక్ష్మముగా విచారించువారికి 'రసోవా ఇదమగ్ర ఆసీత్' యనునది తైత్తిరీయోపనిషత్తు యొక్క భావమని తెలియు చున్నది. తైత్తిరీయోపనిషత్తు రస ప్రపంచ నిర్మాణమును గూర్చి తెలుపుటతోబాటుగా రసపదార్థములందలి లక్షములను మరియు వాని యానందమును గూర్చి కూడా విషద వివేచన చేసియున్నది.

'అద్యతేత్తిచ భూతాని తస్మాదన్నం తదుచ్యతే' యనునది తైత్తిరీయము నందలి యన్న నిర్వచనము. తినుట మరియు తినబడుట యనునవి యన్నమునకు గల రెండు లక్షణములు. వాస్తవమున కవి యన్నరూపములందు గల రస లక్షణములు. మనము నివసించుచున్న యీ జలసృష్టి యందలి సకల పదార్థ ప్రాణుల దేహము లన్నస్వరూపములై యొకదాని నొకటి తినుచు మరియు నొకదానిచే నొకటి తినబడుచు నిరంతర పరిణామమును చెందుచున్నవి. ఈ సృష్టియందలి సమస్త పదార్థ ప్రాణు లన్నరస స్వరూపము లనుటకు దిగువన కొన్ని యుదాహరణముల నిచ్చు చున్నాను.

ఒకప్రాణి వేరొక ప్రాణిని తినుచుండుటను మరియు నట్టి ప్రాణి వేరొక ప్రాణిచేత తినబడుచుండుటను మనమనుదినము చూచుచునే యున్నాము. ఎలుకలు మన్నును, పావురము లిసుకను, చెదపురుగులు కట్టెలను, పాములు గాలిని, చకోరములు వెన్నెలను, పశువులు గడ్డిని తినుచు ప్రాణులు భౌతిక పదార్థములను తినుచుండు ననుటను సమర్థించు చున్నవి. ఈ సృష్టిలో నేదేని పదార్థమును తినని పదార్థముగాని నేదేని పదార్థముచేత తినబడని పదార్థముగాని లేవు. ఒక ధాతుపాత్రలో నుంచబడిన బియ్యము మొదలగునవి కొంత కాలమునకా ధాతుపాత్రనే తినుటను, ధాతుపాత్ర తన యందలి పదార్థములను తినుటను మనము చూచుచునే యున్నాము. ఈ యుదాహరణముల వలన మనము నివసించుచున్న జలసృష్టి యంతయు నన్నమయమని తెలియుచున్నది.

ఇపుడు రసపదార్థము (అన్నము) లందలి తినుట మరియు తినబడుట యను ప్రక్రియలు కేవల రసరూపమున మాత్రమే సాధ్యములని తెలియ జేయుచున్నాను. విభిన్న రసపదార్థము లందలి రసము తినుట మరియు తినబడుటయను లక్షణముల నేక కాలమున నెట్లు కలిగియుండునో తెలుపుచున్నాను. ఒక రసపదార్థమునకు తదన్యమగు రసపదార్థము లభించునపుడు 'రసంహ్యేవాయం లబ్ధ్వా నందీ భవతి' యని తైత్తిరీయమునందు చెప్పబడిన యానందమెట్లు లభించుచుండునో తెలుపుచున్నాను.

జిహ్వయందు లాలాజల రూపమున స్రవించు రసము తదన్యమగు నన్నరసమును తినుచుండగా నన్నరసము లాలాజల రూప రసముచేత తినబడుచుండును. ఈ యుదాహరణము వలన మానవదేహము మరియు నన్నము రస స్వరూపము లనియు, లాలాజలాన్న రసములు రసములనియు, తినుట మరియు తినబడుట యనునవి రస లక్షణములనియు తెలియుచున్నది. ఇచట నన్వయ క్రమమున ననగా మానవ పరముగా రస లక్షణములు చెప్పబడినవి. ఇపుడు వ్యతిరేక క్రమమున ననగా నన్నపరముగా రస లక్షణ ములు చెప్పబడుచున్నవి. ఒక తినదగు రస పదార్థమును చూచిన వానికి నోటిలో నీరూరుచుండును. అనగా బహిర్గతాన్నము నందలి రసమునకు మానవ దేహాంతర్గతమై యున్నట్టి రసమును దూరము నుండియే తనవైపున కాకర్షించుకొను శక్తి కలదని తెలియు చున్నది. అన్నరసము తనశక్తిచే మానవదేహమునందలి రసమును వెడలించి తన యాహారముగా స్వీకరించుచుండును. మన మన్న మును తినుట యెంతటి వాస్తవమో మనల నన్నము తినుచుండుట కూడ యంతటి వాస్తవమని యుపనిషద్భావము. అన్నము తన యనుభవమునకై లేక యాహారమునకై రసప్రకృతికి వశుడగు జీవునిపై తన ప్రభావమును జూపి వాని శరీరమును తినివేయు చుండును. మానవుని జిహ్వ యందలి రసము మరియు నన్నము నందలి రసము పరస్పరము కలయిక చెందినపుడు మాత్రము మానవునకు షడ్రసానుభూతులు కలుగు నవకాశమున్నది. ఈ విషయమునే తైత్తిరీయోపనిషత్తు రసదేహధారియగు మానవునకు రసపదార్థమగు నన్నము లభించునపుడానందము కలుగు చుండునని 'రసహ్యేవాయం లబ్ధ్వా నందీ భవతి' యని చెప్పినది. తినునది మరియు తినబడునది రసమనియు, రసమనునది రసమును గ్రహించి మాత్రమే యానందించుననియు తెలియ గలిగిన వారు మాత్రము మున్ముందు చెప్పబడు నుదాహరణముల నర్థము జేసికొనుట కధికారులయ్యెదరు. ఇచట తృప్తికి పర్యాయ వాచకముగా తైత్తిరీ యము నందానంద శబ్దము ప్రయోగింపబడినదని మనవి చేయు చున్నాను.

స్త్రీలలో రజోరూపమున నున్న రసము పురుషులలో వీర్య రూపమున నున్న రసముతో కలియునపుడు స్త్రీపురుషు లానందిం చెదరు. 'ఏషహ్యేవానందయాతి' (తై. ఉ. 2-7.) రసమే స్త్రీపురుషుల నానందింపజేయుననియు, జడ శరీరములను కర్మలందు ప్రవర్తింప జేయునట్టి రసముగాక సృష్టిలోని తదన్య పదార్థమేదియు సంతోష పెట్ట జాలదనియు తైత్తిరీయము తెలిపినది. పైన చెప్పిన యుదా హరణములందలి స్త్రీపురుషుల దేహములు రసపదార్థ లనియు, రజో వీర్యములు రసములనియు, విలీన మొనర్చుకొనుట మరియు విలీన మగుట యనునవి రస లక్షణము లనియు తెలియవచ్చు చున్నది. ఈ యుదాహరణము నందలి రజో వీర్యములను గూర్చి యన్వయ వ్యతిరేక క్రమములతో నర్థవిచారణ చేసి రసమునకు గల యేక లక్షణమును లక్షణ ద్వయముగా తెలుసుకొనవలసి యుండును.

స్త్రీ దేహమునందలి రసము (రసమే ప్రాణుల కారణ దేహము) పురుషదేహము నందలి రసము నాకర్షించుకొనుచుండగా పురుషదేహము నందలి రసము స్త్రీ దేహమునందలి రసముచేత నాకర్షింపబడుచుండును. రెండు దేహముల కలయిక రూపమగు గాఢాలింగనము వలన రసానుభూతి కలుగుచుండును. ఈ యుదా హరణము వలన స్త్రీ పురుష దేహములు రసపదార్థములనియు, వారియందు ప్రవహించు రక్తములు రసములనియు, నాకర్షించుట మరియు నాకర్షింపబడుట యనునవి రస లక్షణములనియు తెలియు చున్నది.

అంతరంగము నందలి జలప్రకృతికమగు చిత్తమనబడునట్టి సూక్ష్మరసపదార్థము బహిర్గత వస్తురూపములతోనున్న స్థూల రస పదార్థములను తనలో ప్రతిబింబిత మొనర్చుకొనుచుండగా నవి యన్నియును చిత్తమునందు ప్రతిబింబించుచుండును. ఈ యుదా హృతి వలన నరుని చిత్తము మరియు వస్తువులు రసపదార్థము లనియు, చిత్త వస్త్వంతర్గత జలములు రసములనియు, ప్రతిబిం బించుకొనుట మరియు ప్రతిబింబించుట యనునవి రస లక్షణము లనియు తెలియుచున్నది. చిత్తవిలీనములైనట్టి వస్తువులందు చిత్తము గూడ విలీనమైయుండుటవలన చిత్తము మరియు వస్తువు లొకదాని యందొకటి చేరి నొకదానినొకటి గ్రహించుచుండునని తెలియు చున్నది. చిత్తము తాను ధారణము చేసిన వస్తువుల యందు సమాధ్య వస్థను పొందినపుడు వాసనారూప సంస్కారము లేర్పడుచుండును. చిత్తమునకు వస్తుధారణము చేయగల శక్తి యుండునట్లే వస్తువునకును చిత్తమును ధారణచేసి నిలుపగల శక్తియుండును. వస్తువు చిత్తమును ధారణచేసి చలింపకుండ తనలో నిలుపు కొనునపుడు చిత్తము వస్తువునందు సమాధ్యవస్థను చెందును.

లోకమునందలి జలకణము తదన్య జలకణమును తన కంటించుకొనుచుండగా నన్యజలకణము మొదటి జలకణమున కంటుకొను చుండును. ఈ యుదాహృది వలన జలకణములు రసస్వరూపములనియు, నవియే రసములనియు, నంటించుకొనుట మరియు నంటుట యనునవి రసలక్షణములనియు తెలియుచున్నది.

జలమువలన కలిగిన ప్రాకృతిక పదార్థము లన్నియును జలమునందు కరగుచుండగా జలము వానిని తనలో కరగించు కొనును. ఈ యుదాహృతి వలన జలము మరియు పదార్థములు రసస్వరూపములనియు, జలము మరియు వస్తువుల యందలి జలము రసములనియు, కరగుట మరియు కరగించుట యనునవి రసలక్షణము లనియు తెలియుచున్నది. జలసృష్టి యందలి సకల వస్తువులు జలప్రళయ కాలమునందు జలమునందు విలీనమైయుండి తిరిగి జలసృష్టి ప్రారంభమగునపుడు వ్యక్తరూపములను ధరించుచుండె ననెడు పురాణ వాక్యముల నీ యుదాహృతి బలపరచుచున్నది.

ఇపుడు కావ్యదృష్టితో రసలక్షణములు తెలుపబడుచున్నవి. ఇది యిపుడే తెలిపినను సరిగా నర్థముగాని విషయమైనను సందర్భము వచ్చినది కావున క్లుప్తముగా తెలియజేయుచున్నాను. కవిహృదయాంతర్గత రసము కావ్యరూపము ధరించి సహృదయ చిత్తాంతర్గత రసమును భావింప జేయుచుండగా సహృదయ చిత్తాంతర్గతరసము కావ్యరసమును భావించు చుండును. ఇచట విభావమగు సహృదయునకు కావ్యముద్దీపన విభావమై నిలిచి వాడనుభవించి యున్నట్టి వాని హృదయాంతర్గత రసమునే విశేషముగ భావింప జేయుచుండును. విశేషభావన చేయుట విభావలక్షణము. తాననుభవించిన రసము మరియు కావ్యరసము లందేది విశేషమైనదని సహృదయుడు భావించును. అతడుద్దీపన విభావ రూపమునను న్న కావ్యము నాలంబన విభావముగా భావించి యుత్కృష్టమగు కావ్య రసము నాస్వాదింప మొదలిడును. సహృదయుడుద్దీపనము చెంది తాననుభవించియున్నట్టి రసమును తిరిగి భావించుటతో పాటుగా కావ్యరసమును కూడ నేక కాలమున భావించు చుండును. ఆ రెండు రసముల నతడు సాధారణీకరణ మొనర్చి యనగా రెండు రకములగు రసానుభూతులకు తన భావనాశక్తిచే సమత్వయోగము ఘటింపజేసి రసజ్ఞానమును పొందును. అపుడు వానికి జ్ఞానము వలన నానందము కలుగును. అది జ్ఞానానందమనబడునుగాని రసానంద మనబడదు. రసమనునది రెండు రసపదార్థముల మధ్య, రెండును విభావములైనపుడు మాత్రమే యనుభవింపబడుచుండునని యింతకు ముందే తెలిపియుంటిని. సహృదయుని యానందము రసానందము కాదనియు, జ్ఞానానందమనియు జ్ఞాపకముంచు కొన వలెను.

కావ్యము ద్దీపన విభావమై నిలిచి సహృదయు డనుభవించి యున్నట్టి రసజ్ఞానమును స్మృతిపథంబున మెదలజేయును. అపుడతడు కావ్యము నాలంబనముగా గొని తదంతర్గత రసజ్ఞానమును పొందుచుండును. కాగా జ్ఞాన మొకనిలో సుప్తమై యున్న జ్ఞానమున కుద్దీపనము కల్గించి జాగృతిని కలుగజేయుననియు, నట్లు జాగృతిని పొందిన జ్ఞానము మాత్రమే జ్ఞానమును పొంద గలుగు ననియు తెలియుచున్నది. జ్ఞానము జ్ఞానమునందే నిలుచు నపు డానందము కలుగు ననునది శాస్త్రము లంగీకరించిన పరమ సత్యము. జ్ఞానము కొరకు చెప్పబడుచున్న కవిత్వము సహృదయాంతర్గత జ్ఞానమున కుద్దీపనము కల్గించి జాగృతునిగా నొనర్చు చుండగా లోకము నందలి చంద్రాది తదితరోద్దీపన విభావము లన్నియును మానవునిని రసప్రవృత్తిలో నిమగ్నమొనర్చి యజ్ఞానిగా పశుతుల్యునిగా మార్చుటకు ప్రేరణము లిచ్చుచుండును. కావ్యము వలన రసానందము లభించుననుట యటుంచి రసము వలన నానందమే లభించజాలదని ముమ్ముందు తెలియ జేయగలను.

ఇంతవరకు భరతముని సూత్రమునందలి రసశబ్దము జలమునకు పర్యాయ వాచకమనియు, తైత్తిరీయోపనిషత్తు నందలి రసమా యర్థమునే కలిగి యున్నదనియు తెలిపితిని. రసప్రపంచ సృష్టి, రసపదార్థము లందలి రసలక్షణములు, రసానందములను గూర్చి తైత్తిరీయోపనిషత్తు ప్రకారము వివరించియుంటిని. ఇపుడు భగవద్గీత యందలి రసశబ్దమునకును జలమను నర్థమే కలదని తెలియజేయుచున్నాను. "విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః రసవర్జం రసోప్యస్య పరం దృష్ట్వానివర్తతే" 2-59 యని భగవద్గీత రసప్రకృతి నుండి వైదొలగి సాధకుడు తేజః ప్రకృతిలో నివసించుటకు మార్గమును తెలిపినది. విషయముల ననుభవింపని వానికి విషయానుభవము తప్పుచుండును గాని చిత్తమునందనుభూత విషయ వాసనలు నిలిచియుండును గావున నట్టి విషయ వాసనలు తొలగవలెనన్నచో రసచిత్తమున కన్యమైనట్టి ప్రజ్ఞా రూపమగు బుద్ధిని దర్శించి తదనుసారము నడచు చుండునెడల విషయ వాసనలు కూడ తొలగిపోవునని గీత యుపదేశించుచున్నది.

మానవునకు జలప్రకృతికమగు కారణదేహముతో పాటు తేజః ప్రకృతికమగు సూక్ష్మదేహము కూడ కలదు. కారణదేహ కేంద్రమగు మస్తిష్కము నందుగల రసప్రకృతి చిత్తరూపమున నుండగా సూక్ష్మదేహ కేంద్రమగు హృదయమునందుగల తేజః ప్రకృతి బుద్ధిరూపమున నుండును. రసభావనలతో కొట్టుమిట్టాడు నట్టి చిత్తమునకు వైదొలగి జీవింపదలచినచో దానికి పరమైనట్టి (అన్యమైన) ప్రజ్ఞారూపమగు బుద్ధిని దర్శింపవలెననుచు, నట్టివాడు స్థితప్రజ్ఞుడగుననుచు భగవద్గీత తెలియజేయుచున్నది. అర్థ సమన్వయము చేయనేరని వారలీ శ్లోకమునందలి పరశబ్దమునకు పరబ్రహ్మమనియే యర్థము వ్రాసియున్నారు. అర్థము తెలియని శబ్దముల కర్థముగా భగవానుని దెచ్చి కూర్చుండబెట్టిన పండితు లెందరో కలరు. ప్రస్తుతము భగవద్గీత యందలి రసశబ్దము

జలమను నర్థమును కలిగియున్నదనియు, రసప్రకృతిని జయించుటకు ప్రజ్ఞను సంపాదించి యందు సుప్రతిష్ఠితుడు కావలెనని సాధకునకు బోధించుచున్నదనియు తెలియజేయుచున్నాను.

ఇపుడు పాతంజలి యోగశాస్త్రము నందలి యానంద మార్గమును గూర్చి తెలుపుచున్నాను. 'యోగశ్చిత్తవృత్తి నిరోధః' 'తదా ద్రష్టుః స్వరూపే వాస్థానం' యనునవి యోగశాస్త్రము నందలి ప్రారంభిక సూత్రములు. చిత్తవృత్తి నిరోధము యోగమనియు, చిత్తవృత్తులను నిరోధించు ద్రష్ట తన రూపమున నిలుచుననియు పైన చెప్పిన సూత్రముల భావములు. చిత్తమును నంతఃకరణము జలప్రకృతికమని తెలిపి యుంటిని. ఒకడు చిత్తవృత్తిని కలిగియుండుట యనగా నవరస ప్రపంచమునకు బద్ధుడై ప్రాకృతిక కర్మల నాచరించుట. ప్రజ్ఞారూపమగు బుద్ధిని దర్శించిన ద్రష్టయగు జ్ఞాని తన జ్ఞానము వలన చిత్తవృత్తులను నిరోధించి తన జ్ఞానస్వరూపమునందే నిలిచియుండవలెనని యోగశాస్త్రముపదేశించు చున్నది. భగవద్గీత మరియు యోగశాస్త్రము రెండును యోగశాస్త్రములగుట వలన సాంఖ్యయోగము లభిన్నములగుట వలన భగవద్గీత సాంఖ్యదర్శనము ప్రకారము చెప్పిన స్థితప్రజ్ఞుని లక్షణములు యోగ శాస్త్రమునందలి యోగి లక్షణములొక్కటియై యున్నవి. రసప్రకృతికి పైదొలగి బుద్ధితో మెలగవలెనని భగవద్గీతయందలి సాంఖ్యము, యోగశాస్త్రము నందలి యోగము తెలియజేయుచు 'సాంఖ్య యోగౌ పృథగ్బాలాః ప్రవదంతి న పండితాః' యను గీతా వాక్యమును సమర్థించు చున్నవి. రసానుభూతిని వదలి జ్ఞానమును బొందువానికి దాని ద్వారా నానందము లభించును. కవి తన కావ్యము ద్వారా నిట్టి జ్ఞాన బోధను కాంతా సమ్మితముగా కావించు చుండును. జ్ఞానమునిచ్చు కవిత్వము విద్యగా పరిగణింపబడును. ప్రస్తుతము యోగశాస్త్రము కూడ రస ప్రకృతిని గర్హించు చున్నదనియు, దాని నుండి మానవునకు విముక్తి లభింపజేయుటకే యవతరించినదనియు తెలియజేయుచున్నాను.

భరతముని సూత్రము నర్థము జేసికొనుటకై యర్థము రసము మరియు రసస్వభావములను గూర్చి తెలిపితిని. ఇపుడర్థప్రవృత్తికై రసము కారణమనెడి భరతముని భావమును తెలియజేయుచున్నాను. ప్రాకృతిక పదార్థములు మరియు ప్రాణులుగా లోకమునందర్థము రెండు విధములుగా నున్నదిగావున రెండుదాహరణములతో భరతుని భావమును తెల్పెదను. భౌతిక పదార్థములందు జలము జడరూపమున నణగియుండును. ఈ సత్యమును వ్యాకరణ శాస్త్రము కూడా 'లడయోరభేదః' యను సూత్రముచేత సమర్థించు చున్నది. వస్తువులు తమయందలి జడరూప జలముయొక్క లక్షణద్వయము వలన ప్రవృత్తి రూపమున కొనసాగును కావున వాని ప్రవృత్తి జడప్రవృత్తి యనబడినది. ప్రాణులలో జలము చైతన్య రూపమున ప్రవహించుచుండుటవలన వానియందలి ప్రవృత్తిని చైతన్య ప్రవృత్తి యనవలసి యుండును. కాని వానిలోని ప్రవృత్తి చైతన్య ప్రవృత్తిగా యంగీకరింప బడలేదు. శరీరాంతర్గత తేజోవాయుతత్త్వముల ప్రభావమువలన ప్రాణులలో రక్తముప్రవహించుచుండుటవలనను జలము పంచభూతములందలి యొక జడ తత్త్వముగా పరిగణింప బడుటవలనను ప్రాణులలోని ప్రవృత్తి చైతన్య ప్రవృత్తిగా యంగీకరింపబడలేదు. జడమగు జలమే తేజోవాయువులు కారణముగా చైతన్యవంతమై ప్రవహించుచుండుట వలన మానవ శరీరమునందు కలుగు ప్రవృత్తిని జడ చైతన్య ప్రవృత్తియనుటయే సమంజసము. లోకము నందలి చరాచర వ్యక్తావ్యక్త పదార్థప్రాణుల సకల ప్రవృత్తులకు వానిలోనున్న రసము కారణమను భరతముని మాట విజ్ఞానపు మాట.

ఇపుడు భౌతిక పదార్థములందలి జడప్రవృత్తికి వానిలోని రసము కారణమనుట కుదాహరణము నిచ్చుచున్నాను. ప్రవృత్తి యనునది క్రియారూపమున నిర్మాణాత్మకముగా నుండును. ఒక గోడనిర్మాణమునకై మన్ను అవసరము. మన్నులో జడరూపమున జలముండును. మట్టియందణగియున్న జలమును చైతన్యవంతమొనరుటకు దానిలో నీరు కలుపబడును. అపుడు మృత్తికాకణములందలి జలకణములు పరస్పర మాకర్షించుకొనుచు సంఘటితమై గోడగా రూపొందును. మట్టిగోడగా రూపొందగా తొలుత నెంత నీరు మట్టిలోని జడజల కణములను చైతన్యవంత మగుటకు కలుపబడియుండెనో యంతనీరు తేజోవాయువుల ప్రభావము వలన నెగిరి పోవును. నీరు కలుపక ముందు నున్నట్టి మృత్తికా కణములందలి జలము మాత్రము గోడయొక్క నిర్మాణమునకు కారణమగుచున్నది. గోడనిర్మాణమునకు మట్టిలో కలుపబడు నీరు నిమిత్త కారణమగుచున్నదేగాని సమవాయి కారణమగుటలేదు. ఇట్లేప్రాణుల దేహనిర్మాణమునకును జీవకణము లందుగల జలమేకారణమగుచున్నది. రెండుజీవకణములందలి జలముయొక్క పరస్పరాకర్షణము కారణముగా నవి రెండును కలిసిపోవుచున్నవి. ఇట్లే సమస్త జీవాణువుల కలయిక వలన సంపూర్ణ శరీరనిర్మాణ ప్రక్రియ కొనసాగుచుండును. సృష్టిలోని పదార్థముల వలననేసృష్టిలోని నిర్మాణాత్మక కార్యములన్నియు కొనసాగును. కాని యవి రసపదార్థములైనచో మాత్రమేసృష్టికొనసాగును. మనము నివసించునట్టి యీ జలసృష్టిలో జలమును గల్గియుండని పదార్థము లేదు మరియు జలము నంతర్గతముగా కల్గియున్న పదార్థము నిర్మాణాత్మక ప్రవృత్తిని కల్గియుండును.

రసము లేనిచో నర్థప్రవృత్తి కొనసాగదని ఖచ్చితముగా చెప్పిన భరతముని భావము విజ్ఞానప్రదమై శాశ్వతసత్యమై యున్నది. ఇంతటితో 'నహిరసాదృతే కశ్చిదర్థః ప్రవర్తతే' యను భరతముని సూత్రమునకు వివరణము ముగిసినది. దీనిచే సహృదయులు రస మౌలికా తత్త్వము నర్థము జేసికొనగలరు.

ఇపుడు రసశబ్దము కళాదృష్టితో పరిశీలింపబడుచున్నది. 'రలయోరభేదః' యను వ్యాకరణ సూత్రము వలన రసశబ్దము లస శబ్దముగా మారినపుడు రసలక్షణములైనట్టి యంటియుండుట మరియు నంటించుకొనుట, యాకర్షించుట మరియు నాకర్షింపబడుట యనునట్టి యర్థముల నిచ్చుచున్నది. రస లేక లస శబ్దోద్భవములగు రాసము లేక లాసము (లాస్యము) నృత్యవాచకములై యున్నను రసమనగా జలమను నర్థమును తెలుపునవిగా నున్నవి. రసమును శరీరమునందు ప్రదర్శించు కళ రాసము లేక లాస్యమనబడుచున్నది. ప్రాణులన్నియును ప్రతిదినము నవరసాత్మకమగు లాస్యమును తమ శరీరావయవములందు ప్రదర్శించుచుండును. అట్టి ప్రదర్శనల యొక్క రహస్యముల నెరిగినట్టి శాస్త్రకారులచేత జగదనుకరణము రూపమున రూపొందింపబడిన మండలాకార నృత్యము లాస్యమనబడుచున్నది. ప్రాకృతిక లాస్యముల నీ క్రింద తెలియజేయుచున్నాను.

గోళాకృతిలో నున్న విశ్వమునందలి యాకాశాంతరిక్ష భూలోకములనబడు నట్టి లోకత్రయమునందు తేజోవాయువుల చేత ప్రభావితమై యొక్కొక్క లోకమునందు మూడేసి చొప్పున మొత్తము తొమ్మిది విధములగు స్థాయీ భావములను బొంది జలము నవరస లాస్యమొనరించు చుండును. ఇది జగల్లాస్యము. ప్రాణుల దేహమునందలి రక్తము తేజోవాయువులచేత ప్రభావితమై దేహత్రయమునందలి యొక్కొక దేహమునందు త్రివిధ స్థాయీ భావముల చొప్పున మొత్తము తొమ్మిది విధములుగా మారుచు నవరస లాస్య మొనరించుచుండును. ఇది జీవన లాస్యము. త్రివృత్కరణ ప్రక్రియ ద్వారా మానవ దేహత్రయ మేక దేహముగా మారునట్టి విధానమును గూర్చి తెలియగలిగిన వారలు శరీరమునందలి యే దేహపు నే కేంద్రమున నే యంతఃకరణ ప్రవృత్తి వలన నే రస మెట్లు పుట్టి యెట్లు శాంతించుచుండునో తెలియగలుగుదురు. జలము నవత్వమును జెంది జగద్ప్రాణధారణము జేసి లాస్య మొనరించు చున్నదనెడు పరమరహస్యము నిచట తెలియజేసితిని.

రసప్రకృతికి వశుడై జీవుడు నిత్యజీవనమున నవరసాత్మకమగు లాస్య మొనర్చు చుండును. వాడు ప్రాకృతికమగు రస లాస్యమును పరికించి జ్ఞాని యగుటకు బదులుగా రస వ్యామోహమున జిక్కి యజ్ఞానియై తానును రసలాస్య మొనర్చు చుండును. అట్టి లాస్యమతని జడతను మరియు నజ్ఞానమును వానివలన కలుగు చిత్తచాంచల్యమును తెలియజేయు చుండును. భగవద్గీతలో 'లోకస్తదనువర్తతే' యని చెప్పబడినట్లుగా పెద్దలు చేయునట్టి జీవనలాస్యమును బాలకులు మరియు నట్టి యజ్ఞానులేయగు నున్మత్తులు (యువకులు) యనుసరించు చుండెదరు. జ్ఞానులనబడు కవి పండితులు గూడ రసలుబ్ధులై దానినే కావ్యాత్మ యనుచు, బ్రహ్మానంద సబ్రహ్మచారి యనుచు, నుపనిషద్వాక్యములకు విపరీతార్థములను కల్పించుకొని తమ యజ్ఞానమును సమర్థించుకొనుచు సంభ్రమాశ్చర్యములలో మునిగిపోవుచుండుటవలన రస ప్రకృతిలో నెంతటి సమ్మోహన శక్తి కలదో తెలియవచ్చుచున్నది. చతుర్విధాంతఃకరణములను కలిగియున్నట్టి మానవుని యొక్క చతుర్విధ రసానుభూతులను గూర్చి రసానుభూతి ప్రకరణమునందు తెలియజేయుదును.

కావ్యమువలన రసానందము లభింపదనుటకు ప్రబలకారణమిపుడు తెలుపబడుచున్నది. శబ్దమును మనము లోకమునందలి చరాచర వ్యక్తావ్యక్త పదార్థ ప్రాణులకు సంబంధించిన సమస్త విజ్ఞానమును బొందుటకై విద్యగా నభ్యసించు చున్నాము. విజ్ఞానము నిచ్చుటయనునదొకటి మాత్రమే శబ్దము లేక కవిత్వము యొక్క యేకైక ప్రయోజనము. మమ్మటాదుల చెప్పిన తదితర ప్రయోజనములగు యశస్సును పొందుట, ధనమును సంపాదించుట, లోకవ్యవహార కుశలుడగుట, యానందమును పొందుట యనునవి యొకడు కావ్యమును చదువగా పొందెడు జ్ఞానముపై నాధారపడి యున్నవి. యజ్ఞానియగువాడు మమ్మటుడు చెప్పిన కావ్య ప్రయోజనములందు దేనిని కూడ పొందజాలడు గావున జ్ఞానమును ప్రసాదించుట యనునదొక్కటియే కావ్యము యొక్క యేకైక ప్రయోజనమని యంగీకరింప వలసియున్నది. కావ్య శ్రోతకు జ్ఞానము తొలుత లభించగా తదుపరి యట్టి జ్ఞానము వలన నానందము లభించుచుండును.

'శ్రోత్రియస్య చాకామ హతస్య' యనుచు తైత్తిరీయోపనిషత్తు తెలిపినట్లుగా రసము ననుభవింప వలెననెడు కోరికచేత కొట్టుపడనట్టి కావ్యశ్రోతకు జ్ఞానానందము లభించును. రసప్రకృతి యొక్క విజ్ఞానమును పొందిన జ్ఞాని యగు శ్రోత యానందింపగా రసానుభూతికి వశుడై యజ్ఞానమువలన రసమునే నెమరువేయు చుండు శ్రోత దుఃఖమునో లేక దుఃఖాత్మకమగు సుఖమునో పొందుచుండును. కావ్యము జ్ఞానమును కాంతాసమ్మితముగా నుపదేశించుచుండగా కోటికొక్క శ్రోత మాత్రము యట్టిజ్ఞానమును బొంది యానందింప నర్హుడగుచుండును. ఛందోక్షరార్థపదంబుల యొక్క జ్ఞానమును బొంది కవిత్వమును వ్రాయు కవికూడ కోటి

కొకడుండవచ్చును. ఛందోశరార్థపదంబు లందేయొక్కటి లోపించి నను భ్రష్టమైనను భాష కావ్యరూపము నొందజాలదని తెలిసిన వారు చెప్పుచుండినను విన్పించుకొనక భాషనే కవిత్వముగా భావించి భ్రమించు నజ్ఞాన కవులు లక్షల సంఖ్యలో నుండవచ్చును.

రసతత్త్వమును బ్రహ్మతత్త్వమని భ్రమింప కుండుటకై తైత్తిరీయోపనిషత్తు మొదటనే 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ'యని స్పష్టముగా బ్రహ్మ లక్షణములను తెలిపినది. రసలక్షణములకీ బ్రహ్మ లక్షణములతో సమన్వయము కుదురకపోవుట వలన నది బ్రహ్మతత్త్వముగాని యానందతత్త్వముగాని కాజాలదని స్పష్టముగా తెలియుచున్నది. తైత్తిరీయమున చెప్పబడినట్టి యేకాదశానందము లలో రసానందము పేరు లేదు కావున నది రసానందము నంగీక రించుటలేదని తెలియుచున్నది. ఒక పదార్థమును తినుచు, తాను తినుచున్న పదార్థము చేతనే తినబడుచు, ననగా తాను నశించుచు నన్యపదార్థములను నశింప జేయుచుండునట్టి రసతత్త్వమును పర బ్రహ్మతత్త్వముగా భావించుట భ్రాంతి దర్శనమే గాని సత్య దర్శనము కాజాలదు.

మనము రసమౌలిక తత్త్వ వివేచనము చేయుచున్నాము గావున నిపుడు రసమునకు సంబంధించిన యమూల్య విషయములు తెలుపబడుచున్నవి. రసప్రకృతి వీరరసముతో ప్రారంభమై బీభత్స రసముతో నంతమొందుచున్నది. జీవుడుత్సాహముతో రసప్రకృ తికి వశుడై జన్మించి జుగుప్సను కల్గించునట్టి శవరూపముతో నంత మొందుచుండును. విశ్వమునం దుత్సాహముతోడ సంచరించుచు విశ్వరచన చేసినట్టి జలము ప్రళయకాలమునందు జుగుప్సాకర మగు సముద్ర రూపమును ధరించుచుండును. రసప్రకృతికి బద్ధు లగు జీవులు జనన మరణము లొందుచు చివరకు జలప్రళయము నందు జలమునం దణగియుండి తిరిగి జలసృష్టికాల మున 'యద్భావం తద్భవతి' యనునట్లు తమ తమ భావానుకూల మగు రూపము లను ధరించి జన్మించుచుండు నను పురాణవాక్యముల నిచట మాము మననము చేయవలయును. తైత్తిరీయోపనిషత్తు నందలి జలసృష్టి ప్రళయానంతరము కొనసాగునట్టి పునఃసృష్టిని గూర్చి నట్టిదని మరొక మారు మనవి చేయుచున్నాను.

ఇపుడు రసమున కథఃపతన మొందు స్వభావము కలదని నోదాహరణముగా తెలియజేయుచున్నాను. మనము జలమును క్రింది వైపునకే ప్రవహించు చుండుటను చూచుచునే యున్నాము. వృక్షమూలోదాహరణము వలన రసస్వభావమను చక్కగా నర్థము కాగలదు. భూమిలో నాటబడిన సత్త్వగుణోపేతమగు బీజమును చీలు కొని దాని యందలి రజోగుణోపేతములగు పత్రములు, తేజస్తత్త్వము కలవియై తేజమును కలిగియున్న యాకాశముపైపున కూర్ధ్వముగా సాగుచు తేజమును మాత్రము గ్రహించుచు వృద్ధి చెందుచుండగా దానియందలి తమోగుణోపేతములగు వేరులు జలతత్త్వ ప్రధానములై జలమును గల్గియున్న భూమిలోనికి నధో ముఖముగా పోవుచు జలమును మాత్రము గ్రహించుచు వృద్ధిని చెందు చుండును. ఈ యుదాహరణము వలన రస ప్రకృతికి బద్ధు లగువారు కూడ నధఃపతన మొందెదరని తెలియుచున్నది. మానవుని సూక్ష్మ శరీరము తేజమును కల్గియుండి విజ్ఞానము నార్జింప యత్నించు చుండగా కారణ శరీరము జలమును కల్గియుండి యజ్ఞాన క్రియలందు ప్రవర్తింప జేయుచు మానవుని యధఃపతితు నొనర్చు చుండును. రస మధోముఖముగా సాగునదియు, నజ్ఞానమును సమ కూర్చునదియు సారాంశము.

వృక్షమూలము భూమినుండి, మానవదేహ మన్నజలముల నుండి జలమును గ్రహించి తమ మనుగడను సాగించునట్లు విశ్వము కూడ విశ్వవలయమున కవ్వలనున్నట్టి జలమును గ్రహించు చుండును. విశ్వమునకు జల భూయుక్తమగునట్టి భూలోకము కారణ దేహము, సప్త గ్రహ నక్షత్రాదులతో గూడి యున్నట్టి యాకాశము సూక్ష్మ శరీరము మరియు వాయువుచేత నిండియున్న యంతరిక్షము స్థూలదేహములై యున్నవి. విశ్వ గోళము నంటి యావరించియున్న హిమవలయము విశ్వజీవనము నకై జల వితరణము జేయుచు వైతరణి యనబడినది. ఇర్వది యేడు నక్షత్రములనబడిన జలరాశులు వైతరణి యందలి జలము నాకర్షించుకొని చంద్రునకు సమర్పించుచుండును. ఈ నక్షత్రములే సంసార వృక్షమునకు గల వేరులని 'ఊర్ధ్వమూల మధశ్శాఖం- భగవద్గీత) చెప్పబడినవి. భర్త కన్నము వండి పెట్టుట భార్య ధర్మము గావున విశ్వము యొక్క జీవనము నిలుపుట కన్నమైనట్టి జల మును చంద్రునకు సమర్పించు చుక్కలు (నీటిచుక్కలు) పురా ణము లందు చంద్రుని భార్యలుగా నభివర్ణింప బడినవి. జలము వలన నేర్పడిన సృష్టియంతయు నశింపక ప్రవృత్తి రూపమున నిలువ గలుగుటకు కారణమగునట్టి వర్షజల మమృత మనబడినది. అట్టి యమృతమును చంద్రుడు తన విద్యుత్కరములందు ధరించుట వలన నతడమృతకరుడని పిలువబడెను. ఇచట విశ్వము తన మనుగడకై జలగ్రహణము చేయు విధానము తెలుపబడినది. ఈ యుదాహృతి వలన విశ్వమున కూర్ధ్వమునందు గల జలము కూడ యధఃపతన మొందుచున్నదని తెలియుచున్నది. పురాణములందు చెప్పబడిన యిట్టి మహత్తర వైజ్ఞానిక విశేషములను గూర్చి నేటి భౌతిక శాస్త్ర పరిశోధకులీ శతాబ్దము నందు రూఢిగా తెలియగల్గు టకు ప్రయత్నించు చున్నారు.

ఇపుడు వస్తువులందలి జలము నల్లని ఛాయను కలిగి యుండి దానిని తదితర వస్తువులపై పడవేయుచుండుటను తెలుపు చున్నాను. వెలుతురులో ప్రకాశించునది మానవుని సూక్ష్మశరీరాంతర్గత తేజము కాగా భూమిపై చల్లని నల్లని నీడగా పడునట్టిది వాని కారణశరీరాంతర్గతమగు జలమగుచున్నది. పైకి నెగురప్రయత్నించు స్వభావముగల మానవుని సూక్ష్మ శరీరమునందలి తేజమును గాని క్రింద పడిపోవనున్న కారణశరీరమునందలి జలమును గాని వాని స్థూలశరీరము నందలి వాయువు తనశక్తిచే ధారణముచేసి నిలుపుచుండును. కావున మానవుని శరీరము నాశనముగాక పోషింపబడుచుండుటకు వాని స్థూల శరీరము కారణమగుచున్నది. సూక్ష్మ కారణశరీరములను తనయందిముడ్చుకొని కాపాడునట్టి సత్త్వముగల స్థూల శరీరమును సాత్త్విక శరీరమనియు పేర్కొనవచ్చును. ప్రాణులను సత్త్వములనుటకవి సాత్త్వికదేహమును కల్గియుండుట కారణమగుచున్నది. ఇట్టి దేహ వికారములు సాత్త్విక భావము లనబడినవి.

ఒక రసస్వరూపము వేరొక రసస్వరూపమునందు ఛాయారూపమున ప్రతిబింబితమగు ననునదొక రససూత్రము. దీని వలన నొక వస్తువుపై వెలుతురు ప్రసరింపగా నది తన ఛాయను తదన్య వస్తువులపై ప్రతిబింబింపజేయునని తెలియుచున్నది. ఈ విషయము పైన వివరింపబడినది. ఈ రససూత్ర సహాయమున వేదవిద్య లందొకటియగు ఛాయా పురుషవిద్య రూపొందినది. నేటి భౌతిక శాస్త్రవేత్తలు ఛాయాగ్రాహక యంత్రాదుల నిర్మాణములకీ సూత్రమును వినియోగించుకొని యున్నారు. కావ్యశాస్త్రము నందలి సాధారణీకరణ సిద్ధాంత మీ సూత్రముపై నాధారపడి యుండుట వలన దీనిగూర్చి యిచట తెలుపవలసి వచ్చినది.



# ఎదురు చూపు

## శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

ఈ శరీరావధులు దాటి యింటికప్పు
పైకెగసి, గాలి కౌగిలి నాకళించి,
మిన్నొరసి, చుక్కలను లోన మేళవించి -
బృహదహంతనై దేనికై ఎదురు చూతు ?

లేవు మంచి చెడ్డలు, పురాస్కృతులు లేవు
కాంతి మయమొక సంలీన శాంతి మిగులు,
సృష్టి దృశ్యమానము పల్కరించు గాని -
బృహదహంతనై దేనికై ఎదురు చూతు ?

మృత్యువననేమి ? దానినెట్లెరుగ గలను ?
ఇంద్రియ నిహిత జ్యోతి కొండెక్కెనేని
ప్రకృతి రూప మదృశ్యమై, పరగుతమము -
బృహదహంతనై దేనికై ఎదురు చూతు ?

గ్రహములకునేగు రోదసీగామి కూడ
భూమి పరిధి నధిగమించి పోవు వేళ
చిక్కని తమము నే చూచు దిక్కులెల్ల -
బృహదహంతనై దేనికై ఎదురు చూతు ?

"ఎదురు చూచుట" కాలమహిమకు లొంగి
మాయ వాగుర జిక్కిన మనసటన్న,
ఎదురు చూడక, క్షణము స్తంభించి పోయి -
బృహదహంతనై కాలాంతమేమి చేతు ?

అదియె మృత్యువో, మోక్షమో అనగనెట్లు ?
నాకు నేనున్న ఆ స్థితి లేక ఎట్లు ?
దాని నద్వైత మందురా తత్త్వవిదులు ?
బృహదహంత కద్వైత మేరీతి కలుగు ?

"నేతి నేతి నేతి" యనుచు నిష్క్రమించి
నన్ను నేను మరచి పోయి కన్నుమూసి,
పువ్వునై రేకు రేకున పులకరించి,
ఎరిగి ననుదాల్చు వనమాలి కెదురు చూతు !



శ్రీ కావూరి పాపయ్య శాస్త్రి

# శ్రీమద్రామాయణ కల్పవృక్షము బాలకాండము-కవితారామణీయకత

"అచ్ఛమైన యమృత మమరులు త్రావినా
రోయి ! దానికే నసూయపడను" — అంటూ

"పరమ మౌనియైన వాల్మీకి కృత రామ
సత్కథా సుధారసంబుఁ ద్రావి"— ....

విశ్వనాథ సత్యనారాయణగారు తెలుగున శ్రీమద్రామాయణ కల్పవృక్ష మనుపేర రామకథను రచించిరి. ఎందరు వ్రాయలేదు రామకథను? ఎన్ని రీతుల వ్రాయలేదు? వ్రాసిన ప్రతి ఒక్కరూ ఏదో ఒక సమాధానం చెప్పుకొని ముందుకు సాగిపోయారు. సత్యనారాయణగారూ అట్టి ప్రశ్నలు తనకు తానే వేసుకొని....

"మరల నిదేల రామాయణం బన్నచో
... .... ... ...
. .... .... ....
నా భక్తి రచనలు నావి గాన" . అని అంటూ

"ప్రాగ్వి పశ్చిన్మతంబుల రసము వేయి
రెట్లు గొప్పది నవకథాదృతిని మించి"-అని మన సందేహ

మును నివృత్తి చేసిరి. కథ పాతదైన నేమి? అది చెప్పెడు రీతిలో నవ్యత గల్గి రసవంతమై యొప్పినపుడు సహృదయాహ్లాద కారి కాగలదు. కావున మరోసారి మన తెలుగు భాషలో రామాయణ సుధాస్రవంతి ప్రవహించినది. కావ్య నామకరణమునందు గూడ విశ్వనాథ నవ్యత ప్రదర్శించినాడు. ఇది "శ్రీమద్రామాయణ కల్పవృక్షము". గుత్తులు గుత్తులుగా కాచిన అమృత తుల్యమై, మదురరసభరితములైన పండ్లతో నిండినదీ వృక్షము. యోపినకొలది భుజించి రసానంద మనుభవింపుడని పేరుతోనే చెప్పినట్లున్నది. ఇట్టి ఫలములలో బాలకాండము నందలి పండ్ల రుచిచూతము.

దశరథుడు ధరణిని న్యాయమార్గంలో పాలించాడు. షష్టి సహస్ర వర్షాలు నిండినవి. పరమ సుఖాన్ని అనుభవించాడు. ధర్మ గృహీత కామినీ సుఖాలు. శత్రునిబర్హణ క్రియా పరమ సుఖాలూ అన్నీ అనుభవించినా అతృప్తి, ఆవేదన, అటు రాణులకు - ఇటు తనకు. సతులు కంట బడితేచాలు రాజు నిట్టూర్చేవాడు. వేదన నిండిన వారి మోములు చూడగనే రాజు గుండెలో చెయ్యి పెట్టి కెలికినట్లయ్యేడిది. రాణుల మోముల నీలినీడలు ప్రస్తావిస్తూ ..

"సితతర కాంత్యుషః ప్రభల చేరువ జీరగనల్ల చిర్మొగల్
గతి, వికసత్సితాంబుజ ముఖంబున శైవల వల్లి పోలికన్"

వారి మనోవేదనను ప్రస్తావిస్తూనే మరొకవైపు రాణుల మోములు ఉషఃకాంతులవలె; వికసత్సితాంజాల వలె ఉన్నవంటూ వారి ముఖసౌందర్యం చెప్పకుండా చెప్పబడినది.

తమ రాజుగారు ఏదో చెప్పరాని బాధతో కుమిలిపోతున్నారు. దాని నివారణోపాయం తనుగొనవలసిందిగా మంత్రులంతా సుమంత్రుణ్ణి నియమించారు. సుమంత్రునికి తన వ్యధను వ్యక్తం చేశాడు దశరథుడు. "అరెరే! దీనికింత దైన్యమా! సూర్యకులధామము వెల్తురులేక మ్రగ్గునా!" అని ఓదార్చి—

"పుత్రమిని ధర్మపుం గొఱత పుట్టని యన్ని దినాలు మీదు వం
గడమునఁ జేటులేదు-మొలకల్ గలుగున్ బెనువృక్షరాజి య
య్యెడు ఘన శాఖికాంచద్గృహీత దిశాంతములై ద్విజాళి గూ
ళ్ళను కొని గొంతులెత్తి వెలయించు నుషో మధురార్ద్రగీతికల్"

రాఘవుల వంశవృక్షం విశ్వవ్యాప్త మవుతుంది.

రామకథ - యావత్స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే
తావద్రామాయణ కథా లోకేషు ప్రచలిష్యతి.

ఆ రామాయణ మహీరుహంపై కవి కోకిలలు కూర్చుని మధురంగా గానం చేస్తాయి. అనాడు ఆ కోకిల వాల్మీకి. ఈనాడు ఆ కోకిల విశ్వనాథ.

కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్ ।
ఆరుహ్య కవితా శాఖామ్ వందే వాల్మీకి కోకిలమ్॥

పై పద్యంలో ఇంతటి భావమరందతుందిలము గావించినాడు విశ్వనాథ. త్రవ్వినకొద్దీ తరగని సంపద. త్రాగినకొద్దీ తరగని రస ధార.

... ... ... ...

"అశ్వమేధం చేస్తే సంతు కలుగుతుంది. నా మంత్ర ప్రభావంతో నారాయణుని పిలిపించి హవిసులందింప జేయిస్తాను. ఆ పయి నీ అదృష్టాన్ని బట్టి సంతు కలుగుతుంది" అని వశిష్ఠులు చెప్పగనే రాజు ముఖం వెలిగిపోయింది.

"రాచిన వెల్గుపోర్విభుమురాజు కడన్ బతి చిన్న దివ్వె యా
చూచినవారు చూచిరిడిజోతుల ఎక్కువ తక్కువల్ సరిన్"

దశరధుడానందం పట్టలేక మునీంద్రుణ్ణి కౌగిలించుకున్నాడు. ఆనంద బాష్పాలు పొంగి వచ్చినవి. అవి.

"మునిపతి జనపతి గడ్డము
లను బడి ప్రమదాశ్రుతతి తళాతళ మెఱసెన్"

ఆ తర్వాత అశ్వమేధానికి అన్ని ఏర్పాట్లు జరుగసాగినవి.

... ... ... ...

అంగ దేశంలో కనీ విని యెఱుగని కరువొచ్చింది. ప్రజలంతా మల మల మాడిపోతున్నారు. మనుషులకు తిండిలేదు. గొడ్లకు మేత లేదు. ప్రజల కడగండ్లు చూచి రాజుకు దుఃఖ మాగలేదు —

"అయ్యో ఇదేమిటి"—

ఒకచోట గుఱుపు ఎండిం
కొకచోట నన్నట్లు పాప మూర్వీతలిదిన్
వికృతపుఁ బాపులు ప్రజలవి
యకటా! —

అని విలపిస్తాడు. నాలో ఏదైనా పాపం ఉంటే దానికి ఫలితం నే ననుభవించాలి గాని, నా ప్రజ లమాయకులే వారికెందుకీ బాధలు! - అన్న రాజు ఆవేదనలో బాధ్యత గల పాలకుని యొక్క ధార్మికత తొంగిచూస్తుంది. నేటి పాలకులకు ఒక ఆదర్శాన్ని చూపిస్తుంది.

... ... ... ...

ఆషాఢమేఘం వంటి ఋశ్యశృంగుణ్ణి తీసుకొని రావడానికి వారకాంత లేగారు. తండ్రిని తప్ప అన్యుల నెరుగని ఆ అమాయక ముని గుట్టు ఎట్టుగా బుట్టుగా ఉన్న ఆ వారవనితల గాంచి ...

మీ శిరస్సుల జడల్ మేలుగా నునుపుగా
నట్టెముప్పేటగాఁ బుట్టె నొక్కొ
మీసలు గడ్డముల్ మీ ముఖ చిబుకగ
ల్లముల మెలగనే మెలంగ వొక్కొ
నాకు మొగాన నున్నది యొక్క కొమ్ము తొ
మ్ముల మీకు జంటలై పుట్టె నొక్కొ
యెపుడు సర్వాంగాసనపు నిష్ఠచేతనే
పిఱుదలు మీకింత పెటిగె నొక్కొ

అంటూ విచిత్రంగా చూస్తూ వాళ్ళచుట్టూ తిరిగి పరిశీలిస్తూ అంతటితో ఆగక

"....వారల జడలంటు నాననముల
తడుము నురముల తాకు ముట్టెడును బిఱుదు
లట్లు సేసియు నచ్చోటి కసమ శరుడు
తొంగిచూడడు ముని ఋశ్యశృంగు వంక"

ఈ పద్యంలో ఋశ్యశృంగుని నైర్మల్యము; అమాయకతలకు అద్దం పట్టాడు విశ్వనాథ.

... ... ... ...

సుమంతుడి ద్వారా ఋశ్యశృంగుని గాధ విని అప్పుడే తను యజ్ఞం చేసినట్లుగా పుత్రోదయం అయినట్లుగా సంబరపడి పోతాడు దశరథుడు. అప్పుడాయనకు చంద్రుడిలా కనుపించాడు.

"ఒనర బోర్కాడించి యుయ్యేల తొట్టిలోఁ
బండబెట్టిన పసిపాప వోలె
సీదుఱంబడి తిర్గి బూదియ మైజల్లు
కొని పర్వుబెట్టు కుఱ్ఱ వోలె.
నన్నమ్ముఁ దించు మోమంతయు బెరుగన్న
మును జేసికొన్నట్టి బొట్టె వోలె
జిటి! తలంటి పోసెద నన్న నందక
తొలగి పర్వులు బెట్టు నులిపి వోలె.
వెల్ల దుస్తులు కట్టించి వీధులన్ షి
కారు పంపిన రాజకుమారు వోలె
మింట నడుచక్కి బిల్లి మేదినీశు
నేత్రములకుఁ జ వ పండించి పోసె."

చక్కని సమయోచిత ఉపమానాలతో సాగిన ఈ పద్యంలో ఒకప్రక్క చంద్రుణ్ణి మరొకప్రక్క దశరధుని ఆలోచనా రీతిని హృద్యంగా చూపించారు కవి. క్రమంగా పెరుగుతున్న రాజ కుమారునిలా ఉన్నాడు చంద్రుడు. దశరధుని పుట్టబోయే పుత్రుని వలెనా! మనం ఆలోచించే తీరునుబట్టే మనచుట్టూఉన్న వస్తువులు కనబడతాయని మన తత్త్వ శాస్త్రజ్ఞుల కధనం.

అశ్వమేధాన్ని చేయించుట కొఱకు ఋశ్యశృంగుని అయోధ్యకు కొని వచ్చారు. అది వసంత ఋతువు. చివురాకుల నిగనిగలతో తుమ్మెద రొదలతో ప్రకృతి శోభాయమానంగా ఉన్నది. దాన్ని విశ్వనాథ చిత్రించిన తీరు యిలా ఉంది.

ప్రతి రసాల కుజంబు పచ్చి పిందెల తోడ
నెల మసలిన కాంత వలెనె తోఁచె

ప్రతి నిస్వన ద్భృంభరము యజ్ఞదక్షిణ
కై యేగు బ్రాహ్మణునట్లె తోచె.

కథలోని ఘట్టాని కనుగుణంగా వాతావరణమును వర్ణించుట ఒక ప్రత్యేకత. విశ్వనాథలోని ఈ ప్రజ్ఞకు ఈ పద్యం చక్కని ఉదాహరణ. రేపటి యజ్ఞము; రాణుల గర్భధారణ ఇత్యాదులన్నీ ఈ పద్యంలోని ఉపమాన ఉపమేయాలలో ముందుగా సూచింప బడినవి. వేద పండితుడు దారిన కాలినడకన సాగిపోతున్నపుడు ఏదో ఒక "పనస" వల్లెవేయడం ప్రాచీన బ్రాహ్మణ సమాజంలోని ఆచారం. ఇప్పుడివన్నీ నేతిబీరకాయలు.

... ... .. ...

క్రతుయత్నము లారంభ మయినవి, రాజాజ్ఞచే చకచకా పనులు చేయిస్తున్నారు. ఎలా ...

మంత్రులెల్ల తమ నియంత్రితములు
కార్యములను సేయగడగిరి. మధువేళఁ
దేనె కొఱకు తిరుగు తేటులట్లు.

తేనెటీగలు తేనె సేకరిస్తాయి పరుల కొఱకు. అట్లే దశరథుని మంత్రులు - నిస్వార్థమతులు, సేవా పరతంత్రులు.

... ... ... ..

యజ్ఞ సందర్శనార్థం ఎక్కడెక్కడి నుండో వస్తున్నారు జనం అయోధ్యకు. వచ్చిన వారు తెలిసిన వారిండ్లకు పోతున్నారు. తెలియని వారు ఎలాగో పరిచయం చేసుకొని ఎలాగో నాలుగు రోజులుండి పోతామని కోరుతున్నారు. ఆ పురమందలి ప్రతి గృహస్థుడూ తన యింట్లో శుభకార్యానికి వస్తే ఆహ్వానించినట్లు అందరినీ ఆదరిస్తున్నారు.

చని యెంత ప్రొద్దు వేళను తల్పు దట్టిన
జిటుకలో వచ్చి తీసెదరు తలుపు
మంచి తీర్థమ్మును కొంచె మిత్తురె యన్నఁ
దియ్యని మజ్జిగఁ దెచ్చి యిత్తు.
రరుగుల నిదురింతు మన్నచో దాము ని
ద్రించు మంచముఁ బ్రక్క తెచ్చి యిత్తు
రప్పు! పిల్లకు వేళతప్పు భోజనమున
కన వండి పెట్టుదు రప్పుడపుడె.

ఇదీ వారి మర్యాద, మన్నన, నాటి ప్రజల ధర్మజీవనం. కనురెప్ప పాటులో కనపడిన ప్రతివాణ్ణీ మోసగించి మాయ, అవినీతి, అక్రమాలకు అలవాటుపడ్డ నేటి సమాజానికీ, ధర్మనిరతికీ, దాతృత్వానికీ, ప్రతిరూపులైనా నాటి ప్రజలకూ వార ఎంతటిదో పై పద్యంలో చూపబడింది. అయ్యో! మనం యింతపాపిష్టి బ్రతుకులు బ్రతుకుతున్నామే అన్న ఆవేదన తొంగిచూస్తుంది.

... ... ... ...

దశరథుడు ప్రాజాపాత్య పూరుషుడిచ్చిన పాయసపాత్ర చేబూని ముప్పిరిగొన్న సంతోషంతో అంతఃపురానికి పోతున్నాడు. చెరువు నిండా తామరలు వికసించి ఉన్నవి. ఈతగాడు చెరువు నీదుచున్నాడు. అడ్డుపడే తామర పూలను రెండు చేతులతో మెల్లగా సుకుమారంగా ప్రక్కకు తొలగిస్తూ ముందుకు పోతున్నాడు. అంతఃపురంలోకి వెళ్ళే దశరథుడి స్థితీ అదే. నవ్వు మొగాలతో ఎదురయ్యే వారందరినీ, చెరువు నీదే ఈతగాడిలా తప్పుకు పోతున్నాడు. యజ్ఞం విజయవంతంగా ముగిసింది. ఆ సంతోషం అయోధ్యనిండా నిండిపోయింది. రాజ ప్రాసాదం, అంతఃపురం అంతా ఆనంద సరసిలా వుంది. అందు విరిసిన తామరలు ప్రీతి వారి మోములు. తమ రాజుగారి మనోరథం నెరవేరబోతున్నందుకు అందరి మోములూ పువ్వుల వలె నవ్వుతున్నవి. అనన్య సామాన్య కల్పన. అనల్ప భావనా పటిమ.

చెఱువులోఁ బూలు చేతుల జిమ్ము కొంచు
గడకు జేరంగా జను నీతగాడు వోలె
నెదురయిన నవ్వు మొగముల యిఱకటమున
రాజు నీదుచు నంతి పురంబు జేరె.

... ... ... ...

రాణులకు నెలలు నిండినవి. ప్రసవించే రోజులు దగ్గరకు వచ్చినవి. శాంతా ఋశ్యశృంగులు వచ్చారు. వచ్చిన వారిరువురకు అరుంధతీ వశిష్ఠులు ఎదురేగినారు. ఎట్లు—

ఇఱు తబిసి జంట యెదురెదిరేగినారు
రెండు మన్వంతరము లెదురేగినట్లు.

... ... ... ...

కౌసల్యకు కొడుకు పుట్టాడు. మంత్రసాని బొడ్డు కోసింది. ఎవ్వరా శిశువు? మహావిష్ణువు. ఆయన నాభికమలము నుండియేగదా బ్రహ్మ జనించినది! బొడ్డు కోయగనే బ్రహ్మ విలవిలలాడి పోయాడు.

"తోరము కట్టిన కత్తిని
గోరడమున మంత్రసాని కోసెను బొడ్డున్
నీరజము కాడ జిరిమిన
నేరమిని గలుక్కుమనె మనీషన్ విధియున్."

కౌసల్యకు పురుడు రాగానే బైట వర్షపుజల్లులు పడినవి. అవి వర్షపు జల్లులా! కావు. కావు. పైనుండి తిలకించే దేవతల కిరీటాల లోని వైడూర్యముల కాంతులు. లేక వారి కనుల నుండి రాలిపడే ఆనంద బాష్పాలు. లేదా రాక్షస కాంతల దుఃఖ బాష్పాలు.

"వర్షస్వాంబువులో; దేవతామకుట రాడ్వైడూర్య రత్నాంశులో
హర్షస్వాంత సురాళి బాష్ప తతియో? యానంద లేశంబులో
యార్షశ్రీనత దీపవర్తి విగళత్ ప్రారంభ దైత్యాంశలో
ధర్షణ్యాశర కామినీ నయన చింతా బాష్ప సంతానమో!"

... ... ... ...

కౌసల్యా తనయుణ్ణి ఎవరెలా చూస్తున్నారో చిత్తగించండి.

జననాయకుడు కౌసల్యా సుతుంగాంచు
ప్రాణంబులన్నియు బహిరవెట్టి
కాంతా పురంధ్రి కౌసల్యా సుతుంజూచు
ప్రాణమ్ములను లోన భద్రపరచి.
సత్తపోనిధులు కౌసల్యా సుతుంగాంతు
ప్రాణమ్ములో బిడ్డ పాళ్ళవెట్టి
కౌసల్యాతనయుని గాంచు ప్రేముకొలది
ప్రాణమ్ములను బిడ్డలోన బెట్టి.

ప్రతివారూ తమతమ ఆత్మజ్ఞానానికి తగినట్లుగా చూస్తున్నారు ఆ వేదమూర్తిని.

. ... ... ...

పదునొకండవ నాడు ముగ్గురు రాణులు పురిటిస్నానాలు చేసారు. బాలెంతలు గదా! తాంబూలాలు వేసుకున్నారు. రంజితాధర తాంబూల రక్తిమము చిఱునగవు తెల్లదనంలో చిటిపోతుంటే శిశువులను ఒళ్ళో పెట్టుకొని కూచున్నారు. దశరథుడు వారివైపే చూస్తున్నాడు. శిశువులనా! రాణులనా!

"స్నానమాడెన బాలెంత చక్కదనము
పరిణయము నాటి అందమ్ము పాదరింప
రాజు శిశువులగాంచునో రాణుల ముఖ,
దేహ కాంతుల గాంచునో తెలియలేదు"

... ... ... ...

రాముడు తప్పటడుగులు వేస్తున్నాడు. తల్లి ఒడిలో కూర్చున్నట్లే కూర్చుంటాడు. మళ్ళీ ఎటో పోతుంటాడు. అంతలోనే మళ్ళీ వచ్చి తల్లి ఒడిలో దూరతాడు. ఇది ఆ అబ్బాయి కొక ఆట.

"తల్లిని వీడి, అప్పుడప్పుడే ఱెక్కలు వస్తున్నబాల హంస ఎగిరిపోవలని యత్నించినట్లు"——

"తల్లియేనుగును వదలి ఒంటిగా అటూ ఇటూ పోవుటకు యత్నించు పిల్లఏనుగు వలె"——

"వేట నేర్పే తల్లి బాటనుండి తొలగి, చెంగున దూక యత్నించే సింగపు కొదమ వలె"——

వీటన్నిటి కన్న ఉదాత్తమైన ఉపమానం——

"పుష్కలా వర్తకంబుల దెగించికొని మెట్ట
పొలము లేగెడు చిన్న మొగిలువోలె"

అవును. దైత్యుల దౌర్జన్యకాండల మండు టెండలకు ఎండి మోడులైన ఆర్ష ధర్మలతికలపై ఆ చిన్న మొయిలు కురియ వలె. మరల వైదిక ధర్మ వృక్షవాటికి వసంతకాలము సంప్రాప్తము కావలె. నీలమేఘశ్యాముడగు రాముడా కార్యము నిర్వర్తింపవలె.

... ... ... ...

నలుగురు పిల్లలకు ఉపనయనం చేశారు. రాముడు తల్లిని భిక్షనడుగుతున్నాడు. ఇది ఉపనయన కర్మలో ఒక భాగం. కౌసల్యకు పాదాభి వందనం చేసి.

"ముదితుండై 'భిక్షాం భవ
తి దేహి' యని తల్లినడిగె దేవుడు రాముండు"...

సర్వ శక్తివంతుడు, సకల సంపదల నొసగే లక్ష్మీనాథుడు భిక్ష నడిగితే "ఏమివ్వగలదా తల్లి?" అందుకే "త్వం చ మమ దేహి" అని ముద్దాడింది పుత్రుణ్ణి.

... ... ... ...

కోదండములను బెండ్లవలె విరచుట బాల్యము నుండియు రామునకు వెన్నతో పెట్టిన విద్యయేమో! ఎవరైనా వీరులు తండ్రి కడకు వస్తే సరి. భుజాల వ్రేలాడు ధనువులను తీసుకొని రాముడు ఎక్కుపెట్టును. అవి ఫెళ్ళున విరుగును. రాముణ్ణి శివ ధనుర్భంగానికి చిన్ననాటినుండియే తయారు చేస్తున్నాడు విశ్వనాథ తన కల్పవృక్షంలో.

" . . .... . . రాముడు వారల చేతి విల్లులం
గొని, చిఱునవ్వులకు ధనస్సు కొప్పులుగూర్పగ నల్లె త్రిప్పవం
చిన నెల ఫెళ్ళు మంచన ... . "

అన్న సంగతి యిట్లుండ తమ్ముడు లక్ష్మణుడూ అంతే — ఎవరైనా స్త్రీలు ముద్దొస్తున్నాడుగదా అని ఎత్తుకుంటే ముక్కులు చెవులు తడిమి చూసేవాడు.

"లక్ష్మణుడు ముక్కులును చెవుల్ తడిమి చూచు
నెవ్వరే నంగనలు దన్ను నెత్తుకొనిన".

మహారాజు గారితో మాట్లాడి పోవుటకు వచ్చిన పెద్ద మనుషులు ఆ పరిసరాలలో ఆడుకొనే రాముణ్ణి ఎత్తుకొనేవారు. వెంటనే ఆ అబ్బాయి వారిభుజాలు, తల తడిమి చూసేవాడు.

"రామచంద్రుండు సర్వ మూర్ధంబు, చేతు
లొత్తి చూచును పూరుష లెత్తుకొనిన".

ఇలా చిన్ననాటి నుండే వారిరువురకు భావి కార్యక్రమ నిర్వహణకు శిక్షణ నిప్పిస్తున్నారు విశ్వనాథ.

... ... ... ...

### అహల్యా ఖండము

ఒకనాడు అనుకోకుండా విశ్వామిత్ర మహర్షి వస్తాడు దశరథుల యిండ్లకు. ఆయన వస్తున్నాడన్న వార్త వింటూనే అంతటా ఆదుర్దా, హడావిడి మొదలవుతుంది. దశరథుడు వశిష్ఠ

దులతో ఎదురేగి ఆయనకు అర్ఘ్యపాద్యాలిచ్చి లోనికి తీసుకు వస్తాడు సాదరంగా. ఆయనను పరిసన్నుణ్ణి చేసుకోవడానికి "ఆహా! నీవంత, యింత" అని ఆకాశాని కెత్తుతాడు.

"అచ్చపు జాలిగుండె మొదలైన మహా విభవాచ్ఛమూర్తి వీ
వచ్చుట యూషరావనికి వర్షము వచ్చుట, పుట్టుపేదకున్
గొ్రిచ్చిన కోండ్రిలోన నిధి కొట్టున దాకుట, లుప్తబీజమై
లొచ్చున బడ్డవంగడములో నిసువొక్కడు తోచుటో ప్రభూ!"

నీవై సేరుట నా గృహంబుల త్రివేణీ సంగమ స్నాన పు
ణ్యావిర్భావము గల్గె నా యెడల గాయత్రి మహాదేవి శ్రీ
సాని త్రైకృతి దృష్ట భేదముగ సాక్షాత్కార మిప్పించెనే
లా వేదమ్ములు నాల్గునాలుగు మొగాలం బాడినట్లయ్యెడిన్

ఈ పద్యంలో దశరథుని పొగడ్త పొగడ్తగా కాక స్వభావోక్తిగా కూడా చెప్పబడినది.

విశ్వామిత్రుని రాకచే త్రివేణీ సంగమంలో స్నానమొనరించినట్లయినది. సావిత్రీదేవి - గాయత్రీదేవి విశ్వామిత్రునిలోనే సాక్షాత్కారమైనట్లయినది. ఇక్కడ మరో విశేషం. గాయత్రి మంత్రమునకు - ఋషి: విశ్వామిత్రుడు. దేవత: సావిత్రి - "గాయత్ర్యాః - గాయత్రీ ఛందో విశ్వామిత్ర ఋషిః సవితా దేవతా" - అని మంత్రము. ఇక్కడ విశ్వనాథ ఇవే మాటలను దశరథుని నోట పల్కించడం ఈ పద్యాంతర్గత విశేషము.

ఇంతవరకు భక్తి, లౌక్యం రెండూ మిశ్రమం చేసి మాట్లాడాడు దశరథుడు. ఇక అంతటితో ఆగవచ్చునుగదా! అతడికి ఒళ్ళు తెలియటం లేదు. పొరబాటున నోరు జారాడు.

"ఊరకయ వచ్చియుందురు
కోరిక యొక్కండు నన్ను గోరుడు నేనుం
దీరిచెద . . ."

"ఇది అడగవచ్చు - అడగరాదు - అని సంకోచించకుండా ఇష్టం వచ్చింది అడగండి" అని విశ్వామిత్రుణ్ణి ఆనందపరచడానికి మాత్రమే తన వద్ద నైపుణ్యాన్నంతా ప్రదర్శించి పలికాడు దశరథుడు, అధిక పరిసంగం అనర్థదాయకమని గమనించే స్థితి దాటిపోయి.

విశ్వామిత్రుడు తక్కువ తిన్నాడా! ఆయన రెండాకులు ఎక్కువ చదివినట్లుగా అంతకంటే లౌక్యంగా మాట్లాడసాగాడు.

"పాపమెన్నేండ్లకో బడయజాలవు సంతు
తుదకేమొ రత్నపు దునుక గలిగె
నేముని ఆశ్రమమ్మేగిన నీ కుమా
రుని గూర్చియే చెప్పుకొనుచు నుండ్రు . . ."

ఇట్లా ఎవరి పని వారు చక్కబెట్టుకొనే ధోరణిలో మాట్లాడుతున్నారు. అలా మాట్లాడిస్తున్నాడు విశ్వనాథ.

విశ్వామిత్రుని కోరిక మేరకు రామలక్ష్మణులను పిలిపించాడు. రామచంద్రుణ్ణి చూసి గాధిజుడానందసాగరమైనాడు. తన రాకను గూర్చి దాచకుండా వివరించాడు.

"నా దగ్గర భృశాశ్వదత్తాలు మూల్గుచున్నవి. రాముడి కోసం మహాస్త్ర నిభృత విద్యలన్నీ పడిగాపులు గాస్తున్నవి. అవన్నీ రాముడికి నేర్పుతాను. నా వెంట పంపు" అంటూ

"ఊరకే అనలము దాచుకొన్న ఫలమా?
క్రతుయోగ్యము కావలెన్ జుమీ!" అంటాడు.

విశ్వనాథ ప్రతిభయావత్తూ యీ ఒక్క మాటలోనే ఉన్నది. ఇక్కడ విశ్వామిత్రుడి మాటలోని 'అనలం' దశరథుని వద్ద "రాముడూ" అనలమే - విశ్వామిత్రుని "విద్యలు" అనలమే. నిప్పును ఒడిలో దాచుకొన గూడదు. దహించి వేస్తుంది. రాముడావిర్భవించినది దశరథుని యింటిలో నుంటకు గాదు. లోకం కొరకు అవతరించినాడు. విశ్వామిత్రుడి మహాస్త్ర విద్యలూ రాముడి కొరకే. విశ్వామిత్రుని మాటలో దశరథునికి ఎంత హెచ్చరిక ఉందో తనకు గూడా అంతే యున్నది. దశరథుని హెచ్చరిస్తూ తన్ను తానూ హెచ్చరించుకున్నాడు. "ఈ హెచ్చరికను" విశ్వనాథ తనకూ వర్తింప జేసుకున్నాడు. మహత్త్వ కవిత్వ సంపదలున్నపుడు 'రామాయణం' వంటి మహాకావ్య నిర్మాణం చేసినపుడే క్రతుయోగ్యమును అనలము వలె పవిత్రమగును. లోక కళ్యాణ కారక మగును. విశ్వనాథ 'శబ్దశక్తి' లోని వైశిష్ట్యానికి ఇదొక మచ్చుతునక.

దశరథునికి 'వణుకు' మొదలైంది. ఏదోలే మాట వరసు ఏదైనా సరే యిస్తానంటే ఈ ముని ముచ్చు పీక పట్టుకున్నాడే అనుకుంటూ - "చిత్తం-చిత్తం" అంటూ చేతులు నల్చుకో సాగాడు. దశరథుని వాలకం విశ్వామిత్రుడికి సందేహం కల్గించి- "ఒత్తిడి చేసెను మౌని" దశరథుడి గుండె గుభేలు మన్నది. "ప్రభూ! ప్రభూ! బ్రతుకంతయు గాచి కన్న యీ పొత్తుల బిడ్డ బాయ నిలుపోఁ నయా నిముసంబు నేనియున్-" అంటూ

రాముడు నాకు స్నానము రాముడు నాకు జపంబు ధ్యానమున్
రాముడె యెల్ల నా బ్రదుకు రాముడు నన్ను గన్నతండ్రి యీ
రాము వినా నిమేష మవురా! మనజాలను గాదయేని నీ
రాముని వీడి యీ అఖిల రాజ్యము గాధిసుతా గ్రహింపవే.

రాముడే నా జీవన సర్వస్వం అంటూ కాళ్ళమీద పడతాడు. విశ్వామిత్రునికి ఒళ్ళు మండిపోయింది. అడగకుండగనే ఏదికావాలంటే అదిస్తానని - తీరా అడిగే సరికి ఆ ఒక్కటితప్ప అంతా యిస్తానంటున్నావా!

"నీ కొడుకును గైకొని చని
మా కొకలి యంచు తిందుమా పిచ్చి నృపా!"

తెలుగు పలుకుబడులలోని సొగసుదనం విశ్వనాథ చేతిలో సముయోచితాలంగా మరీ సొగసు నింపుకోవడం మరో ప్రత్యేకత.

"ఇమ్మగ విద్యనేర్పెదము - ఇంకను నాకొక చిన్నమెత్తు కార్యమ్మును జేసిపెట్టవలె - నాయి బూవులలోన బెట్టి కైకొమ్మని నీ కుమారు విడుగోయని నీక యొసంగువారమా పిమ్మట నీవు గానతని పీడవలెన్ మతిమాకు నేటికిన్."

"ఓటి వెఱ్ఱివాడా! అమాయకత్వంతో అజ్ఞానంతో మాట్లాడుతున్నావు. ఇవ్వాళ నాతో పంపటానికి విలవిలలాడుతున్నావు. రేపు నీకై నీవే వాణ్ణి దూరంచేసు కుంటావు. నీ నెత్తిన కూర్చున్న పెద్దమ్మవారు నీ చేత పంపిస్తుంది" - అని సర్వగర్వంగా- భావి సంఘటనలను ధ్వన్యంతరంగా మహర్షి నోట పలికించాడు విశ్వనాథ. తర్వాతి కథలోని అంశాలను ముందుగా సూచన ప్రాయంగా పలికించడం విశ్వనాథోపజ్ఞ. "చిన్నమెత్తు కార్యము"- "పూవులలోన పెట్టి" వంటినానుడులు ఎంత సహజంగా ప్రయోగించిందీ పరిశీలిస్తే సంభాషణలు నడిపించుటలో విశ్వనాథకు గల ప్రజ్ఞ అవగతమవుతుంది.

మహాక్రోధంతో విశ్వామిత్రుడు వెళ్ళిపోతున్నాడు. కొంప మునగనున్నదని తెలిసికొని దశరథుడు వసిష్ఠుని పాదాలబడి-

వైకుంఠ మెత్తిగిలినను
వైకుంఠమె యొడ్డు కొనగ వలయును మోహ
వ్యాకులిత చిత్తు నన్నున్
గైకో సాకంగ నీకుగా కెవరికయ్య!

విశ్వామిత్రుడు - వసిష్టుడు యిరువురు పరమేశ్వర స్వరూపులు. వైకుంఠము ఎవరి నివాసము? శ్రీ మహావిష్ణువు నివాసము గదా! వారియువురి హృదయములు కూడా పరంజ్యోతికి నిధానములు. కావున యోగీశ్వరేశ్వరుడైన శ్రీమన్నారాయణునకు ప్రతిమూర్తులు ఆ బ్రహ్మజ్ఞానులు. రామావతార ప్రాధాన్యము వారికికాక మరేరికి తెలియును? మన ప్రాచీన మహాతపోధనులపై విశ్వనాథ, తనకు గల గౌరవ భావనను దశరథుని నోట పలికించాడు.

రామ లక్ష్మణులు విశ్వామిత్రుని వెన్నంటి మిథిలా నగరం వైపు వస్తున్నారు. దారిలో వారికొక పాడువడిన ఆశ్రమవాటి కన్పించినది.

కడు పరిభ్రష్టమైన యోగంబువోని
యాశ్రమము జూచి రాముని యక్షులందు
బాష్పములు గుత్తులై రామభద్రు ముఖము
హరి వదలి చన్న వైకుంఠమట్లు తోచె.

హరి వదలి చిన్న వైకుంఠము వలె యున్నదనుటలోనే దాని దుస్థితి తెలియుచున్నది. ఆ ధర్మస్థలి యున్న అధమ స్థితిని గాంచి ధర్మవిగ్రహమైన రాముని హృదయం విలవిల లాడినది. రాముని కన్నులు - నీటితో నిండినవి. ధర్మమునకు నెలవులైన ముని పల్లెలు చల్లగా నుండిన, వైదిక కార్యములు నిరాటంకముగ కొనసాగునపుడు భగవానుడు సంతసించును. అక్కడే ఆగమ రూపుడును యోగీశ్వరేశ్వరుడు; విశ్వమూర్తియునగు హరి కొలువై యుండును. కనుకనే భ్రష్టమైన ఆ ఆశ్రమం హరి వదలి వెళ్ళిన వైకుంఠంలా వుంది. విశ్వనాథ ఈ ఉపమానం- అప్రతిమానం.

బాలకాండములో విశ్వనాథ రసవంతముగా తీర్చిదిద్దిన "అహల్యా వృత్తాంతము" వారి ప్రతిభావ్యుత్పత్తులకు నికషోపలము. ఈ కాండము నందలి ఒక ఉపఖండమునకు గల పేరు "అహల్యాఖండము".

హరి వీడి చనిన వైకుంఠము వలెనున్న గౌతమాశ్రమమును గని రాముని కన్నులు చెమ్మగిలుట గనిన విశ్వామిత్రుడు అహల్యాశాప వృత్తాంతమును వివరించాడు. లజ్జాశ్రీమంథర మధునదము చిందులు వేసే వదనంతో కృపామూర్తి రామచంద్రుడు ఆశ్రమవాటిలో పాదం పెట్టగనే.... ఆశ్రమ స్వరూపం మారిపోయింది. హరి మరల చేరిన వైకుంఠము వలె మారినది.

"నేత్రపర్వముగ నిండిన పూల చివురులు
వృక్షశాఖల గావు లెండుచుండె.
నట్టె దేవత గంగ బట్టి తెచ్చిన కమం
డలు వారి శుభ్రమై వెలుగు జిమ్మె.
నవనవలాడి కృష్ణాజినం బంత
యప్పుడే పరచిన యట్లు తోచె
వృక్షశాఖల యందు వ్రేలాడు జపమాల
స్ఫటికాచ్ఛ కాంతులు చౌకళించె.
హోమ కుండంబులందగ్ని యుజ్వలించె
దీర్చిన బ్రిసే మనోజ్ఞ వేదికలునొప్పె".

ఆశ్రమ ప్రాంగణంలో రాముడడుగిడి నంతనె పేదవడి దీనంగా ఉన్న ఆశ్రమం మళ్ళీ పురావైభవం పొందింది.

రాముడు ఆశ్రమం లోని కరుదెంచు చున్నాడు. రామమూర్తి నీలజలద మోహనమగు మేనిపై నుండి వీచిన గాలి ఆ ప్రాంతంలో అలుము కొన్నది.

"ప్రభు మేనిపై గాలి పై వచ్చినంతనే
పాషాణ మొకటికి స్పర్శవచ్చె.

రాముడు నడచి వస్తున్నాడు. పదము మోపి నంతమేర మధుమాసము లవతరింప నడచి వస్తున్నాడు.

ప్రభుకాలి సవ్వడి ప్రాంతమై నంతనే
శిలకొక్క దానికి చెవులు గలిగె.

సురభిళమైన శరీరంగల శ్యామ సుందరుని దేహ పరిమళాలు ఆశ్రమ స్థలినిండా క్రమ్మినవి.

ప్రభుమేని నెత్తావి పరిమళించినతోన
యశ్మంబు ఘ్రాణేంద్రియంబు జెందె.

సుందరమైన; సుకుమారమైన; సుమనోహరమైన దేహం గల శ్రీరామచంద్రుడు రానేవచ్చాడు.

ప్రభునీల రత్న తోరణ మంజులాంగంబు
గనవచ్చి రాతికి కనులు కలిగె.

ఈ పద్యంలోని సౌందర్యమంతయూ- గాలిసోకగనే స్పర్శ రావటం; అడుగుల సవ్వడితో చెవులు రావటం; దేహపరిమళాలలో ముక్కు రావటం; సుందరశరీరం వచ్చినిలువగనే కనులు గలగటం- ఈ క్రమ పరిణామంలో నిండి యున్నది.

అచేతనములు చేతనత్వమందినవి. పాషాణము నాతిరూపు దాల్చినది. ఆ యువిద హృదయవీధి యందు ఉపనిషత్వితాన మొలికినది. ఆ యెడద రామభజన మందిరమైనది. ఆ గుండెగుడి లోపల శ్రీరామ భద్రాభిమూర్తి సుప్రతిష్ఠితుడైనాడు. ఎవ్వరా స్త్రీమూర్తి! ఎవ్వరా పవిత్ర గాత్రి! ఆమెయే అహల్య. ఆమె హృది బ్రహ్మనంద మధుకుల్య. ఆమె అపగత దోషయై స్వచ్ఛమైన ప్రత్యూషమువలె దర్శన మిచ్చినది.

"కవి ప్రతిభలోన నుండును కావ్యగత శతాంశముల యందు తొంబది యైన పాళ్ళు" విశ్వనాథ అవతారికలో అనిన ఈ మాటలు ఎవరిని గూర్చియో కాదు. తనను గూర్చియే. అందుకు తార్కాణంగా పై పద్యం ఒక్కటి చాలు.

... ... ... ...

నగరం వెలుపల విశ్వామిత్రుడు రామలక్ష్మణులతో సహా సర స్తీరంలో విడిది చేశాడన్నమాట వినగనే మిథిల నేలు తత్త్వజ్యోతి జనకుడు గాధిసూతి నాహ్వానించ ఎదురేగి—

"నీ వచ్చుటచే యజ్ఞము
భావిత ఫలవంతమయ్యెఁ బ్రభువరుఁ దేరన్
దేవతలు నిలచి రిచట
నీ వచుటచే దరించెనే నా జనువే"!

విశ్వామిత్రుడి రాకతో దేవతలంతా వచ్చినట్లయినది. ఇది మామూలుగా ప్రస్తుతిస్తూ పలికే పలుకైనా అందు పూర్తిగా సత్యమున్నది. రామలక్ష్మణులెవరు? జనకుని నోటినుండి అప్రయత్నంగానే "దేవతలు నిలచి రిచ్చట" అను మాటలు వెలువడుట మహాత్ముల నోట ఏ పరిస్థితిలో కూడా తెలియకుండగనైననూ అసత్యములు రావు అను విషయమును విశ్వనాథ పై పద్యంలో చెప్పకచెప్పినాడు.

... ... ... ...

శతానందుడు విశ్వామిత్రుని పూర్వాశ్రమ కథను వినిపిస్తూ బ్రహ్మర్షి కాగోరి అతడొనర్చిన తపస్సు, దాని విశేషములు— కామక్రోధాదులకు లోనై అతని తపస్సు ఎలా, ఎన్నిసార్లు విఫలమైందీ వివరింపసాగాడు. ఈ ఘట్టంలో "మేనకావిశ్వామిత్రము" ను కడు రసవంతంగా తీర్చిదిద్దారు విశ్వనాథ.

విశ్వామిత్రుడు తపస్సులో ఉన్నాడు. పుష్కర తీర్థంలో స్నానమాడి అంబులోడు కేశపాశ దీప్తితో కేడించు సురవధూటి మేనక ఎదుట నిలిచినది. విశ్వామిత్రుని మనసు చలించినది. ఏకాగ్రత చెదరిపోయినది. తపోభంగమైనది. మనసునిండా మేనక నిండిపోయినది. కన్ను రెప్పవేయకుండా ఆమెనే ... ...

"త్రిప్పక చూచి గాధిజుడు, దెప్పరమై తలగోళ్ళ దువ్వుచున్
గప్పిన యాకు మీసలును గడ్డము దర్జని బాయ్యదోయుచున్
విప్పగు తొమ్ముగా నిలిచి విభ్రమ వార్నిధి చేరనేగగ
రెప్పలు మూయరిద్దరును హృత్సదనంబు కవాటముల్ బలెన్."

కనులు రెప్పలు వేయకుండా ఒకరినొకరు చూస్తున్నారు. వారి హృదయాలకు అవి మూతపడని కవాటములవలె నున్నవట.

"వాక్యమ్ రసాత్మకమ్ కావ్యమ్" అనే లక్షణము ననుసరించి కవితాత్మ ఈ ఒక్క వాక్యంలో కాక మరెక్కడ లభించును? విశ్వనాథ విశిష్టమైన ఉత్ప్రేక్షలలో ఇట్టి మణిపూస లెన్నో! – "నా హృదయ సౌధం తలుపులు తెరిచిఉంచాను – లోపలికి రా" అని ఒకరినొకరు ఆహ్వానిస్తున్నారు.

ఏదో రకంగా ఏకాంతంలో ఉన్న కాంతలను పల్కరించాలి గదా! విశ్వామిత్రుడే చొరవ చేశాడు. నవ్వు ఒక రకమైన పల్కరింపు గదా! అందుకే—

"నవ్వెను మౌని యచ్చరయు నవ్వెను నవ్వులలోన నర్థమై
యవ్వర వర్ణినీ మణిని నామని యూరక నాని పోయెదే
విప్పిన కేశముల్ పిడుపు పెట్టుదునా! యని యుత్తరీయపున్
రువ్వులచెంగులన్ మృదుశిరోరుహములన్ పెనవెట్టిచుట్టుచున్."

ముని పలకరింపు "నవ్వు"కు నవ్వుతోనే సమాధాన మిచ్చిందా జవ్వని. నవ్వులలో అర్థమైపోయింది విషయం. మరో అడుగు ముందుకు వేశాడు విశ్వామిత్రుడు. "అరెరే! ఊరకే నీళ్ళలో నానిపోతున్నావే జుట్టు పిడుపు పెట్టేదా!" అని అంటూ సమాధానం కోసం చూడకుండానే ఉత్తరీయపు కొంగుతో ఆమె శిరోరుహాలు పెనవెట్టి చుట్టసాగాడు.

ఆమె సిగ్గు ప్రదర్శిస్తూ మృదువుగా వారించి తానే తుడుచు కోవాలని ప్రయత్నించింది.

"ఆమె వారించి తుడుచుకో నామె తివురు.
అతడు వారించి తుడువగా నతడు తివురు.
చేతులం దీయుచు బెనంగ జివరిదైన
ఫలము తడికౌగిలింతగా పరిణమించె."

ఈ తుడుచుకునే తుడిచే ప్రయత్నంలో అప్రయత్నంగా ఒకరి కౌగిలిలో మరొకరు చేరుకున్నారు. అదీ "తడికౌగిలింతలో" చివరకు—.

తుడిచిన దెవ్వరో తుడకు తోచదుగాని లతాంగి మాత్రమున్
బొడియగు చీరదాల్చి విడువుంగని మౌనియెడిన్ శయించె...."

జరిగేవన్నీ జరుగుతూనే ఉన్నవి. వారిద్దరికీ మాత్రం అవి తెలియడం లేదు అని చెప్పడంలో ఉంది విశ్వనాథ గడుసుదనం.

విశ్వామిత్రుడు సర్వస్వం మరచిపోయాడు. అతనికి మేనకయే విశ్వమైనది. ఒకరికొకరు ప్రాణమైనారు. "వచ్చిని వింటి జోదు నవపల్లవ ఖడ్గ హస్తుడయి" వారికి బంటుగా నిలిచాడు. ఆమెకు పారాణి దిద్దడం, కొప్పులో పూలు ముడచడం దినచర్యలుగా మారి శృంగార తపస్సులో మునిగి పోయాడు.

కోకిల కొమ్మలో కూసిన నీవపే
నన్ను బిల్చితి వంచు నవ్వు మౌని
తుమ్మెద పొదలోన ఝుమ్మన నిదియేమి
మణితమే యని మేలమాడు మౌని

(తరువాయి 59 వ పేజీలో)

# మౌనవిపంచి

## శ్రీ కె. పాపయ్యశాస్త్రి

నరనరాన
అగాధ అనుభూతి సాగరాలను నింపుకొని
ఒక మృదు స్పర్శకోసం
యుగయుగాలుగా
నిరీక్షిస్తున్నాను!
సృష్టిలోని అణువణువునూ
బ్రహ్మానంద రస తరంగిణిలో
ఓలలాడించి
దివ్యానుభవాన్ని అందించాలన్న
అవ్యాజ అవ్యక్తావేశంతో
అనుక్షణం ఎదురు చూస్తున్నా!
ఎగసిపడే రాగలహరులను
ఎందాకని ఆపగలను?
నితాంతానంత ఏకాంతంలో
నినదించకుండా
ఎంతకాలం నీరవాన్ని మోయగలను?
రాగపుష్కలా వర్తాలను
నిగళబద్ధం చేసి
వేదనాగ్రీష్మతాప సంతప్త స్వాంతాలకు
సాంత్వనం లేకుండా
ఆనందామృత వర్షిణిని కాకుండా
మృతప్రాయంగా
ఎలామనగలను?
ప్రకృతి ప్రసాదించిన వరంతో
పంచమ స్వరంతో
పాడే కోకిలలను చూస్తూ
రసావేశాన్ని ఎందాక అణగద్రొక్కను?
శిశిరాన సర్వస్వం కోల్పోయిన
పాదప సమూహానికి
ప్రాణంపోసే ఆమని ఆగమనానికి
వాసంత గీతికా లాపనలతో
మూర్ఛనలు పోకుండా
మూర్ఛలో ఎంతకాలమని ఉండగలను?
ఈ శతాబ్దాల స్తబ్ధత, నిశ్శబ్దత
ఇక దుర్భరము – దుస్సహము.
సున్నితంగా శృతిచేసి
సుమధుర రసార్ద్రగీతికలను పలికించి
ఎన్నటికి జరిగేను నాలో మళ్ళీ ప్రాణప్రతిష్ఠ?
ఎక్కడున్నాడా ప్రవిమల మహోత్కృష్ట గాన కళాస్రష్ట!
నాటివరకు
సంతత విషాదరాగాలాపనా నిమగ్న
అభిశప్త మౌనవిపంచికను
నిరంతర వేదానల విదగ్ధ సంగీత సంచికను.

డా॥ జి. సోమేశ్వరరావు

# విశ్వశాంతి స్థాపనలో గాంధేయవాదం

భారత రాజనీతి తత్వవేత్తలలో మహాత్మా గాంధీకి ఒక విశిష్టమైన స్థానముంది. రాజకీయ రంగంలో ప్రముఖపాత్ర వహించి కూడా మహాత్మాగా పరిగణింపబడటం ఆయనలోని విశేషం. గాంధీజీ కేవలం రాజకీయ నాయకుడు మాత్రమేకాదు. ఆయనొక న్యాయవాది. సంఘ సంస్కర్త, తత్వవేత్త. ఆధునిక ప్రపంచంలో ప్రజ లెదుర్కొంటున్న రాజకీయ, ఆర్థిక, సామాజిక సమస్యలను ప్రాచీన మత సిద్ధాంతాల ద్వారా పరిష్కరించటానికి ఒక నూతన మార్గాన్ని చూపటంవల్ల గాంధీజీ సిద్ధాంతాలు విశ్వజనీన మైనవి. గాంధీజీ సర్వ మత సారమైన భగవద్గీతలో ఉటంకింపబడిన కర్మయోగి. సత్యా హింసలను రాజకీయ ఆయుధంగా ఉపయోగించిన ఋషి గాంధీజీ.

## మతం - రాజకీయాలు

గాంధీజీ రాజకీయాలను మతం నుండి వేరుచేయలేదు. ఆయన మతాన్ని విశాల దృక్పథంతో చూసి రాజకీయాలకు ఆధ్యాత్మికతను ఆపాదించేడు. రాజకీయాలతో మతానికి ప్రమేయం అక్కర్లేదనేవారికి మతమంటే ఏమిటో తెలియదంటారు గాంధీజీ. మతమనగా ఆయన దృష్టిలో ఆత్మజ్ఞానం. గాంధీజీ సత్యాహింసల సమ్మేళనమే మతమని నమ్మినారు. సత్యమే నా దైవం. ఆయనను చేరుకోవటానికి అహింస ఒక్కటే పరమసాధనం అంటారు గాంధీజీ. మతంలేని రాజకీయాలు గాంధీజీ దృష్టిలో మరణ సదృశాలు. ఐతే గాంధీజీమతం ఏ ఒక్క మతానికీ చెందినది కాదు. ఆయన సర్వాంతర్యామియైన దేవుడిని నమ్మేడు. మతం మానవునిలోని నైతిక విలువలను పెంచుతుంది కనుక రాజకీయాలలో మతంయొక్క అవశ్యకతను గురించి ఆయన నొక్కిచెప్పేరు. ప్రస్తుతం ఆచరణలో ఉన్న మాకియవెల్లీ కుటిల రాజకీయాలకు స్వస్తి చెప్పి కుల, మత, జాతి, వర్గ విచక్షణ లేని స్వేచ్ఛాయుత మతాన్ని ఆయన అంగీకరించేడు. మానవజాతి ప్రేమ అతని మతం కొబట్టి అది విశ్వజనీనతను సంతరించుకున్నది. "నిన్ను నువ్వు ఎంతగా ప్రేమిస్తావో నీ పొరుగువానిని కూడా అంతగానే ప్రేమించుము" అన్న బైబిలు సూక్తికి గాంధీజీ "నీ చుట్టూవున్న ప్రతివాడూ నీ పొరుగువాడే" అన్న భావాన్ని జోడించేరు.

## గాంధీ - మార్క్స్

రాజకీయ లక్ష్యసాధనలో జయాపజయాలు, న్యాయాన్యాయాలు అనివార్యం కనుక లక్ష్యసాధన మార్గాలకే గాంధీజీ ఎక్కువ ప్రాధాన్యత నిచ్చేరు. ఇక్కడే మార్క్స్‌కీ, గాంధీకి గల తేడా. ఇరువురిదీ వర్గరహిత, రాజ్యరహిత, సమాజస్థాపనే పరమ లక్ష్యమైనప్పటికీ సాధనమార్గాల విషయంలోనే వారిరువురి మధ్య విభేదం వుంది. మార్క్సిస్టుల దృష్టిలో మహత్తరమైన లక్ష్యం కోసం కృషి చేస్తున్నప్పుడు సాధన మార్గాలకు అంతగా ప్రాముఖ్యత నీయనవసరం లేదు. కాని గాంధీజీకి లక్ష్యము, సాధన మార్గాలు రెండూ పవిత్రమైనవిగా ఉండాలి. ఆయన దృష్టిలో లక్ష్యాల గొప్పతనం వాని సాధన మార్గాలలోనే ఉంది. లక్ష్యం కన్న సాధన మార్గాలకు ఆయన ఇంత ప్రాముఖ్యత నీయటానికి కారణం ఏమంటే మనిషి కృషి చేయగలడే గాని ఫలితం ఆయన చేతిలో లేదు. అందుకే లక్ష్యం కన్నా సాధన మార్గాలు మహోన్నతంగా ఉండాలి. అంతేకాక లక్ష్యం సాధన మార్గాలనుండే ఉద్భవించింది కనుక విత్తును బట్టి వృక్షధర్మమున్నట్లు మార్గాలను బట్టే లక్ష్యముయొక్క ఔన్నత్యం ప్రస్ఫుటమవుతుందని ఆయన భావన. ప్రపంచ శాంతికి మారణాయుధాల ఉత్పత్తే ముఖ్య మార్గమని భావించే నేటి అగ్రరాజ్యాల నీతి బాహ్యమైన ధోరణికి పైన చెప్పిన గాంధీజీ ఆశయం తగిన సమాధానం చెప్పగలదు.

## తాత్విక అరాచకవాదం

గాంధీజీ తాత్విక అరాచకవాది. ఆయన రాజ్యాధికారాన్ని ఏరూపంలోనూ సహించలేదు. ఈ భావనకు నైతిక, చారిత్రక, ఆర్థిక కారణాలు గలవు. ఒక వ్యక్తి ఏ కార్యాన్నైనా స్వేచ్ఛగా, స్వచ్ఛందంగా నిర్వహించినప్పుడే అది నీతివంతంగా ఉంటుంది. మానవుడిలోని అసమగ్రతవల్లనే రాజ్యం కొనసాగుతుందని ఆయన భావం. అందుకే రాజ్యరహిత ప్రజాస్వామ్యమే గాంధీజీ ఆదర్శ సమాజం. ఇది అరాచకవాదాని కన్నా ఉన్నతమైనది. ఇందులో

సమాజజీవనం ఎటువంటి బాహ్యాధికారానికి లోబడకుండా స్వేచ్ఛా యుతంగా పరస్పరావగాహనపై జరుగుతుంది. ప్రతి వ్యక్తి సమాజంలోని అంతర్భాగంగా సమాజ శ్రేయస్సు కోసం కృషి చేస్తాడు. గౌరవప్రదమైన ఈ అహింసాయుత సమాజమే గాంధీజీ ఆశించిన స్వయం పోషకమైన గ్రామ రాజ్యం.

## గ్రామస్వరాజ్యం

ఈనాడు ప్రభుత్వం సంక్షేమ రాజ్యస్థాపనకోసం సర్వాధికారాలను నిర్వహిస్తోంది. అందువల్ల వ్యక్తి స్వేచ్ఛ మరుగునపడి ప్రభుత్వాధిక్యతే ప్రస్ఫుటంగా గోచరిస్తోంది. అందుకే అది హింసకు దారి తీస్తోంది. గాంధీజీ ఆశించిన గ్రామ స్వరాజ్యం ఈ రకమైన పరిస్థితిని రూపుమాపి వ్యక్తికి ప్రాముఖ్యత నివ్వటంవలన సమసమాజ స్థాపనకు, శాంతికి దోహదం చేస్తుంది.

## ధర్మ కర్తృత్వం

"ధనమూల మిదం జగత్" అనే దోపిడీ విధానానికి ఆలవాల మయిన పెట్టుబడిదారీ వ్యవస్థను, ఇటు హింసతో, వర్గద్వేష పునాదులపై ఏర్పడ్డ సోషలిస్టు సమాజాలను తూలనాడేడు. వాటి విషపూరిత ప్రభావాలకు సుదూరమైన శాంతియుత సమాజ స్థాపనకోసం ధర్మ కర్తృత్వాన్ని బోధించేడు. ప్రస్తుత పెట్టుబడిదారీ సమాజ వ్యవస్థను సమసమాజ వ్యవస్థగా మార్చటానికి గాంధీజీ ప్రవచించిన ధర్మ కర్తృత్వ సిద్ధాంతం సాధనంగా ఉపయోగపడుతుంది.

ఉత్పత్తి సాధనాలు, ఆర్థిక సంపదలు సమాజానికి చెందుతాయే తప్ప వ్యక్తులకు చెందవన్నాడు గాంధీజీ. వీటిని వ్యక్తి వర్గప్రయోజనాల కోసం కాకుండా సమాజ శ్రేయస్సు కోసం ఉపయోగించాలన్నాడు. అవసరానికి మించిన వ్యక్తిగత ఆస్తులకు యజమాని కేవలం ధర్మకర్తగా మాత్రమే వ్యవహరించాలి.

ఏ విధంగా కనీస వేతనాన్ని నిర్ణయిస్తారో ఆవిధంగా గరిష్ఠ సంపదను కూడా నిర్ణయించాలంటారు గాంధీజీ. మానవుల ప్రాథమికావసరాలను తీర్చే ఉత్పత్తిసాధనాలు ప్రజాబాహుళ్యం అధీనంలో ఉన్నప్పుడే ఈ ఆదర్శసమాజ స్థాపన సాధ్యమవుతుందని ఆయన భావం. భగవంతుని సృష్టియైన ఈ సాధనాలు అందరికీ సమానంగా అందుబాటులో ఉండాలేతప్ప కొందరు వ్యక్తులకు దోపిడీ సాధనాలుగా ఉపయోగపడకూడదు. ఇదే నేడు అందరూ కోరుకుంటున్న సోషలిస్టు సమాజం కూడా.

## సర్వోదయ సిద్ధాంతం

బెంథామ్, మిల్ మొదలయినవారు ప్రవచించిన ఉపయోగితా వాదం అత్యధిక సంఖ్యాకుల శ్రేయస్సును కోరటంవల్ల 51% వ్యక్తుల ప్రయోజనాలను నెరవేర్చటానికి 49% వ్యక్తుల ప్రయోజనాలు బలి అయ్యే ప్రమాదం ఉంది. అందువల్ల గాంధీజీ అందరి శ్రేయస్సును కోరే సర్వోదయ సిద్ధాంతాన్ని ప్రతిపాదించినారు. ఈ విధంగా ఉపయోగితావాదము, గాంధీజీ కోరిన సర్వోదయ సిద్ధాంతము ఒక చోట కేంద్రీకృత మవటానికి అవకాశమున్నప్పటికీ అవి కొన్ని సమయాల్లో వికేంద్రీకరించి పరస్పర విరుద్ధమైన మార్గాలలో పయనించటము ప్రారంభిస్తాయి. ఉపయోగితావాది ఎట్టి పరిస్థితులలోను ఆత్మ త్యాగం చేయడు కాని అహింసావాది ఎల్లప్పుడూ ఆత్మత్యాగానికి సంసిద్ధుడే. మనిషిలో నానాటికీ పెరుగుతున్న స్వార్థప్రయోజనాల వల్లనే ప్రపంచంలో హింస, అశాంతి ప్రజ్వరిల్లుతున్నాయి. ఇట్టి పరిస్థితులలో గాంధీజీ ప్రవచించిన సర్వోదయ సిద్ధాంతము ప్రపంచ శాంతి స్థాపనకు దోహదం చేయగలదు.

## సత్యం - అహింస

గాంధేయ వాదానికి సత్యాహింసలు మూలస్తంభాలవంటివి. అహింస నైతిక, ఆధ్యాత్మిక శక్తులకు చిహ్నము. మానవ సాధ్య మయిన పరిపూర్ణమైన ఆత్మశుద్ధి అహింస. అహింస ఎప్పుడూ హింసకన్నా బలీయమైనది. అహింసకు ఓటమి అన్నది లేదు. కాని హింస ఎల్లప్పుడు ఓటమితోనే అంతమవుతుంది. నిశ్చయ జయమే అహింసయొక్క అంతిమ ధ్యేయం. వాస్తవంగా ఎక్కడ ఓటమి లేదో అక్కడ జయం కూడా లేదు. గాంధీజీ దృష్టిలో అహింస అన్ని మతాలకూ ఆత్మ వంటిది. సత్యమే పరమోత్కృష్టమైన న్యాయము, అహింసే పరమోత్కృష్టమైన విధి, అని గాంధీజీ ఉద్దేశ్యం. అహింస అనగా నిత్య జీవితంలో అనివార్యంగా కనిపించే హింసను విడనాడటం. మనసా, వాచా, కర్మా హింసను విడనాడటమే అహింస. అంతమాత్రాన గాంధీజీ అహింసావాదాన్ని పిరికితనంగా భావించకూడదు. పిరికితనం, హింసలలో దేనిని స్వీకరించాలన్న ప్రసక్తి వస్తే హింసనే స్వీకరిస్తానని గాంధీజీ అంటారు.

సత్యాహింసలు గాంధీజీ క్రొత్తగా చెప్పిన సిద్ధాంతాలు కావు. అవి శాశ్వతమైన జీవన సూత్రాలు. గాంధీజీ చేసినదల్లా ఆ సూత్రాలను ఆధునిక జీవితానికి అన్వయించేటట్లు పునరుద్ఘాటించి పునఃపరిశీలన చేసేరు. ఐనా ఇతరులందరికన్న ఎక్కువగా విస్తృత ప్రాతిపదికపై ప్రయోగాత్మకంగా ఆచరించి, జీవితంలోని ప్రతి కోణానికి అన్వయించేట్లు తనదైన పద్ధతిలో కృషి చేసేడు.

## అంతర్జాతీయ సంస్థలు - ప్రపంచశాంతి

ద్వితీయ ప్రపంచ యుద్ధం ప్రారంభమైనప్పుడు ఫాసిస్టు శక్తులను అహింసా పద్ధతులలో ఎదుర్కొనవలసినదిగా ఆయన ఆదేశించేరు. అహింస మానవ న్యాయం అన్నారు. అహింసను పూర్తి విశ్వాసంతో ఆచరించినపుడు అది ఆస్తులను పోగొడుతుందేమోగాని

ఆత్మాభిమానాన్ని మాత్రం పెంచుతుంది. అహింస మీద ఆయనకి ఎంతటి విశ్వాసమంటే భారతీయులందరూ అహింసా సిద్ధాంతాన్ని మొదటినుండి చిత్త శుద్ధితో ఆచరించినట్లయితే భారత స్వాతంత్ర్యం ఇంకా చాలా ముందే వచ్చి ఉండేది అన్నారు.

ఆయన స్వేచ్ఛాయుత ప్రజారాజ్యాల సమాఖ్య ఏర్పాటును సమానత్వ సిద్ధాంత ప్రాతిపదికపైన కోరేరు. మానవాళియొక్క శాంతి అవసరాలను నానాజాతి సమితి తీరుస్తుందని విశ్వసించలేక పోయేరు గాంధీజీ. 1919లో ఏర్పరుచుకొన్న వర్సైల్సు శాంతి ఒడంబడిక సమయంలో అగ్రరాజ్యాల స్వార్థపరత్వాన్ని, ఆధిపత్య దాహాన్ని ఆయన ఆనాడే గ్రహించేరు.

నానాజాతి సమితి, ఐక్యరాజ్య సమితి హింస ద్వారానే స్థాపించబడ్డాయి. ఐక్యరాజ్య స్థాపనను గురించి గాంధీజీ "యునయిటెడ్ నేషన్స్ సెట్ అవుట్ టు ఫైట్ హిట్లర్ విత్ హిస్ వెపన్స్ అండ్ ఎండెడ్ బయి అవుట్ హిట్లరింగ్ హిట్లర్" అని ఛలోక్తిగా అన్నారు. ఆయన ఐక్యరాజ్య సమితిపై అగ్రరాజ్యాల ఆధిపత్యాన్ని ఆనాడే విమర్శించేరు. చిన్నా, పెద్ద లేకుండా సభ్యదేశాలు సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని పొందినపుడే ఐక్యరాజ్య సమితి విజయవంత మవుతుంది అన్నారు. గాంధీజీ నాయకత్వంలో ఫ్రంటియర్ గాంధీగా పేరు పొందిన అబ్దుల్ గఫర్‌ఖాన్ ఖుడా ము ఖిద్ మట్‌గర్స్ అనే రక్షణ శాంతి సేనలను నిరాయుధులైన ముస్లిం పఠానులను ఏర్పరచి భారత వాయవ్య సరిహద్దుకు రక్షణ కల్పించేరు. 1922లో బొంబాయిలో చెలరేగిన మత కల్లోలాలను శాంతిసేన ద్వారానే రూపుమాపి హిందూ ముస్లింల మధ్య సఖ్యతను నెలకొల్పేరు.

అందుకే 1935లో ఇథియోపియాపై ఇటలీ దురాక్రమణ జరిపినపుడు నానాజాతి సమితిని సైన్యానికి బదులు నైతిక బలాన్ని పంపించమన్నారు.

ఈ అంతర్జాతీయ న్యాయ వ్యవస్థ యుద్ధనివారణకోసం కాక ప్రకృతి వనరులను ప్రపంచదేశాలన్నీ పరస్పరావగాహనతో పంచుకొని మానవాభ్యుదయానికి తోడ్పడేందుకు కృషి చేయాలని ఆయన ఉద్దేశ్యం. అప్పుడే సభ్యరాజ్యాల స్వాతంత్ర్యానికి, సార్వభౌమత్వానికి భంగం కలగదు. దోపిడీకి, దురాక్రమణకు తావుండదు. జాతీయ మైనారిటీలకు రక్షణ, వెనుకబడిన ప్రజల అభివృద్ధి సాధ్యమవుతుందన్నారు. అప్పుడే నిరాయుధీకరణ వాస్తవం కాగలదు. జాతీయ సైనిక దళాల అవసరం ఉండదు.

## సత్యాగ్రహ సిద్ధాంతం

సత్యాగ్రహాన్ని గాంధీజీ తన రాజకీయ జీవితంలో బలమైన ఆయుధంగా స్వీకరించేడు. గాంధీజీ, ఈ పోరాట పద్ధతిని మొదట దక్షిణాఫ్రికాలో ప్రవేశపెట్టేడు. నిష్క్రియ ప్రతిఘటనకు, అహింసాయుత ప్రతిఘటనకు గల తేడాను వివరించి, అహింసను బలహీనుల ఆయుధంగా భావించరాదని ఆయన హెచ్చరించారు.

సత్యాగ్రహమనగా అసత్యం యొక్క ఒత్తిడికి లోనుకాకుండా సత్యాన్ని నిరంతరం కాపాడటం అని అర్థం. "ధర్మోజయతి" అన్న సూక్తిలో సాధారణంగా 'ధర్మం' అన్న పదానికి మత పరమైన, వర్ణ వ్యవస్థకు సంబంధించిన అర్థాన్నిచెప్పటం జరుగుతుంది. కాని ఇక్కడ ధర్మం అనే పదానికి అర్థం సత్యం.

సత్యాగ్రహం శక్తివంతమైన స్వయంభావనను బోధిస్తుంది. ఎప్పుడైతే అసత్యందాడి మొదలవుతుందో అప్పుడు సత్యాగ్రహం అవసర మవుతుంది. సత్యాగ్రహమనగా రాజకీయ, ఆర్థిక శక్తుల ఆధిక్యతను ఎదుర్కొనే ఆత్మశక్తి. అది మానవ అంతరాత్మ ప్రకటన. ఇంకాచెప్పాలంటే సత్యాగ్రహమనగా సర్వవిధాలైన అన్యాయాలను, ఆక్రమణను, అధోగతిని ఎదుర్కొనుటకు ఉపయోగించబడే పవిత్రమైన ఆత్మశక్తి. సత్యంయొక్క శక్తిని అది చాటుతుంది.

ఇతరులను నొప్పించకుండా తనకుతానై బాధ ననుభవిస్తూ ఎదుటివానిలో హృదయ పరివర్తనను సాధించుట కొరకు చేసేతపస్సే సత్యాగ్రహం. నిరాహారదీక్ష, సహాయనిరాకరణ, శాసనోల్లంఘనం, హిజరత్, సమ్మె అనునవి సత్యాగ్రహరూపాలు.

గాంధీజీ (హిందూస్వరాజ్) చదివిన టాల్‌స్టాయ్ సత్యాగ్రహ సిద్ధాంతాన్ని అంతర్జాతీయస్థాయిలో ప్రచారంచేశారు. ఇది మానవాళికి సర్వసమస్యల పరిష్కార సాధనంగా ఉపయోగిస్తుందన్నారు. క్రీస్తియన్లలోనహా ప్రపంచ ప్రజలందరూ ఆచరించదగిన సూత్రమన్నారు టాల్‌స్టాయ్. ఈ సత్యాగ్రహ సూత్రాన్ని గాంధీ మొట్టమొదటగా 1913 నవంబరులో జాతివివక్షణ ప్రాతిపదికపై అల్పసంఖ్యాకులైన భారతీయులహక్కులకు భంగం కలిగించిన బోయర్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా నిర్వహించేరు. పాలకులైన జనరల్ స్మట్స్, బోథా గాంధీజీతో సంధి చేసుకున్నారు.గాంధీజీ కానుకగాయిచ్చిన కాలిజోళ్ళను ఇరవైఅయిదు సంవత్సరాల తరువాత తిరిగి యిచ్చివేస్తూ స్మట్స్ "ఈ జోళ్ళను ధరించే అర్హత నాకులే" దన్నారు. "కఠోరమైన నియంతృత్వపు రోజుల్లోనే ఆయనపద్ధతులు మాకు ఆశ్చర్యాన్ని కలిగించే" యని ఆయన ప్రశంసించేరు.

నిరాయుధీకరణను గురించి ఓప్రక్క కోకొల్లలుగా కబుర్లు చెపుతూ మారణాయుధాల ఉత్పత్తిద్వారా ప్రపంచాధిపత్యాన్ని పొందటానికి ప్రయత్నిస్తున్న అగ్రరాజ్యాల మధ్యజరిగే ప్రచ్ఛన్నయుద్ధాన్ని ఐక్యరాజ్యసమితిగాని, శాంతి శిఖరాగ్రసమావేశాలుకాని పరిష్కరించలేక పోవటానికి కారణం అహింస, ప్రేమ, సత్యం-యీ మూడు మార్గాల యెడల ప్రజలలో అభిమానం లేకపోవటమే. దక్షిణాఫ్రికా లాటిన్, అమెరికాలలోని ఎన్నోదేశాలు యింకా విముక్తి పోరాటాలను హింసాయుత మార్గాలద్వారా జరుపుతూనే ఉన్నాయి. ఈ రెండువర్గాలకు చెందిన దేశాలుకూడా కర్మయోగి గాంధీజీ ప్రవచించి ఆచరించిన సత్యాహింసా సిద్ధాంతాలను త్రికరణ శుద్ధిగానమ్మి ఆచరించినప్పుడే ప్రపంచ శాంతి స్థాపన సాధ్యమౌతుంది.

# అనురక్తి

మినమినలాడే
నీ వపు స్సౌందర్యదీప్తికి
అబ్బురపడుతూ
"ఆహా" ! అని
రెప్పలల్లారుస్తూ
సర్వదా
నీ సరసనే సంచరిస్తుండే
నేను
ప్రియా !
ఈ నాడు
వల్లకాటిలో బూడిద కుప్పయిన
నీ సోయగాన్ని - లాలిత్యాన్ని
చూసి
గోడుగోడునా విలపిస్తూ
"అయ్యో" ! అని రెప్పపాటు
లేని వాణ్ణయ్యాను !
నీ చెంతకే చేరాను !

# పగటి కలలు !

సీతమ్మ దోసిళ్ళలో
శ్రీరామభద్రుని శిరోభాగంలో,
మేనికాంతిలో
పద్మ రాగాల్లాగా
బంగారు పువ్వుల్లాగా
ఇంద్ర నీలాల్లాగా
చిత్ర రత్నద్యుతుల నందుతూ
మెరిసిన
తలంబ్రాలలాగా
నానావర్ణ సందోహమై - మురిపిస్తూ
సగటు మనిషికి సౌఖ్యాల్ని
సరఫరా గావిస్తుంటాయి !
సగం బలాన్ని చేకూరుస్తుంటాయి !
వాటిని మించిన ధనంలేదు వానికి !
వాటిలోనే తియ్యదనం ఉన్నది వానికి !

( శ్రీ ముళ్ళపూడి వెంకట రమణగారి "పగటి కలలు" వ్యాసం చదివిన తరువాత కలిగిన అభిప్రాయం )

శ్రీ కె. కిశోరుబాబు
శ్రీ కె. అశోకుబాబు

శ్రీ టి. ఎల్. కాంతారావు

# ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్న ధోరణులు

## ( సమీక్షా వ్యాసం )

సారస్వత పరిషత్‌వారు ఈ శతాబ్దపు తెలుగు సాహిత్య పరిణామ వికాసదశలను గురించి ఇటీవలికాలంలో మంచిపుస్తకాలు వేస్తున్నారు. ఆ క్రమంలో వచ్చినపుస్తకాల్లో ఆధునిక తెలుగుసాహిత్యంలో విభిన్నధోరణులు అన్న ఈ పుస్తకంఒకటి. ఆంధ్ర సారస్వతపరిషత్ నిర్వహిస్తున్న సారస్వత వేదిక ద్వారా ఆయా రంగాల్లో నిష్ణాతులైన ప్రముఖులను పిలిపించి, ఉపన్యాసాలిప్పించి, వాటిని గ్రంథరూపంలో ఆ సంస్థనిర్వాహకులు తెస్తున్నారు. ఈ గ్రంథం సారస్వతవేదికకు ఐదు సంవత్సరాలు పూర్తయిన సందర్భంగా వెలువడినది. సమర్థవంతమైన సంచాలకత్వం, సంపాదకత్వంలో ఈ గ్రంథం రావటం హర్షదాయకం.

ఈ వ్యాసాలన్నీకూడా నిర్దిష్ట అంశానికి పరిమితమై ఏ తదంశాన్ని కూలంకషంగా చర్చించినవే. జె. వి. రాఘవేంద్రరావుగారు కాల్పనికవాద కవిత్వాన్నిగురించి, దాని జన్మస్థానంలో అదిపొందిన పరిణామాలు తెలుగు కవిత్వంలో దాని అస్తిత్వం మొదలైన అంశాలపై విస్తరమైన వివరణను ఇచ్చారు. రొమాంటిక్‌పొయిట్రీ, రొమాంటిసిజమ్-వీటికిగల నిర్వచనాల భిన్నత్వాన్ని ఆ క్రమపరిణామాన్ని పాశ్చాత్యదేశాల్లో రొమాంటిక్ పొయిట్రీకి, తెలుగు దేశంలో కాల్పనిక కవితకు స్వరూపంలోనూ, స్వభావంలోనూ ఉన్న తారతమ్యతను, సారూప్యతను సాక్ష్యాధారాలతో చూపించారు. ఈ కాల్పనిక వాదమే జర్మనీలో ఆదర్శవాదంగా,ఇంగ్లండులో సౌందర్యవాదంగా, ఫ్రాన్సులో స్వేచ్ఛావాదంగా పరిణమించిందని చెప్పారు. ఆ యా దేశాల్లోకూడా ఈ వాదం వ్యక్తిస్వేచ్ఛ, వ్యక్తివాదం పునాదులుగా చేసుకొనటంవలన అనంతర సామాజికోద్యమాలకు ఇది దారి తీయలేక పోయింది. రచయితలు తాము ఉంటున్న సమాజాన్ని, దాని జీవితాన్ని విస్మరించి వారిదైన మానసిక ప్రపంచంలో అంతర్లోకాలను సృష్టించుకొనటంవలన "ఇలాంటి సాహిత్యం వాస్తవికతను ప్రతిబింబించకుండా, వాస్తవానికి దూరంగా రచయితల అంతర్లోకాన్ని, అనుభూతిని, అభివృత్తుల్ని ఊహను, ఊహను, స్వాప్నికతను, సౌందర్యాన్ని సంకేతిస్తుంది" అన్నారు వ్యాసకర్త. తెలుగు సాహిత్యంలో వాస్తవికత రాంభట్ల కృష్ణమూర్తిగారి వ్యాసం శాస్త్రీయమైన ఆలోచనా విధానంతో కూడుకుని ఉంది. మనుగడకు అవసరమయిన సాధనాలు, ఉత్పత్తి సంబంధం, పునరుత్పత్తి సంబంధం- ఈ మూడు సంబంధాల సముచ్ఛయాన్నే సామాజిక అస్తిత్వం అంటారని రచయిత చెబుతూ ఉత్పత్తి సంబంధమే తక్కిన రెంటిమీద పెత్తనం చెలాయిస్తుంది కనుక దాన్ని ఆర్థిక ఆధారంగా పేర్కొనటం జరిగింది. ఇప్పటికీ ఆర్థికాధారం యొక్కస్థితిని పట్టించుకొనకుండా పైపై సంస్కరణల ద్వారా ఈ సమాజం మారాలని కాంక్షిస్తూ దానికోసం అనేక సంస్కరణవాదాల్ని ప్రవేశ పెడుతున్న వాళ్ళున్నారు. సంఘంలో మనుషుల మధ్యనున్న అన్ని సంబంధాలకూ ఆధార భూతము, అగ్రిమమూ అయిన ఈ ఆర్థికాధారంలో మార్పు సంభవిస్తే తప్ప సమాజం మారదు అని రాంభట్ల కృష్ణమూర్తిగారు వారి వ్యాసంలో సోపపత్తికంగా ఋజువు చెయ్యటానికి ప్రయత్నించి ఫలితాన్ని సాధించారు. ఆధునికత పేరుతో వస్తున్న రూప వాదాన్ని, వ్యష్టి వాదాన్ని సహజ వాదాన్ని, ఆదిమ వాదాన్ని ఈ వ్యాసంలో రచయిత ఖండించారు. పేరులో తప్ప ఆధునికత ఈ వాదాల్లో ఎక్కడా కానరాదని సోషలిస్టు అన్వీక్షకి గలవారు ఈ వాదాలన్నింటినీ తిరస్కరిస్తారని రచయిత వ్యాసాంతంలో చెప్పారు. పురాణ వాస్తవికత, బర్బర మహర్దశ ప్రథమాంతరం, ప్రబంధ వాస్తవికత, కాల్పనిక వాస్తవికత సవిమర్శక వాస్తవికత (క్రిటికల్ రియలిజమ్) జానపదవాస్తవికత సోషలిస్టు వాస్తవికతల స్వరూపాన్ని స్వభావాన్ని విశదీకరించారు. సమాజంలో ఉన్నస్థితికి, దాన్ని ఆధారంగా పుట్టే సాహిత్యానికిగల సంబంధ బాంధవ్యాలను, సాహిత్యం ఉండవలసిన స్థితిని, రచయితలో కొరవడ్డ లక్షణాలను ఈ వ్యాసంలో సహనంతో సమగ్రంగా చర్చించటం జరిగింది.

కంచెనపల్లి చినవెంకట రామారావుగారి అభ్యుదయ వాదం వ్యాసం అభ్యుదయ సాహిత్యోద్యమ చరిత్రను, దాని జీవలక్షణాన్ని

తెలియచెప్పేది. గురజాడ తరువాత తెలుగుకవిత్వం తిన్నగా ప్రయాణించవలసింది అడ్డమలుపు తిరిగింది; ఫలితమే భావకవిత్వం. భావకవిత్వం వ్యష్టిపేరుతో సమష్టిని మరచింది. వాస్తవికతనుంచి కేవల కల్పనాజగత్తుకు ప్రయాణించింది. జీవితంలో ఉన్నదాన్ని వదిలేసి అందని ఆకాశాల్లో విహరించింది. గతవైభవాన్ని పునరుద్ధరించటానికి కూడా ప్రయత్నించింది. అట్లాంటి సాహిత్యంమీద తిరుగుబాటు ఫలితమే అభ్యుదయ కవిత్వం "ఇతి వృత్తంలోనూ, భావనలోనూ, భాషలోనూ ఛందస్సులోనూ, సంవిధాన శిల్పంలోనూ, తాత్వికతలోనూ పూర్తిగా కొత్తదారులు తొక్కింది." కళ కళకోసమే అనే పలాయన వాదంనుంచి కళ–మానవుడు సాగించవలసిన ఉన్నత ప్రస్థానాల ప్రయోజనానికి పరమార్థంగా నిలిచింది. "మార్క్సిజంలోని ప్రధానలక్షణాలైన భౌతిక వాదం గతి తర్క సిద్ధాంతం, చారిత్రక భౌతిక వాదం, వర్గపోరాటం ఇత్యాదులు అభ్యుదయ కవిత్వాన్నీ సాహిత్యాన్నీ కంఠనష్టంగా ప్రభావితం చేశాయి." శ్రీశ్రీ మొట్టమొదటిసారిగా ఉపయోగించిన 'అభ్యుదయం' పదానికి అభ్యుదయ సాహిత్యోద్యమానికీగల జన్యజనక సంబంధాన్ని ఈ వ్యాసకర్త చక్కగా వివరించారు. అభ్యుదయ సాహిత్యోద్యమంలో వచ్చిన అనేకమందికవులు, రచయితల ఉపజ్ఞను వివరించారు. వారి కవిత్వ మహత్వాన్ని, తాత్విక అవగాహనను స్థూలంగా చెప్పారు. స్వాతంత్ర్య పూర్వకాలానికీ, స్వాతంత్ర్యోత్తర కాలానికీ అభ్యుదయోద్యమ లక్ష్యంలో, లక్షణంలో వచ్చినమార్పును రచయిత ఏ పక్షపాతం లేకుండా చెప్పడం విశేషం. "అభ్యుదయోద్యమానికి సామ్యవాద వాస్తవికత అంతిమలక్ష్యమైనా దానికార్యక్రమంమాత్రం స్వాతంత్ర్య సాధనకు రచయితలందరియొక్క ఐక్యసంఘటనను సాధించి విజయాన్ని సాధించడంవరకూ మాత్రమే పరిమితమైంది." అని చెప్పి అనంతర కాలంలో అభ్యుదయోద్యమ స్థితిని ఈ విధంగా పేర్కొన్నారు, మార్చుకోకుండా ఉన్నకార్యక్రమానికీ, ప్రణాళికకీ, మారిన పరిస్థితులకీ, వైరుధ్యం తల ఎత్తింది. ఈ వైరుధ్యాన్ని పరిష్కరించుకునే ప్రయత్నాలు జరగలేదు. జరిగినా అది కేవలం నామమాత్ర ప్రయత్నాలే కనక విఫలం కాక తప్పలేదు. ఈ ప్రధాన వైరుధ్యం కారణంగా అభ్యుదయ సాహిత్య ఉద్యమంలో స్తబ్దత తలయెత్తింది."

ఆవుల మంజులతగారి హేతువాదం వ్యాసం దాని పుట్టు పూర్వోత్తరాలు, అభిప్రాయ భేదాలు, తెలుగు సాహిత్యంలో హేతువాద ఆరంభ పరిణామ వికాసాలను గురించి విపులంగా చర్చించింది. ఆదిలో వేమనలో కనిపించిన హేతువాద ఛాయలు, గురజాడలో రూపాన్ని ధరించడం, త్రిపురనేని రామస్వామి చౌదరిగారిలో పరిపూర్ణాకృతిని పొందటం ఈమె క్రమపరిణామంలో రాశారు. నార్ల, గోపీచంద్ రచనల్లో హేతువాదం, చలం, ముద్దుకృష్ణ, పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి మొదలైనవారి రచనలను మంజులతగారు ప్రస్తావించారు. చలం, గోపీచంద్‌గార్లు హేతువాదం దగ్గర ఆగలేదు. హేతువాదులందరూ జ్ఞాపకం పెట్టుకొనవలసిన విషయం ఒకటుంది. తమమౌఢ్యంగాని, అజ్ఞానంగాని, దేవుడిపైవిశ్వాసాలుగాని ఏవ్యవస్థారంభంలో పుట్టాయి? అట్లా పుట్టడానికి మౌలికమైన కారణం ఏమిటి? ఆ కారణంలో ఏ మార్పూరాకుండా ఈ విశ్వాసాలను అంతమొందించడం సాధ్యమా? ఈనాడు ధనమే దేవుడు, అదే మతం, అదే కులం, అది ఉన్నవాడే మనిషి. దాన్ని అంటుకోకుండా ఈ మూర్ఖత్వం అంతమయి శాస్త్రీయ అవగాహన పెంపొందాలని కోరుకొనటం హాస్యాస్పదం. ఏ జ్ఞానసముపార్జనకైనా మేధతో పనిలేని ధనం మూలకారణమవుతున్నది. దీన్ని చాలామంది అంగీకరించరు. అంగీకరిస్తే వాళ్ళకున్న ప్రివిలేజ్ వాళ్ళను వెక్కిరిస్తుంది. మంజులతగారి వ్యాసం హేతువాద సిద్ధాంత భావన ఈ దేశంలోనూ, ఇతరేతర దేశాల్లోనూ ఎట్లా వుండేది? ఎట్లా వుంది? అనే అంశాల పూర్తి వివరణను కలిగివుంది. తెలుగులో అధివాస్తవిక కవిత్వం మీద నగ్నముని వ్యాసం కూలంకషమైన చర్చ. డాడాయిజం, అది వాస్తవిక కవిత్వంగా పరిణామం చెందటం, దానికి మూలకారణమైన యూరప్ దేశాల సాంఘిక జీవితం, అందులోని తాత్వికగాఢత మొదలైన అంశాలను నగ్నమునిగారు అధికారికంగా చర్చించారు. అధివాస్తవిక కవితలోని ప్రధానాంశాలను నగ్నమునిగారు క్లుప్తీకరించారు.

1. సమాజం నిర్ణయించిన నీతి సూత్రాలు వీరికి అర్థరహితంగా కనిపించాయి.
2. సమాజంలో కనిపించే సౌందర్యంగాక జుగుప్స వీరికి ప్రధానంగా కనిపించింది.
3. వైచిత్రిని సాధించటమే రచనాలక్ష్యమైపోయింది.
4. ఫ్రాయిడ్ కామవాంఛ సిద్ధాంతం వీరిని అపరిమితంగా ఆకర్షించింది.
5. సుషుప్తావస్థలోని అవ్యక్తం వేపు ప్రయాణం సాగించారు.
6. బీభత్సం వీరి ప్రధాన రసం.
7. అసంపూర్ణ కాంక్షలకు తమ రచనల్లో ప్రాధాన్యత నిచ్చారు.
8. కళ కళకొరకే అన్న అభ్యుదయ విరోధక సిద్ధాంతం దీనికి ప్రోద్బలం.
9. ఇది అరాజక వాదం.

యూరప్ దేశాల్లో వచ్చిన ఈ కళాసాహిత్యవాదం తెలుగు దేశంలో రావలసిన అవసరంలేదని నగ్నముని అభిప్రాయ పడ్డారు. అక్కడున్న సామాజిక పరిస్థితులు వేరు. అట్లాంటి పరిస్థితులు ఇక్కడ లేవు. ఆదినుంచి తెలుగు కవిత్వంలో ఏ క్రొత్త ప్రయోగం చేసినా శ్రీశ్రీ యే చేశాడు. తెలుగులో అది వాస్తవిక కవిత్వానికి లక్షణం శ్రీశ్రీ అయితే లక్ష్యం నారాయణబాబు. అయితే వీళ్ళల్లో ఉన్న సంప్రదాయికత, ధ్వని, చమత్కారం ఉక్తి శబ్దవైచిత్రి వీళ్ళని తాత్త్విక గాఢతనుంచి దూరం చేశాయని, ఏ సాంప్రదాయక ఆలోచనా వాసనల్లేని ఆధునిక అధివాస్తవిక కవి తెలుగులో అజంతా వొక్కడే అని డిలాన్ థామస్, మలార్మే కవిత్వపద్ధతికి అతని కవిత్వం దగ్గరగా వుంటుందని నగ్నమునిగారి నమ్మకం.

నిఖిలేశ్వర్‌గారి అస్తిత్వవాదం వ్యాసం సార్త్రె జీవితాన్నీ, అతని తాత్త్విక ప్రపంచాన్నీ, అతని రచనల్నీ సమీక్షిస్తూ తెలుగు కథ, నవల, కవితల్లో అస్తిత్వవాద ధోరణులు ఏ మేరకున్నాయో పరిశీలించింది. మార్క్సిస్టు దృక్పథంలోంచి ఈ అస్తిత్వవాదాన్ని విశ్లేషించుకుంటూ వచ్చిన వ్యాసమిది. వ్యక్తికీ, వ్యవస్థకీ మధ్య ఘర్షణ ఎప్పుడూ ఉంటుంది. ఈ ఘర్షణలోంచే అనేక సిద్ధాంతాలు ఉద్భవిస్తాయి. రెండో ప్రపంచ యుద్ధానికి పూర్వం, ఆ తరువాత ఫ్రాన్సులో ఉన్న జీవన పరిస్థితులకు మేధావులు రియాక్టు అయ్యారు. అలా రియాక్ట్ అయినవారిలో సార్త్రె ఒకడు. అతడు వ్యక్తికీ, వ్యవస్థకీ ఉన్న సంబంధాన్ని ఆధారంగా చేసిన ఆలోచన ఫలితమే ఎగ్జిస్టెన్షియలిజం. దీనికి సమానార్థకంగా తెలుగులో అస్తిత్వవాదం అనే పదాన్ని వాడుతున్నాం. మనిషి చైతన్యాన్ని మనిషి మనుగడే నిర్ణయిస్తుంది. తన స్థితిగతులకు తానే బాధ్యత వహిస్తాడు కనుక అతనిది అనంతమయిన స్వేచ్ఛ. తన కేది కావాలో తాను నిర్ణయించుకుంటాడు అని అంగీకరించినప్పుడు సంఘ సాధారణ నియమాలతో వ్యక్తి ఘర్షణ పడక తప్పదు. ఘర్షణకు ఒక ప్రయోజనం ఉండాలి. వ్యక్తి తనకోసమే బ్రతికేటప్పుడు, తన మేధ తనకేతప్ప మరొకరికి నిరుపయోగమయినపుడు, తన చుట్టూవున్న సంఘంతో ఎంతమాత్రం నిమిత్తంలేక తాను ఏకాకిగా జీవించేటప్పుడు ఈ అస్తిత్వవాదం అరాచకవాదమే అవుతుందిగాని మరొకటికాదు.

స్మైల్‌గారి వల, ఆర్. ఎస్. సుదర్శనంగారి ఏకాంతం, త్రిపురగారు వ్రాసిన కొన్ని కథలు, గోపీచంద్‌గారి మెరుపుల మరకలు నవల, ఆర్. ఎస్. సుదర్శనంగారి సంసార వృక్షం నవల, మొదలైన రచనల్లోని అస్తిత్వవాద భావ ధోరణులను వివరించారు. చివరకు వ్యాసకర్తే చెప్పినట్లుగా "సాంప్రదాయబద్ధమై అలవాటుగా వున్న సాంఘిక నియమాలను ఒక గొప్ప సామాజికమైన మార్పుకోసం కాలదన్నితే మనం అర్థం చేసుకోవచ్చు. కాని ప్రధానంగా ఏదో అన్వేషించాలనే తపనతో ప్రతిదాన్ని ప్రశ్నిస్తూ శారీరక వాంఛలను విచ్చలవిడిగా తీర్చుకున్నా సంతృప్తి లేక చివరికి వ్యక్తి అరాచకత్వంలోకి — శూన్యంలోకి విసరబడి నిరంతరమైన మానసిక వేదనలో కొట్టుమిట్టాడుతాడు. వ్యక్తి సంతృప్తికి విధి నిర్వహణకు మధ్య సామంజస్యం కుదరనపుడు మిగిలేది అరాచకత్వం." ఇంకా కొన్నాళ్ళలో సాహిత్యంలో మంత్ర, తంత్రవాదం కూడా రావచ్చు. ఆ సూచనలు ఇప్పుడిప్పుడే కనబడుతున్నాయి.

నందిని సిధారెడ్డిగారి అనుభూతివాదం వ్యాసం ఇటీవలి చర్చల సారాంశం. కవిత్వంలో అనుభూతి మాటను తిలక్ ఉపయోగించాడు. కుందుర్తికి, తిలక్‌కి కథా కావ్యాల మీద జరిగిన చర్చ ఇందుకు కొంత దోహదం చేసి వుండవచ్చు. తిలక్‌ను అనుభూతివాదిగా పేర్కొని మొట్టమొదటిగా వ్యాసం వ్రాసింది అద్దేపల్లి రామమోహనరావుగారు. 'అనుభూతివాదం' అనేది ఒక నాన్సెన్సికల్ టరమ్. ఇది కవిత్వంలో ఒక వాదం ఎప్పుడూ కానేకాదు. అనుభూతి లేకుండా కవిత్వం ఎప్పుడూ లేదు. అయితే ఈ అనుభూతి వ్యక్తికి పరిమితమా? వ్యక్తులకు పరిమితమా? అన్నవే ప్రశ్నలు. వ్యక్తివాద కవిత్వంలో ఒక భాగంగా ఈ కవిత్వానికి అస్తిత్వాన్ని కలిగించారు కొంతమంది. మధ్యతరగతి మనస్తత్వం, వ్యక్తివాదం, శుద్ధకళావాదం, ఆనంద లక్ష్యం, ఉనికి లేదా మేధావి వాసనలు, అత్యాధునికుల మనిపించుకోవటం, పరిస్థితుల సానుకూల్యం, పత్రికల ప్రోత్సాహం, శిల్పదృష్టి ఈ రకమైన కవిత్వం తలెత్తటానికి కారణాలుగా రెడ్డిగారు పేర్కొన్నారు. ఈ కారణాల విశ్లేషణ కూడా ఈవ్యాసంలో బాగానే సాగింది. "ఒకరిది వైజ్ఞానిక నాయకత్వం, ఒకరికి దుఃఖమే సార్వకాలికం, సార్వజనికం, ఒకరిది శుద్ధతత్వం, ఒకరిది ఏ తత్వమూ కాదు." ఇట్లాంటి వారంతా ఒక గొడుగు క్రిందకు జేరారు.

చైతన్య స్రవంతి ప్రక్రియ దాని పుట్టుక, జేమ్సుజాయిస్ రచనా శిల్పం, ఫ్రాయిడ్ మనస్తత్వ శాస్త్రం ఈ కొత్త ప్రక్రియకు ఎలా కారణమయిందీ నవీన్ సాకల్యంగా చర్చించటం జరిగింది చైతన్య స్రవంతి అనే వ్యాసంలో. అతి క్లిష్టమైన మానవ మనస్సంచారాన్ని చిత్రించాలన్న కొందరు రచయితల తపనే చైతన్య స్రవంతి నవలకు దారి తీసిందని రచయిత చెబుతున్నారు. డి. ఎమ్. రిచర్డ్‌సన్, వర్జీనియా ఊల్ఫ్ మొదలైన రచయిత్రులు, జేమ్సుజాయిస్, లారెన్సు, హక్సలే మొదలైన రచయితల్లోనూ ఈ చైతన్య స్రవంతి మార్గం ఆరంభము, పరిపుష్టము అయింది. తెలుగులో శ్రీశ్రీ చరమరాత్రి కథాసంకలనంలోని కోనేటిరావు కలల్లో, బుచ్చిబాబు చైతన్య స్రవంతిలోనూ మొదటిసారిగా ఈ ప్రక్రియ రూపుదిద్దు

కున్నది. అనంతర కాలంలో, నవీన్, వినుకొండ, నాగరాజు మొదలైన వారిలో ఈ ప్రక్రియ సంపూర్ణంగా కాక పోయినా కొంతవరకైనా పొడగట్టింది. అంతకు పూర్వం తరంలో రావి శాస్త్రి, గోపీచంద్ లాంటి రచయితల్లో - అనుకొని రాసినా అనుకోకుండా రాసినా ఈ ఛాయలున్నాయి. ఈ వ్యాసంలో నవీన్ ఈ ప్రక్రియా సంవిధానాన్ని గురించి సూక్ష్మాంశ పరిశీలన చేశారు. "ఈ తరహా సాహిత్యాన్ని జాయిస్ లాగానో, లేక వర్జీనియా ఊల్ఫ్ లాగానో ఒక నిరంతర మైన తపస్సులా భావించి కృషి చేసిన తెలుగు రచయిత లెవరూ లేరు. ఈ శిల్పం యొక్క అన్ని లోతుల్ని శోధించి ఆఖరు అంచుల వరకూ వెళ్ళాలని ఏ రచయితా ప్రయత్నించినట్టు కనిపించదు." అన్న నవీన్‌గారి అభిప్రాయం అక్షర సత్యమైనది.

ఆధునిక తెలుగు సాహిత్యంలో విప్లవ వాదం అనే విషయంపై చేకూరి రామారావుగారు ఆలోచనాత్మకమైన వ్యాసం రాశారు. ప్రోగ్రెసివ్ రైటర్స్ అందరూ అభ్యుదయ రచయితల సంఘం గొడుగు క్రింద ఉన్నప్పుడు హైదరాబాద్‌లో 1970 లో సెవెన్ స్టార్ సిండికేట్ వారు ఏర్పరచిన అభ్యుదయ సదస్సు నుంచి ఈ నాటి వరకు రచయితల్లో, వారి ఆలోచనా సరళిలో వచ్చిన మార్పులను పరిణామ క్రమంలో రామారావుగారు వివరించారు. వి. ర. సం. ఏర్పడిన పరిస్థితులూ విప్లవ రాజకీయాల్లో, దాని నాయకత్వంలో వచ్చిన భేదాలు వి. ర. సం. లోనూ సంభవించాయని చెప్తూ వి. ర. సం. ఏర్పడినప్పట్నించీ ఇప్పటి వరకూ దాని స్వరూపాన్ని, స్వభావాన్ని విశ్లేషించారు. తెలుగు సాహిత్యంలో అంతకు ముందున్న రూపవాద, అయోమయ వ్యక్తివాద సాహిత్య పద్ధతులమీద విప్లవ వాదం విజయాన్ని సాధించిందని రామారావుగారు అంగీకరిస్తున్నారు. వి. ర. సం. కవిత్వ రూపంలో, విమర్శ రూపంలో సాధించిన విజయాన్ని వచనంలో ఇంకా సాధించలేక పోతున్నది. మధ్యతరగతి కవిత్వాన్ని వాళ్ళకే వదలి పాణిగ్రాహి సుబ్బారావు పాటలు, వంగపండు, గద్దర్ పాటలు శివసాగర్ పాటలు శ్రామిక జన హృదయాల్లోకి వాళ్ళ సంస్కారం లోనే ప్రవేశిస్తున్నాయి. జననాట్య మండలి కూడా తన కళా రూపాల ద్వారా ప్రజలను విప్లవాభిముఖులను చేస్తోంది. ఏమైనా వి. ర. సం. దశాబ్ది చరిత్రలో గణనీయమైన ప్రగతిని సాధించింది. విప్లవవాద సాహిత్య భవిష్యత్తును గురించి, దాని ప్రభావాన్ని గురించి రామారావుగారు నిశిత పరిశీలనా దృష్టితో వెలిబుచ్చిన అభిప్రాయం యథార్థానికి అది సమీపంలో ఉంది. "విప్లవవాద రాజకీయాల భవిష్యత్తుమీద విప్లవసాహిత్య భవిష్యత్తు ఆధారపడివుంది. అఖిల భారత స్థాయిలో పనిచేస్తున్న విప్లవ రాజకీయ పక్షం దేశంలో లేదు. తమ తమ ప్రభావాల్ని కొన్ని పరిమిత ప్రాంతాల్లో ప్రసరిస్తున్న విప్లవ రాజకీయాల గ్రూపులున్నై. ఈ గ్రూపుల మధ్య పరిష్కారం కనుచూపు మేరలో లేని వైరుధ్యాలున్నై. ఇవి కొన్ని చోట్ల సాహిత్య సంఘాల్ని విడదీస్తున్నై. మరి కొన్ని చోట్ల యధాస్థితి వేర్పాటు ధోరణులను కొనసాగిస్తున్నై. ఈ పరిస్థితుల్లో సాహిత్యంలో విప్లవవాద ధోరణుల భవిష్యత్తును ఊహించటం ఏమంత ఫలవంతమైన పనికాదు."

ఆధునిక తెలుగు సాహిత్యంలో సంప్రదాయ వాదం అనే వ్యాసం ముకురాల రామారెడ్డిగారిది. ఈ శీర్షికే విషమం అనుకుంటే ఈ వ్యాసం మరింత విషమంగా ఉంది. ఈ వ్యాసకర్తకు ఆధునికం తమాషాగానూ, సంప్రదాయం తడాఖాగాను కనబడటంలోనే ఈ విషమ దృష్టి అరంభమైంది. పైగా ఆధునికం కాలవాచి అని చెబుతున్నారు. నవ్యత, సమకాలీనత, ఆధునికత ఈ మూడు పదాలకీ ఒకే అర్థం ఇచ్చే సాహిత్య కారులు మనకు కొరత కాదు. అట్లాంటి వారిలో రామారెడ్డిగారు కూడా ఒకరని ఈ వ్యాసం అక్షరాక్షరం ఋజువు చేస్తున్నది. 'ఆధునికం పేరుతో భారతీయులు సృష్టించినది మృగ్యం. ఆధునికత కవిత్వంలో కూడా పాశ్చాత్యుల నుంచి దిగుమతి చేసుకొన్నదే' అంటున్నారు వ్యాసకర్త. భారతీయ భాషలన్నింటి సంగతి నాకు తెలియదు గాని తెలుగు సాహిత్యం ఆధునికత పేరుతో సాధించినదంతా శూన్యమేనా? ప్రతిధ్వనే కాని ధ్వని లేదా? 'సామాన్య వ్యక్తులను, కార్మికులను పాత్రలుగా స్వీకరించడం ఇప్పుడున్నది. కాళిదాసు మేఘసందేశం వంటి కావ్యాలలో పూర్వమున్నది' అని భావించేవారికి ఆధునిక సాహిత్య మూల తత్వం ఎప్పటికైనా బోధపడుతుందా? గురజాడ పూర్ణమ్మ కథలో చివర నాలుగు పాదాలు కూడా ఈ వ్యాసకర్తకు 'పాత' గానే కనిపించాయి. బుద్ధావధాన్లు గూడా అన్ని వేదాల్లోనే ఉన్నాయని అనుకున్నాడు. ఇంతకు మించి ఈ వ్యాసాన్ని గురించి ఏమీ రాయనక్కర్లేదు.

గోపాల చక్రవర్తిగారి రూపవాదం వ్యాసం ఆధునిక కవిత్వ పరిణామాన్ని వస్తుపరంగానూ, రూపపరంగానూ సక్రమంగా అంచనా కట్టిన వ్యాసం. కవిత్వంలో వస్తువు, రూపమూ రెండూ ప్రధానమైనవే. పూర్వకాలంలో వస్తు విమర్శ అట్టేలేదు గనుక శిల్పవిమర్శే సాహిత్య సమస్తమూ అయింది. ఈనాడు వస్తువు ప్రధానం అంటే రూపం, దాని శిల్పనిర్మాణం అప్రధానమని అర్థం కాదు. వస్తువు ఎంత ఉత్తమమైనదైనా దాని రూపం సరిగా లేకపోతే చూడలేం. ఆధునిక కవిత్వం మేరకు వస్తువు

రూపాన్ని అన్వేషిస్తుంది. కేవల రూపవాదమనేది కళ కళకోసమే అనే వాదానికి సంబంధించినది. "శైలికీ, శిల్పానికీ, ధ్వనికీ సున్నా చుట్టి వట్టి పదాలు కూర్చి దీంట్లో వస్తువుకి ప్రాధాన్యం ఉంది" అంటే ఎవరూ కన్విన్స్ కారని గోపాల చక్రవర్తిగారు చెప్ప టంలో వినాదం కవిత్వం కాదనే అతరార్థం ఉంది." కవితా సంవి ధానంలో క్లిష్టత తొలగించి చెప్పదల్చుకున్నది స్పష్టంగా చెప్ప గలగడం చేపట్టిన కవితా వస్తువుకి మరే వేషాలు తగిలించకుండా ప్రగతి వాదాన్ని మాత్రమే జోడించడం నేటి కవికర్తవ్యం. ఇదీ నా వాదం" అని తన భావాన్ని స్పష్టంగా చెప్పారు గోపాల చక్రవర్తిగారు.

జనామోదవాదం, లేక ధోరణి - దేవీప్రియగారి వ్యాసం వర్తమాన సాహిత్యంలో ఉన్న వ్యాపార దృష్టిని బహిర్గతం చేసే వ్యాసం. ఒక్కొక్క రచయిత కుండే పాపులారిటీ ఒక్కొక్క రకంగా ఉంటుంది. రావి శాస్త్రిగారికీ, శివసాగర్ కీ ఉండే పాపులారిటీకి, ఎవరో ఒక (ప్రసిద్ధ) రచయిత్రికీ ఉండే పాపులారిటీకి తేడాఉంది. రావి శాస్త్రిగారికీ, (ప్రసిద్ధ) రచయిత్రికీ ఒకే రకం పాఠకులు ఉండటం అసంభవం. రావి శాస్త్రిగారిని మెచ్చుకునే పాఠకులు (ప్రసిద్ధ) రచయిత్రిని మెచ్చుకోరు. దానికి కారణాలు నేను చెప్ప నవసరం లేదు. వ్యాపార సంస్కృతిలో జీవించే మనిషికి కళ కూడా వ్యాపారంగా కనిపించటంలో తప్పు లేదు. రచయిత డబ్బుకోసం రాస్తున్నాడు. సంపాదకులు సర్క్యు లేషన్ కోసం వేస్తారు. ఇద్దరిలో ఎవరిది దోషం అంటే ఎవరు చెబుతారు? అసలు పాఠకుల పాత్ర యేమిటి? దీన్ని ఎవరూ ఆలోచించరు. ఎవరైనా వారి వ్యాసంలో రచయితల్ని దూషించ డానికి సాహసిస్తారు; సంపాదకుల్ని దూషించడానికి సాహసిస్తారు. కాని చౌకరకపు అభిరుచులతో, చౌకరకపు సాహిత్యాన్నే మహో త్తమ సాహిత్యమని, సంచలనాత్మక సాహిత్యమని విరగబడి చదువుతున్న పాఠక లోకాన్ని ఏమనటానికీ సాహసించరు. (అంటే తంతారని భయమేమో!) దేవీప్రియగారు ఈ వ్యాసంలో చర్చిం చిన అంశాలు చాలాకాలం నుంచీ చాలా మందిని వేధిస్తున్నవే. మరో సారి వారు వెలుగులోకి తెచ్చారు. "పాపులర్ కావడానికి, సభల్లో చప్పట్లు కొనుక్కోడానికి పనికివచ్చే అంత్య ప్రాసల గారడీ, కార్టూను కవితా పద్ధతులను ఉదాత్త సాహిత్య విలువలుగా పాఠ కులు, శ్రోతలు భ్రమపడకుండా వారిని హెచ్చరించవలసిన బాధ్యత కూడా విమర్శకులదే" అంటున్నారు దేవీప్రియగారు. దేవీప్రియ గారు కూడా ఇటీవల రోజువారీ కార్టూన్ కవిత్వంలో పడ్డారు. వారిని ఎవరు హెచ్చరించాలి?

ఈ సంకలనంలోని వ్యాసాలన్నీ పరిశోధనాత్మకమైన వ్యాసాలే. ఆధునిక సాహిత్యాన్నీ, దానిగమనాన్నీ శ్రద్ధగా అధ్య యనం చేస్తున్న వారు ఈ గ్రంథాన్ని చదివితీరవలసిందే. తెల షర్టుమీద నల్లటి గీతలా ఒక్క ముకురాల రామారెడ్డిగారి వ్యాసం మాత్రమే కనబడుతుంది.

సంపాదకులు:- కె. కె. రంగనాథాచార్యులు
వెల:- రూ. 10-00లు
ప్రతులకు:- ఆంధ్ర సారస్వత పరిషత్, తిలక్ రోడ్, హైదరాబాద్.



(48 వ పేజీ తరువాయి)

వన శిఖావళము విప్పిన పింఛమును, దడి
తుడుతునే యని కొప్పు విడుచు మౌని
యిట్టిముంగిటనిల్వ నేమి చూపులేయంచు
నతివ చెక్కిలి ముద్దులాడు మౌని.

యాకు గదల భయమటంచు దనకును
నువిద కౌగిలింత నొదగు మౌని
మౌని మౌని కాదు మమతచే వాచాల
సార్వభౌముడయ్యె .... ....

అహరహమూ అతనికి కావలసింది ఆమె సామీప్యం, కౌగిలింత. అడవి గదా! కోకిలలు కూయకుండా ఉంటాయా! కూస్తే చాలు, విశ్వామిత్రుడికి పరమ సంతోషం. "మేనకా పిలిచావా!" అంటూ దగ్గరికి చేరతాడు తుమ్మెద ఝుమ్మంటే "ఏమి మణితమే" యని మేనకతో పరిహాసాలు. నెమలిపింఛ మార వేసుకుంటే మేనకతో "నీ కేశపాశం తుడిచేదా" అని కొప్పు విప్పుతాడు. అడజింక కనుపిస్తేచాలు "ఏం చూపులే మేనకా!" అని పరియాచకములు. ఆకు కదిలితే చాలు "అమ్మో నాకు భయం" అంటూ ఆమె కౌగిలిలో ఒదిగి పోతాడు. అడవిగదా! ఆకు కదలని క్షణం ఉంటుందా! అంటే విశ్వామిత్రులవారికి అనుక్షణం మేనకా పరిష్వంగం. ఇక్కడ అన్యాపదేశంగా "ఆమె మాట కోకిలకూత; ఆమె పాట తుమ్మెద ఝుంకారం. ఆమె కేశ పాశం నెమలిపింఛం. ఆమె కన్నులు లేడి కన్నులు" అని చెప్పడంలో ఈ పద్యంలోని సౌందర్యమంతా నిక్షిప్తమై యున్నది. మేనకా విశ్వామిత్రంలో విశ్వనాథ సంయోగ శృంగార రసపోషణకు తనకు దొరికిన అవకాశాన్ని సావకాశంగా వినియోగించుకున్నాడు.

అనుక్షణం ప్రణయ సల్లాపాలు. శృంగార క్రీడా వినోదాలు ప్రేమోద్యానాలు కుసుమింప జేయు దోహదాలు.

తన పాదమామె పాదము జతగా బెట్టి
యస్మత్పదంబు మోటని వచించు.
తనహస్తమామె హస్తము మీద బోర్లించి
నీ చేయి లేదని నిహ్నవించు.
నామె ప్రక్కగ నిల్చియగు నా బుజము దాక
వచ్చితివే యని పలువరించు.
చెక్కిలి చెక్కిలి జేర్చి గడ్డము గ్రుచ్చు
కొన్నదా యని గుచ్చి గుచ్చి యడుగు.

విశ్వామిత్రుడు మౌని. అది ఒకప్పటి మాట. ఇప్పుడు మేనక కౌగిలిలో వాచాల సార్వభౌముడైనాడని విశ్వనాథ వ్యాఖ్య. ప్రతి పద్యంలో ఒక ప్రణయ చిత్రం. రసహృదయులకు అనుభవైక వేద్యం.

ఆరు ఋతువులూ ఆమని. అన్నిరాత్రులూ శరజ్జ్యోత్స్నలు. పాపం! రాత్రులు వారికి నిద్రికరవైంది. కారణం? "పంచలను గాపుగానున్న పంచబాణు చాః నిస్వనములు" నిద్ర పోనిస్తాయా!

ఈ మధుమాసం ఒక పదేళ్ళపాటు సాగింది.

చివరకు కళ్ళు తెరచిన విశ్వామిత్రునకు తానెంత పతనమైందీ అర్థమైంది.

"కోరి ప్రత్యక్ష మన్మథ గురువవైతి
కోరక పరోక్ష వైరాగ్య గురువవైతి"— అని

మేనకకు వీడ్కోలు చెప్పాడు.

ఏదైనా అవధులు దాటితే మొహం మొత్తుతుంది. మితిమీరిన శృంగారం వైరాగ్యానికి దారితీస్తుంది. విశ్వామిత్రుడు 'శృంగారముతోనే కామాన్ని జయించాడు' అని చమత్కారంగా సమర్థిస్తాడు విశ్వనాథ.

బాలకాండం నుంచి ఈ ఘట్టాన్ని విడిగా తీస్తే ఒక రసవంతమైన విశిష్టమైన ఖండ కావ్యంలా భాసించేలా రచించాడు విశ్వనాథ.

శతానందుడి ద్వారా మేనకా విశ్వామిత్రుల గాథ విని రాముడు లక్ష్మణునితో అంటాడు.

"ఈ ఋషు లెవ్వరు చెప్పిన
సార కథా కథన మొక్క చాయనె నడచున్.
వీరంతర్ద్రష్టులు బహు
ధా రూపిత సూక్ష్మతర కథాంశులు సుమ్మీ!"

"నీ వింకొక్క సంగతి జూచినావె వత్స
అన్ని యంశమ్ములను జెప్పినట్టి తీరు
వేఱు; మేనక కథ తీరు వేఱుగాదె"

ఈ మాటలు రాముడు శతానందుణ్ణి ప్రశంసిస్తూ అన్న మాటలుగా విశ్వనాథ చెప్పదలచుకున్నా పరిశీలనగా చూస్తే విశ్వనాథకే వర్తిస్తాయి. కళాపూర్ణోదయంలో నారదుడు మణికంధరుణ్ణి ప్రశంసిస్తూ "భళిరా సత్కవి వౌదు" అనే పద్యాన్ని

స్ఫురింప జేస్తాయి పై మాటలు. ఎందుకంటే అక్కడ సత్కవి ''సూరన''. ఇక్కడ సార కథా కథనం గావించిన ఋషి ''విశ్వనాథ''.

అన్ని అవరోధాలనూ అతిక్రమించి విశ్వామిత్రుడు ఇతో ధికమైన దీక్షతో తపస్సు కొనసాగిస్తాడు. బ్రహ్మ ప్రత్యక్షమై నీవు ''బ్రహ్మర్షివైనావు'' అని పల్కగా ''ఈ మాటలు వశిష్ఠుని నోట వినాలి'' అంటాడు విశ్వామిత్రుడు. వచ్చిన వశిష్ఠుడు ''నీవు బ్రహ్మర్షివే నిక్కంబు సందేహమింతలేదు'' అనగా, అప్పడానంద పులకిత చిత్తవీధిగల గాథిసూతి బ్రహ్మర్షియైన వశిష్ఠుని కౌగలించు కొనెను.

''గాథి సూతి వశిష్ఠుని కౌగలించె
గాథి జాతు వశిష్ఠుడు కౌగలించె
శివుని శ్రీపతి శ్రీపతి శివుడువోలె''

శ్రీమహావిష్ణువు- శివుడు ఒకరినొకరు కౌగలించుకున్నరీతిగా వశిష్ఠ, విశ్వామిత్రులు ఒకరినొకరు ఆలింగనం చేసుకున్నారు. మహోదాత్తమైనఉపమానం. అరిషడ్వర్గములను జయించి బ్రహ్మర్షి పదవి నధిష్ఠించిన వారిరువురు భగవంతులు- పరమేశ్వరులు అని చెప్పుటకు ఇంతకన్న విశిష్టమైన ఉపమానం మరేముంటుంది? విశ్వనాథకు గల సముచితమైన అలంకార ప్రయోగ ప్రజ్ఞకు ఇంత కన్న మరో ఉదాహరణ అనవసరం.

ఈ ఘట్టంలో మరొక ఉపదేశం- బ్రహ్మర్షి ఎవరు కాగలడు? అన్నప్రశ్నకు సమాధానంగా ''అరిషడ్వర్గాలను పూర్తిగా జయించినవారు'' అని సోపపత్తికంగా కాంతాసమ్మితంగా చెప్ప బడింది.

''కావ్యమ్ యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనివృత్తయే కాంతాసమ్మిత తయోపదేశయో''॥

అనికదా లాక్షణికులు చెప్పిన లక్షణం- అందుకు లక్ష్యం ఇక్కడ లభిస్తుంది.

... ... ... ...

శివధనుర్భంగ నిమిత్తం శివధనువు సభలో ఉంచబడింది. మందహాసాభిరామాస్య మండలుడగు శ్రీరామచంద్రుడు కౌశికుని వంకగాంచి, అనుమతి గ్రహించి, శివధనువును తాకబోయి పై యంతస్తున అంతఃపురస్త్రీల కదలిక గుర్తించి తలయెత్తి చూశాడు.

ఇదమిత్థమని నిర్ణయింపగా రాని దే
కోర్కియో రూపు గైకొన్నయట్లు
జన్మ జన్మాంతర సంగతమ్మైన యా
శా బలం బవధికి సాగినట్లు
ప్రాణముల్ బయటకు వచ్చి ముగ్ధాకార
మెనయించి దర్శన మిచ్చినట్లు
తన సృష్టిలోని యుత్తమ భావ మానంద
ముగ బింబమై పొడిచినట్టు.

లల యరుంధతియును; అహల్యయును, గోస
లాత్మజయు ముప్వురి యాననముల
కన్నను పవిత్రియగుచు శృంగార భావ
మెనసి పుట్టిన ముఖచంద్రు డొకడు తోచె.

ఎదలోపలి ఎదలో ఏదో ఒక కోర్కె రూపుదాల్చి స్త్రీ రూపున పైన కనుపించినది. జన్మజన్మాంతర బంధంగల ఒక స్త్రీమూర్తి కనిపించినది. తన జీవమే ముగ్ధాకారం పొంది దర్శన మిచ్చింది. సృష్టిలోని సమస్త ఉత్తమత్వము స్త్రీ యాకృతిగ దర్శనమిచ్చింది. ఆ స్త్రీమూర్తి మోములో అరుంధతి, అహల్య తల్లికౌసల్యల వదనములకన్న పవిత్రమైన ముఖమండలం ప్రస్ఫు టంగా కానుపించింది రామచంద్రునకు. అది దంపతుల అవిభాజ్య మైన సంబంధమును విశ్వనాథ మహోత్తమంగా దర్శనమిప్పించారు.

... ... ... ...

మగపెండ్లివారు అయోధ్య నుండి ప్రయాణమై మిథిలకు వెళుతున్నారు. శాంతా ఋశ్యశృంగులు వచ్చి మార్గ మధ్యంలో వీరితో కలసినారు. ఎట్లు?

"శబరి పాయ గోదావరి కెక్కినట్లు వారు వీరు కలసికొని నంత"— రామకళ్యాణ మహదానంద సంద్ర న కలియజేరు నదులవి. భద్రాద్రిలో రాముడు కొలువైనాడు. రామకథ తెలుగు వారి రక్తంలో కలసి పోయింది. విశ్వనాథ పై ఉపమానంతో దానిని మిక్కిలిగ సహజ మొనర్చినాడు.

... ... ... ...

సీతారాములు కళ్యాణ వేదికపై ముత్యాల తలంబ్రాలు పోసుకుంటున్నారు.

చంద్రరేఖపైని సన్నని తెలిమొయి
ళ్ళాడినట్లు ముత్తియమ్ము లాడె.
దల్లి మేని పైన నల్లని యాకాశ
మట్లు రామచంద్రు డందెయుండ.

రామచంద్రుని శరీరం వినీలగగనం - సీతాముఖ మండలం చంద్రబింబం - ముత్యాల జల్లు తెలిమొయిలు. విశ్వనాథ కలం గీచిన చక్కని పదచిత్రం.

... ... ... ...

కళ్యాణ ఘడియలు ఇంకా పూర్తికాలేదు. కాళ్ళకు పారాణి, ఒంటిపై పసుపు బట్టలుండగనే రామునిలో చిత్రంగా వైరాగ్య భావనలు చోటు చేసుకున్నాయి. తల్లితో అంటాడు....

"అమ్మా ! దేహమనన్ విచిత్రమగు దుఃఖారామ మన్పించు, దే
హమ్మున్నంతన జీవి పొందనగు బాధాసహ్యతల్ చెప్ప శ
క్యమ్మా ! యొక్కొకజీవి యొక్కొకవిధంబై పొందు దుఃఖమ్ము, రా
జ్యమ్మో ! రాణియొ ! కాననంబొ ! ఋషిభార్యా రత్నమో !
చెప్పగన్."

సీత జీవితంలో ప్రవేశించగనే రాముని నోట భావిజీవిత ఘటనలు పలికించడంలో విశ్వనాథకు రాముణ్ణి కళ్యాణ రాముని కన్న అసుర సంహార రామునిగా చూడాలన్న తహతహ ఎక్కువగా కాన వస్తున్నది.

సీతారాములయోధ్యలో గడపిన కాలంలో రాముని హృదయంలో వియోగ శృంగార భావనలు నీలినీడలవలె కదలాడుట గమనార్హము. భావిజీవనము నందలి సీతావియోగమునకై రామ హృదయము శిక్షణ పొందుచున్నదనిపించును. రామ హృదయంలో వైరాగ్య సంసార భావనలు ప్రయాగ క్షేత్రస్థ గంగా యమునల వలె సీమ ప్రసార రమ్యంబులై భాసిల్లు చున్నవంటాడు విశ్వనాథ. అందుకే సీతతో ప్రణయ సల్లాపములు చేస్తూనే అకస్మాత్తుగా.......

"ఆమె ప్రక్కన నిల్చి యానుకొమ్మని నన్ను
విడిపోకవే యని విరిసిపోవు"—

"ఒక్క సమయాన మనకు వియోగమైన
ప్రేమ యేమగు నంచు .... ...."పలుకు.

"సంయోగ వియోగాలు జీవితానికి బొమ్మా - బొరుసూ వంటివి. దేహం ఉన్నంతసేపూ జీవి పొందవలసిన సుఖదుఃఖాలు అనుభవించక తప్పదు" - అన్న సందేశాన్ని లీలగా విన్పింప జేస్తాడు విశ్వనాథ. ఇవ్వాళ కళ్యాణ రామునిగా సీతాదేవితో గడపే రోజులే కావు. రేపు సీతావియోగంలో అనుభవించబోయే దుఃఖం గూడా ఉన్నది. సుఖదుఃఖాలను సమానంగా స్వీకరించిన వాడే జ్ఞాని. జ్ఞాన రామునిలో వియోగ, సంయోగాల ఖేదమోదాలను సమదర్శన మిప్పిస్తున్నాడు విశ్వనాథ.

... ... ...

అచ్చమైన అమృతమును అసురులు తాగారో, లేదో కానీ అదృష్టవంతులైన ఆంధ్రులు మాత్రం విశ్వనాథ కవితామృతమున పొందగలిగారు. కల్పవృక్షాన్ని చదివిన ఏ పాఠకునికైనా "విశ్వనాథ కారణజన్ముడు" అన్న భావన అవశ్యం కలుగుతుంది. అక్షయమైన రామాయణ సుధాభాండాన్ని ఆంధ్రజాతి కందించి, ఆంధ్ర సాహిత్యోద్యానంలో రామాయణ సురద్రుమాన్ని నాటి ఉజ్జ్వల చరిత్రగల మన భాషకు మాదురీ మహిమను ఇబ్బడి ముబ్బడి గావించిన ధన్యజీవి "విశ్వనాథ." "తా జేసిన తండ్రియాజ్ఞ జీవుని వేదన రెండు నేకమై తన సకలోహ వైభవ సనాథమునైన రామ కథను ఈ జాతి చేసుకున్న ప్రాక్తన పుణ్యఫలం వల్ల రచింప బూనాడు" ఇది ఆ మహా తపః ఫలము.

అసాధారణ పాండిత్య ప్రకర్ష: మహత్వ కవిత్వ సంపద గల ఆ బ్రహ్మీమయమూర్తి రచనకు వ్యాఖ్య చేయ బూనడం... "మందః కవయశః ప్రార్థీ."

అయినా బుద్ధిచాపల్యంతో చేసిన ఈ ప్రయత్నం కేవలం సూర్యుణ్ణి దివిటీతో చూప యత్నించి నట్లేగదా ! సంప్రదాయ కవిత్వ మంటేనే అర్థం లేని ఏహ్యతకలిగి, అందునా విశ్వనాథ అంటేనే అకారణ ద్వేష భావం పెంపొందించుకునే ధోరణి గల వారెవ్వరైనా బాలకాండం నుండి చూపబడిన ఈ కొద్దిపాటి కవితా సౌందర్యాన్ని ఆసరాగా తీసుకుని - కల్పవృక్ష పఠనాసక్తి కలిగి ఆ కవిత్వ మందాకినిలో తమ దాహం తీర్చుకోవడానికి ప్రయత్నించాలన్న తపనే ఈ ప్రయత్నం.

కల్పవృక్ష పీఠికలో విశ్వనాథ అన్నట్లు సుకవి వాచ్య శబ్దుడు వాల్మీకి ఒక్కడే. ఆయన ఋణం ఎన్ని జన్మలకైనా యీ ప్రపంచం తీర్చుకోలేదు.

"ఈ సంసార మిదెన్ని జన్మలకు గానీ
మౌని వాల్మీకి భాషా సంక్రాంత ఋణంబు దీర్పగలదా,
సత్కావ్య నిర్మాణరేఖా సామగ్రి ఋణంబు దీర్పగలదా!"

అని విశ్వనాథ ప్రశ్నించు కున్నట్లుగనే...

ఈ తెలుగుజాతి విశ్వనాథ ఋణాన్ని ఎన్ని జన్మలకు తీర్చుకోగలదు ?

ఆ అలఘుస్వాదు రసావతార ధిషణాహంకార దోహల బ్రహ్మీమయమూర్తి మన ఆంధ్ర భాషలో మహాకవిగా జన్మించుటచే మన తెలుగు జాతికి ఉండే ఆ వ్యోమపేశల చాంద్రీ మృదు కీర్తి మరే జాతికీ, భాషకు ఉండదు.



డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

# క్రొత్త మలుపు

నడినెత్తి మీద సూర్యుడుమండిపోతున్నాడు. ప్రొద్దుట్నుంచి ఏమిలేక నా ఆత్మారాముడు మాడిపోతున్నాడు. ఆ వేడి వాతావరణం దుర్భరం. ఆ బస్‌స్టాండు ఆవరణం అయోమయం.

"సార్ ! రిక్షా కావాలా !" - అంటూ చెమటలు క్రక్కుకొంటూ ఒగరుస్తున్న రిక్షావాడు.

మూటలు దింపుతూ నానాఅవస్థపడుతూ ఆయాసపడుతున్న ఒంటెద్దు బండివాడు.

సత్తువనంతా కూడదీసుకొని పళ్ళు బిగబట్టి లారీలోడ్ చేస్తున్న కూలీవాడు.

స్క్రూ-డ్రైవర్‌లు, స్పానర్‌లు, మంకీప్లేయర్‌లు వగైరాలతో నానా హైరాణా పడిపోతూ బస్ రిపేరు చేస్తున్న మెకానిక్కు.

కడపా కోడూర్రంటూ అరుస్తున్న బ్రోకర్లు.

కబుర్లు చెప్పుకొంటున్న కాలేజీ కుర్రోళ్ళు.

"బూట్ పాలిష్ సార్ !"- అంటున్న కాకీలాగువాళ్లు.

లాఠీకర్రెను త్రిప్పుకొంటూ వస్తున్న ఎఱ్ఱటోపీ వాళ్ళు.

"షిరిడిసిద్ధి సాయిబాబా" - పాట పాడుతున్న కళ్లలేని కబోది.. పడుతూ లేస్తూ.

"ఆపద మ్రొక్కులవాడా ! ఓశ్రీనివాసా !" అంటూ వేడుకొంటున్న దిక్కుతేని అనాథ, చంకలో చంటిబిడ్డతో.

"సోడా ! సోడా ! చల్లని సోడా ! నిమ్మకాయసోడా కావాలా బాబూ !" - సోడా వ్యాపారం చేస్తున్న పచ్చబనీనోడు.

"ఐస్‌క్రీమ్ ! కప్ ఐస్‌క్రీమ్ ! ఒంటికి చలువ ! పాపా ! తీసు కోమ్మా" - ఐస్ అమ్ముతున్న బట్ట తలవాడు...

తల పట్టుకొన్నాను ఉస్సూరు మంటూ 'ఇంటికెళ్ళేదాకా నిలుస్తుందా యీ ప్రాణం' - అనిపించింది.

"పువాఁ ! పువాఁ !"-హారన్లు తెగమ్రోగుతున్నాయి.

"డ్రాయ్ఁ ! డ్రాయ్‌య్ఁ!"-పొగలు వదుల్తున్నాయిబస్సులు.

సీట్లకోసం బస్సు కిటికీలనుండే 'కర్చీఫ్' లు విసిరే ముందు జాగ్రత్త ఉన్నవాళ్ళు.

బస్సెక్కే ప్రయత్నంలో ఒకర్నొకరు త్రోసుకొంటూ 'నువ్వా, నేనా' అన్నట్లు కొట్టుకొంటున్న వాళ్ళు.

సందు దొరికితే చాలనుకొంటున్న జేబు దొంగమోళ్లు.

టైమ్ వేస్ట్ చేయకుండా త్రోసుకొచ్చే 'అడ' పిచ్చోళ్ళు.

ఆదరా బాదరా పెట్టె బేడా సర్దుకొంటూ పరిగెత్తుకొస్తున్న పల్లెటూరోళ్ళు.

కదుల్తున్న బస్సులకు వీడ్కోళ్ల చెప్తున్న అతి మర్యాదస్థులు, అభిమానస్థులు, అదో అలవాటుగా ఉండేవాళ్లు.

కొళాయిపంపు దగ్గర 'రాని' నీళ్ళకోసం నిలబడ్డ అశాజీవులు.

'పని చెయ్యని' లైట్ మిషన్‌లో పదిపైస లేసి 'రాని' టికెట్ కోసం ఎదురు చూస్తున్న బుర్రమీసాలోళ్లు .. ....

కళ్ల మూసుకొన్నా నొక్క క్షణం
ఎన్ని రకాల మనుషులు !
ఎన్ని విధాల మనస్తత్వాలు !

ఎవర్నీ పట్టించుకోరు. ఎవరి ధోరణి వారిదే. 'నా' అనే ఆలోచనే అందర్లోనూ. 'నీవా' అనే పరామర్శ ఆ తరువాతే.

ఇదే నాకు తెలిసిన 'పిటియబుల్ ట్రాజెడి అఫ్ ది లైఫ్'.

భారతీయ సంస్కృతి ఎంతటిది ! దానికీనాడు ఈగతిపట్టింది.
అమూల్యమైన మన సాంప్రదాయ మెంతటిది ! ఈనాడు అయ్యో పాపమనిపించుకొంటోంది !
ఏదో ముభావం.

ఎందుకో ఆత్మక్షోభ.

లోప మెక్కడిది ?

దోష మెవరిది ?

ఆలోచించే నాధులే లేరా ?

అతీగతీ విచారించే మనుషులే కరువై పోయారా !

నో !

ఈ మనుషుల్లో యింకా మానవత్వం చచ్చిపోలేదు.

ఇంకా ఈ దేశానికా దుర్గతి పట్టలేదు.

కాని....

నేనేమీ చెయ్యలేను.

నాకు తెలుసు, నేను నిమిత్తమాత్రుడినని.

ఇదెంతవరకు నిజం ?

ఆలోచిస్తుంటే... ....

హోటల్ 'నవదీపక్' లో రికార్డేశారు.

"క్యాహువా ! తేరేవాదా...." రఫీ కమ్మగా పాడుతున్నా ఆ గలభాలో నాకు విసుగ్గా ఉంది.

అంతలో,

ఆర్టీసీ కాంటీన్‌లో మరో రికార్డు—

"భలే భలే మొగాడివోయ్ ! బంగారు నా సామివోయ్ !—ఎల్లారీశ్వరి "అబ్బా" అనిపిస్తోంది.

నా బస్ రావడానికి యింకా పదిహేను నిమిషాల టైముంది.

"అంతవరకు ఈ గోలను భరించాల్సిందేనా !"—బాధేసింది.

"గత్యంతరం లేదు సుమా !"—అన్నట్లు చూస్తోంది నా సూట్‌కేసు.

పది సంవత్సరాలుగా చూస్తూనే ఉన్నాను ఈ బస్టాండులో వచ్చిన మార్పును.

సంతోషించాను. కాని పదిసంవత్సరాలుగా నేకోరుకొంటున్నది ఈ మార్పు రావాలనా ? కాదు.

పోనీ నా కోరిక ఏనాటికైనా తీరుతుందా ! ఏమో !— ఆలోచించసాగాను.

కేవలం బస్‌స్టాప్ ఒకచో మొదట్లో. అదీ యం. ఎల్యే రంగస్వామిగారి చలవ వల్ల. కాని ఇప్పుడది బ్రహ్మాండమైన బస్ స్టేషన్‌గా తయారైంది. రంగస్వామి గారు స్టేట్ మినిష్టరయ్యారు.

చిన్న ఉడిపి హోటలుండేది అప్పట్లో, నారాయణయ్యర్ గారి జీవనాధారమై కాని ఇప్పుడది టూ స్టార్ హోటలై జిగేలు మంటోంది. హోటలయ్యరిప్పుడు బాగా పరపతి గడించాడు.

వారేకాదు,

ఎందరో వ్యాపారస్థులు బాగా డబ్బు సంపాదించారు. మిద్దెలు మేడలు కట్టుకొన్నారు.

జీవితంలో స్థిమిత పడ్డారు. కాని,

ఆనాటి నుండి ఈనాటి వరకు నేను చూస్తున్న—

రిక్షావాడు, ఒంటెద్దు బండివాడు, కూలీవాడు, మెకానిక్కు—ఎవరూ మారలేదు.

అప్పుడున్న కళ కూడ వారికి లేదిప్పుడు.

అలాగే,

అరుస్తున్న బ్రోకర్లు అరుస్తూనే ఉన్నారు. కబుర్లు చెప్పుకొంటున్న కాలేజీ కుర్రోళ్ళు కబుర్లు చెప్పుకొంటూనే ఉన్నారు, ఒకప్పుడెంతో ఉత్సాహంగా. ఇప్పుడుమాత్రం ఎంతోనిరుత్సాహంగా.

బూట్ పాలిష్ కాకీలాగు వాళ్ళు, లారీ కట్టెల ఎత్తిటోపీ వాళ్ల అలాగే ఉన్నారు. కళ్ళులేనివాడు, దిక్కులేని అనాథ, సోడా వాడు, ఐస్‌వాడు ఏమాత్రం మార్పు లేకుండా అలాగే ఉన్నారు. ఇంకా మునపటి కన్నా హీనంగా, దైన్యంగా దరిద్రాన్ని అనుభవిస్తూ, దౌర్భాగ్యాన్ని తూలనాడుతూ—

ఏదో బ్రతుకుతున్నారు.

ఎందుకో బ్రతుకుతున్నారు.

ఇవి వీరితోనే అంతమౌతాయా ?

ఇంతటితో ఈ కథలు ముగిసిపోతాయా ?

ఎలా బ్రతికినా, ఎందుకు బ్రతికినా బ్రతుకుతున్నారు కాబట్టి....

తరతరాల పర్యంతం ఆ బ్రతుకు లలాగే గడుస్తుంటాయి.

భూమికి ఎంత భారంగానో !

ఆకాశాన్ని దాటి పోతో !

అలా అని ..

వీరికి బ్రతుకు నివ్వక పోవడమా ?

కాదూ కూడదని .

ఇలాగే బ్రతకండనడమా ?

ఒక్కసారి .... ఆత్మపరీక్ష చేసుకొంటే

మరోసారి .... స్వయం విమర్శ చేసుకొంటే
కర్తవ్యమేదో తప్పక బోధ పడుతుంది!
విద్యుక్తధర్మమేదో తెలిసొస్తుంది!
వీరి జీవితాలను ఉద్ధరించే వారే లేరా!
వీరిలో ఆశాదీపాలను వెలిగించే వారే లేరా?

వీరి ఆర్థిక స్థితిని బాగుపరచి సాంఘిక ప్రమాణాన్ని పెంచే వారే లేరా?

వీరిలో అక్షర జ్ఞానాన్ని కలిగించి అభ్యుదయ రాగాన్ని పలికించే వారే లేరా?

వీరి మానసిక వ్యధను తొలగించి, ఆత్మవిశ్వాసాన్ని కలిగించే వారే లేరా?

వీరి కష్టసుఖాలను విచారించి సముదాయించే వారే లేరా?
గుండెనిండా ఆవేదన పొంగి పొర్లుతోంది.
కళ్లనిండా నీళ్లు ముంచుకొచ్చాయి.
కాని,

ఏమి చేయలేని నా అశక్తతను తలచుకొని, ఎందుకూ కొఱగాని నన్నీసడించుకొని నిట్టూర్చాను.

నిస్పృహతో, నిరాశతో నా ఒక్కడి వల్లా ఏమీ కాదనే అసంతృప్తితో, ఆర్తితో.

ఐనా నా కనిపించింది —

"పదిమందనుకొంటే సాధించలేనిదేమీ లేదని, నేనొక్కడి నేనని అనుకోక అందరిని సమాయత్త పరచాలి. వారికి బాగోగులను వివరించాలి. వారిలో సామాజిక స్పృహను కలిగించాలి. వారిలో విద్రాణమై ఉన్న మానవత్వాన్ని జాగృత పరచాలి. అందరూ నడుంకట్టి ఐకమత్యంతో, క్రమశిక్షణతో మెలిగినప్పుడు సంస్కార భవిత సాక్షాత్కరించక పోతుందా? సర్వ సమానత అవతరించక పోతుందా?

అని

ఆలోచిస్తున్న నేను నా బస్సు రావడంతో సూట్‌కేసును చేతిలోకి తీసుకొన్నాను. ఆ బస్సు కాస్సేపు వెనక్కూ ముందుకూ కదలి నిశ్శబ్దంగా నిలచింది. నేను నా రిజర్వ్‌డ్ సీట్ మీద సూట్‌కేసుంచగలిగాను అతికష్టం మీద. కంటిన్యువస్‌గా సిక్సవర్స్ జర్నీ చేయాలనుకోవడంతోనే నీరసమొచ్చినట్లైంది. కాని విధిలేదు. యూరిన్ పాస్ చేసొద్దామని లావెటరీ కోసం చుట్టూ చూసాను. బస్‌స్టాండ్లలో పబ్లిక్ పాయిఖానాల్లోకి వెళ్లాలంటేనే జుగుప్స. మన "ఆరోగ్యశాఖ" వాళ్ళు అంతంత మాత్రమే పని చేస్తుంటారు. సానిటేషన్ పరమ ఘోరంగా ఉంటుంది. నడిరోడ్డు మీదికి పరుగులు తీసే మురికి కాలువల్ని దాదాపు ప్రతి ఊర్లో మనం చూస్తూనే ఉంటాము. ఇక బాగా రద్దీగున్న ప్రాంతాలైతే....సరేసరి కృష్ణా పుష్కరాలు గుర్తుకొస్తాయి - అందుకే అందులోనికి వెళ్ళడానికి సాహసించలేదు.

బస్సు కదలడానికింకా అరగంటుంది కదా అని కాస్త ముందు వైపుకు నడిచాను, క్రొత్తగా మున్సిపాలిటీవాళ్ళు కట్టిన 'యూరినల్స్' నోసారి దర్శిద్దామని. క్రొత్తగా రిలీజైన తెలుగు సినిమా కోసం సూపర్ స్టార్ కటవుట్‌ను బ్రహ్మాండంగా అలంకరిస్తున్నారా సెంటర్లో. ఆ హీరో బొమ్మకు ఆరడుగుల పూలహారం వెయ్యబోయి ఒకడు దభాలున క్రిందపడ్డాడు. ఐదారడుగుల ఎత్తు నుండి క్రింద పడ్డాడంటే ..నేనాత్రంగా చూచాను. 'జేజమ్మ' కన బడినా మళ్ళీ మామూలుగా లేచి పూలదండ కంటిన మట్టిని దులిపి సరిచేస్తుంటే, "ఆహా! హీరో జిందాబాద్! నీ బ్రతుకే పండు కదయ్యా! నీ కోసం తమ ప్రాణాల్ని సైతం యివ్వగలిగే ఈ తెలుగు అభిమానుల ఆశీస్సులు, అండదండలు నీకుండగా సిక్టీన్ దాక్తేనేం నీ వెవర్‌గ్రీన్ హీరో కాకుండా ఉండగలవా!"

అనుకొన్నాను.

"ఏంటో! వీరి పిచ్చికాని అభిమానమనేది అటహాసంలో ఉంటుందా? హృదయంలో ఉండాలి కాని. నాకు తెలిసి వీరు చేసే నానా హంగామా, సినిమా రిలీజైన మొదటిరోజు చేసే అల్లరి అంతా వీరి పేరు కోసమా? తమ హీరో ప్రతిష్ఠ కోసమా? వీరికి ఆ హీరోల సహాయం కూడా ఉంటుందని వినికిడి. ఋజువులు కూడా ఉన్నాయ్. ప్చ్. ఎవర్ని నిందించి ఏం లాభం! మానసికంగా మనుషులెదగాలి కాని, మంచి చెడులు తెలుసు కోవాలి కాని.

నా బస్ హారన్ వెయ్యడంతో నా నడక జోరును సడన్‌గా పెంచేసాను.

మెన్స్ క్లోజెట్ లోకి ప్రవేశించబోయి, ఒక్కక్షణం తటపటాయించాను.

ద్వారానికడ్డంగా బాగామాసిపోయిన కర్టన్ తగిలించబడిఉంది.
ఆ కర్టన్‌ను తొలగించి లోపలి కడుగెయ్యబోయాను,
ఆశ్చర్యం!
తెప్పరిల్లుకోలేక పోయాను.
అసలు నా కళ్ళకేం కాలేదుకదా అని అనుమానపడ్డాను.
అక్కడ —

ఎన్నాళ్ళగానో తిష్ఠవేసినట్లనిపించే లంబాడీల జంటలు రెండున్నాయి.

వారక్కడే కాపురం చేస్తున్నారనడానికి నిదర్శనంగా నాలుగైదు సిల్వర్ బోకులు, ఒక కుక్కి నులక మంచం, చింపిరి గుడ్డల మూటొకటి, చిల్లుపడి త్రుప్పుపట్టిన డబ్బారేకులపెట్టె, వారుఅమ్ముకొనే నానారకాల పూసలు, బుట్టలు, తట్టలు, విసన కఱ్ఱలు వగైరా వగైరా.

వారు నా వైపదోలా బెరుగ్గా చూచారు. ఆ చూపుల్లో వారి భయం స్పష్టంగా కనిపిస్తోంది. ఒకడు చేతులెత్తి మ్రొక్కేడు. ఆ మ్రొక్కులో వారి అసహాయత ఆర్తనాదం చేస్తోంది.

గిరుక్కున వెనక్కు తిరిగాను.

గబగబా బస్సు దగ్గరకు నడవసాగాను.

"ఎంత దారుణం! ఎంత అవమానం! నిలవడానికి నీడలేక' చివరికి మరుగుదొడ్లలో . మురికి కూపాల్లో నివసించడమా! వారూ మనుష్యులేనే! చీమూనెత్తురూ ఉన్న వారేనే! వారెలా ఉండగలిగారు? ఏముంది! ఇక వేరేదిక్కు లేదు. వారిని ఆదరించే వారు లేరు. అయ్యోపాపమనే వారే లేరు.

అందుకే,

జంతువులకన్నా హీనమై పోయారు. అభిమానాన్ని గతిలేక వదలుకొన్నారు. వారిని దూషించ వలసిన అవసరం లేదు. వారికా స్థితి కలిగించిన మన నైజాన్ని బాగుపరచు కోవాలి.

వారిలోని పిరికితనాన్ని, చేతకాని తనాన్ని ఆసరాగా తీసుకొని మనమెంతకు దిగజారిపోయాము. వారి మంచితనాన్ని, బేలతనాన్ని ఊతగా తీసుకొని మనమెంతకు తెగించాము.

వారెదురు తిరిగితే...
సముద్రాలై ఘోషిస్తే
అగ్నిపర్వతాలై బద్దలైతే ...
ప్రళయకాల రుద్రులై కదగడితే....
అప్పుడు,
ఇంకేమన్నా ఉందా?
మనుగడ విలువలు మట్టిపాలు కావా?
మమతానురాగాలు మసిబారిపోవా?
మనిషికీ మనిషికీ మధ్యన అగాధా లేర్పడవా?
మానవత్వపు పునాదులు కూలిపోవా?
అందుకే,

ఆ స్థితి రాకముందే కళ్ళు తెరవాలి. పరిస్థితి చెయ్యి దాటక ముందే మేలుకోవాలి. జాత్యాభిమానాలు, ప్రాంతీయ భేదాలు, భాషా వివాదాలు, వర్గ నినాదాలు మాని మహాత్ముడు కలలుగన్న సర్వమానవతా పరిపాలనా యంత్రాంగాన్ని సృషించాలి. ప్రజల హక్కులను పరిరక్షించాలి. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు ఊపిరి పోయాలి. మనసులోని మాటను యథాతథంగా బయట పెట్టగలిగే స్థోమతను కలిగించాలి. అన్యాయాన్ని, అక్రమాన్ని అరికట్టగలిగే గుండె బలాన్ని కలిగించాలి. ప్రతి మనిషినీ గుర్తించి, ప్రతి మాటకూ విలువ నిచ్చి, సదవగాహనతో, సౌశీల్యప్రవృత్తితో ప్రతివాడూ ముందడుగు వేస్తే భారతీయ సంస్కృతి అత్యున్నత శిఖరాగ్రాలపై శాంతి బావుటా నెగరవేస్తుంది. వాని ప్రగతి హృదయం వివిశతతో, విజ్ఞతతో గీతా సూక్తుల నాలాపిస్తుంది. నిజంగా ఆరోజొస్తే ఎంత హాయనిపించింది నాకు. నిండుగా శ్వాస పీల్చుకొన్నాను.

గమ్యం చేరాలని బస్సు కదిలింది. ముందు కెళ్ళసాగింది. వేగాన్ని పుంజుకొంటోంది. మలుపు తిరుగుతున్నప్పుడు నేను కిటికీలోనుండి ఆ పరిసరాలను మరొక్కసారి చూచాను. చెంప ఛెళ్ళుమనిపించినట్లు పీలయ్యాను.

గుండెనేదో కెలికినట్లు మూలిగాను.

నాకు నమస్కరించిన లంబాడీ వాడు పోలీసు వానికేదో ముట్టజెప్పు తున్నాడు. ఏ మాత్రం సందేహించ కుండా దాన్నందు కొని ముందుకెళ్లుతున్నాడా కానిస్టేబుల్. సుళ్ల తిరిగే రక్త ప్రవాహంలో నా అనుభూతి కొట్టుకొంటోంది. పీల్చి పిప్పిచేస్తున్న కబంధ స్మృతులలో ఏదో ఆర్తగీతి వినిపిస్తోంది. లంబాడీపై సానుభూతి చూపే ఆ అనుభూతి, ఆ పోలీసువాణ్ణి చూచి అసహ్యించుకొనే ఈ ఆర్తగీతి, రెండూ కలసి నాకేదో అర్థంకాని, నా ఊహకందని సందిగ్ధంలో ముంచేశాయి.

నాలో ఏదో ఆలోచన!

ఎందుకో ఆవేశం!

ముందు వీరిలో ఉన్న భయాన్ని తొలగించాలి. దాన్ని తొలగించాలంటే వారిలో అలుముకొన్న నిరాశా చీకట్లను తొలగించాలి. దాన్ని తొలగించాలంటే వారిలో అక్షరజ్ఞానాన్ని, యింగిత జ్ఞానాన్ని కలిగించాలి. వారికి మంచి, చెడూ విడమర్చి చెప్పాలి. వారిని అభివృద్ధి పరచేందుకు అన్ని రంగాలలోనూ అవకాశమివ్వాలి. వారిని నిరుత్సాహ పరచక వారిలో నూతనోత్తేజాన్ని కలిగించాలి. వీరికొర కెందరో ముందుకు రావాలి. ఏదో ఆలోచిస్తున్న నన్ను నా మనస్సాక్షి సూటిగా ప్రశ్నించింది.

"ఎందరో, రావాలంటున్నావే! నీవే మొదటి వాడివి ఎందుక్కాకూడదు" —

"ఔను నేనే ఎందుక్కాకూడదు" —

నాలో సంఘర్షణ క్రొత్తమలుపుకు దారితీసింది.

సరిగ్గా అప్పుడే,

నేను ప్రయాణం చేస్తున్న బస్సు తూర్పువైపుకు తిరిగింది.



# కలగూరగంప

## నిందారోపణలు, సమాధానాలు

శ్రీమాన్ డా. పుట్టపర్తి నారాయణాచార్యులవారు పండితరాయల "భామినీవిలాసము" లోని శ్లోకములకు చక్కని 'తెలుగు వివరణ' వ్రాస్తూ ముందుగా 26 పేజీల 'పీఠిక' వ్రాశారు. దానిలో పండితరాజును 'విశంకటుడు', 'షోకీలా' వంటి చిల్లర మాటలతో దూషించడమే కాకుండా ఆ మహామనీషిపై అసత్య గాథలతో కూడిన కొన్ని నిందారోపణలు కూడా చేశారు. వాటికి, సప్రమాణమైన సమాధానాలు చూపడమే ఈ రచనలోని ఉద్దేశ్యం.

ఆచార్యులవారు తమ 'పీఠిక' ప్రారంభంలో చూపిన "కిం నిశ్శంకం" అనే శ్లోకం, లవంగితో కలసి ఉన్న పండితరాయలను ప్రబోధిస్తూ అప్పయ దీక్షితులు చెప్పిన శ్లోకమని వారు తెలిపినారు. (చూ. పీఠిక 6 వ పేజీలో)

"— — ఈ చాటువు అప్పయదీక్షితులదిగానే ప్రచారంలో ఉన్నది— —" ఇలా చెప్పడం చేత, రాయలకు లవంగితో సంబంధమున్నట్లు పాఠక లోకం నమ్ముతుంది కదా! అని వారి యూహ. కాని సత్యదృష్టితో సమీక్షించినపుడు "కిం నిశ్శంకం..." అనే ఈ శ్లోకం, తన మనస్సును ప్రబోధిస్తూ రాయలు తన శాంతవిలాసంలో చెప్పిన శ్లోకమే అని అభివ్యక్తమౌతుంది. కారణం — ఈ శ్లోకానికి వెనుక, తరువాతగల శ్లోకాలలో రాయలు తన మనస్సును గూర్చి చేసిన సంబోధనలున్నవి. (చూ. శాంతసముల్లాసంలో 17 నుండి 21 వ శ్లోకం వరకు) వీరీ శ్లోకాలకు 'వివరణ' వ్రాసే ఉన్నారు. (17-21) ఈ శ్లోకాల మధ్యనున్న "కిం నిశ్శంకం" అనే శ్లోకానికి రాయల మనస్సంబోధన వర్తించే ఉంటుంది కదా! ఈ విధంగా, "ఈ శ్లోకం రాయలు చెప్పినదే" అని శాంతసముల్లాసగత శ్లోకాలు (17-21) సాక్ష్యమిస్తున్నాయి. వ్యాఖ్యాతలూ ఇలాగే వ్రాశారు కూడా. యదార్థ పరిస్థితి యిట్లుండగా ఆచార్యులవారు - ఈ శ్లోకంలో కర్తగా ఉన్న 'హే జీవ' అనే సంబోధన తీసేసి, దాని స్థానే "నాయనా!" అనే సంబోధన చేర్చారు. ఈ మార్పుతో వారనుకొన్నట్లు, రాయలు లవంగితో కలసి ఉండగా ఆ పొదరింట్లోకి వెళ్ళి దీక్షితులవారు, నాయనా! మృత్యుసమయం సమీపించిన యిప్పుడు యథేచ్ఛగా ప్రవర్తిస్తున్నావా?— — అంటూ రాయలను మందలించడానికి తగినంత అవకాశం అమరిజేసి వీరు దీక్షితులవారే ఈ శ్లోకం (కిం — —) చెప్పినట్లు (పాఠకులు నమ్మేటట్లు) క్రొత్తమార్పు చేశారు. ఆచార్యులవారి ఈ అభినవ కల్పనతో వీరి కోసమై అసత్య సాక్ష్యం చెప్పిన 90 ఏళ్ళ మహామనీషి అప్పయ్య దీక్షితులవారి అమలిన కీర్తి మలినమైపోయింది.

ఇంకా —

రాయలకు మృత్యు సమయం దాపరించిందట - కాని శృంగారపు మత్తులో ఉన్న వాడు (రాయలు) దీక్షితుల ప్రబోధాన్ని వినలేదుట (చూ. పీఠిక 6వ పేజీ) చావడానికి సిద్ధంగా ఉన్న వానికి శృంగారపు మత్తేమిటి?

"ఇట్టి యీ అనౌచిత్యాలను, అసందర్భాలను వారు గమనించలేదా?" అని (వీటిని విన్నవారు) ప్రశ్నించవచ్చును గదా! దీనికి సమాధానం చెప్పే బాధ్యత ఎవరిది? ఇట్లు రాయల మనః ప్రబోధ రూప పద్యాన్ని వీరు దీక్షిత కర్తృకమైన మందలింపుగా మార్చడం వలన ఇంత అనర్థ పరంపర ఆవహిల్లింది. పోనీ! రాయలు ఈ శ్లోకాన్ని తన రసగంగాధరంలో ఆక్షేపాలంకారానికి లక్ష్యంగా గ్రహించినాడనేనా ఆచార్యులవారు అవధరించినట్లు లేదు. ఇట్లు - "లవంగిని రాయలు వివాహం చేసికొన్నాడు" అనే ఆచార్యులవారి ఆద్యనిందారోపణం (చూ. పీఠిక 12వ పేజీ) ఎన్నో అసందర్భాలకు దారితీసిన వయసం వ్యక్తమే కదా!

2వ నింద :- "ఈ భామినీవిలాసం లవంగి మెప్పుకోసం రాయలు అప్పుడప్పుడు చెప్పిన శ్లోకాల సంకలనమే" నట (చూ. పీఠిక 11వ పేజీ).

సమాధానం :- అసలు "భామినీవిలాసము" ను రాయలు తన గృహలక్ష్మియైన "కామేశ్వరి" ని గూర్చి చెప్పినదే అని ఈ కవీంద్రుని 'కరుణవిలాసం'లో ఎన్నో నిదర్శనా లున్నాయి. ఉదాహరణకు :- కరుణవిలాసంలోని 6వ శ్లోకంలో రాయలిలా అంటాడు.

"— — సా, మామకీన కవితేవ మనోభిరామా, రామా కదాపిహృదయాన్మమ నాఽపయాతి" ఈ శ్లోకంలో — 'సా' అనే తచ్ఛబ్దంతో పేర్కొనబడిన - తన మనోఽభిరామ అయిన - ఆ 'రామ' ఎవరో ఆ విలాసంలోనిదే ఐన 12వ శ్లోకంలో రాయలిలా స్పష్టం చేశారు.

"— — సా, నిత్యమంగళమయీ గృహదేవతా మే కామేశ్వరీ హృదయ తోదయితా నయాతి।"
(చూ. కరుణవిలాసం 12 శ్లో.)

"సా, —రామా కదాపి హృదయా న్మమ నాఽపయాతి" (శ్లో. 6)

"సా, — – కామేశ్వరీ హృదయతోదయితా నయాతి" (శ్లో. 12)

6వ శ్లోకంలోని ఆ "రామ"యే ఈ కామేశ్వరి. ఈ కామేశ్వరియే ఆ రామ. ఈ కామేశ్వరి రాయల "గృహదేవత." అనగా రాయల ధర్మపత్ని. అనగా ఆయన గృహిణి. గృహిణితో కూడిన గృహమునకే ''గృహము" అనే పేరు చెల్లుతుంది అని.

''నగృహం గృహమిత్యాహుః గృహిణీ గృహముచ్యతే" అనే సూక్తి చాటుతూంది. ఇంతకూ చెప్పేదేమంటే, ''రాయలు తన ధర్మపత్నిని ఉద్దేశించియే భామినీవిలాసం చెప్పినాడు కాని లవంగిని గురించి చెప్పలేదనియే. ఈ విషయాన్ని రాయల కరుణ విలాసంలోని ప్రతి ఒక శ్లోకం ప్రకటిస్తుంది.

3వ నింద :- రాయలకు సవర్ణురాలైన భార్యలేదుట. ఉన్నా ఆమె పేరు ''కామేశ్వరి" కాదుట (చూ. పీఠిక 12వ పేజీ).

సమాధానం :- రాయలు, తాను నిత్యములు, నైమిత్తికములు అనబడే వైదిక క్రియలన్నీ యథావిధిగా నిర్వహించినట్లు తన శాంతవిలాసంలో ఆఖరిని

''శాస్త్రాణ్యాకలితాని, నిత్యవిధయస్సర్వేపి సంభావితాః..." అనే శ్లోకం ద్వారా చాటినాడు. దీనికి ఆచార్యులవారు 'వివరణ' కూడా వ్రాశారు.

4 వ నింద :- రాయలకు అల్పాయుష్కుడైన ఒక కొడుకు తప్ప మరి సంతానం లేదట (చూ. 12 వ పేజీ).

సమాధానం:- రాయల పౌత్రుడైన మహాదేవసూరి తన 'భామినీ విలాస వ్యాఖ్య' ప్రారంభంలో

"పండిత రాజ కుమారః ప్రాదురభూతోదయో పూర్వః।
పండిత రాజ సుసంజ్ఞః తత్పుత్రోఽహం మహాదేవః॥"

అని చెప్పిన శ్లోకం రాయలకు ఆయుష్మంతుడైన పుత్రుడు, పౌత్రుడు కూడ ఉన్నట్లు చాటుతూండగా 'రాయలకు సంతానం లేదనడం' దుస్సాహసమనిపించుకోదా? ఇట్లు అసత్యపూరితాలైన వీరి యిట్టి నిందలలో ఇంకా- యవన స్త్రీని వివాహం చేసికొని రాయలు ఆమెయందు సంతానం కనడం, రాయలకు 'వెలి' వేయడం, పొంగి వచ్చిన గంగమ్మ లవంగిరాయళ్ళను తీసికొని పోవడం, స్వజాతి భార్య లేకుండానే, రాయలు తన వైదిక విధులు ఏలాగో చేసికోవడం వంటి ఆచార్యుల వారి అసత్యాఽరోపణలు (చూ. పీఠిక 12-13 పేజీలు) వారికి రాయల ప్రతిపక్షి వర్గంలో ప్రథమ స్థానాన్ని సంపాదించి, రాయల కుటుంబమందు వీరికి గల ప్రత్యేక భావానికి అద్దం పడుతున్నాయి. "- - సంప్రత్యుజ్ఝిత వాసనం మధుపురీ మధ్యేహరిస్సేవ్యతే - - -" అని తన చరమ దశలో మధురలో ఉండి (తన జీవితాంతం) శ్రీహరిని సేవించానని స్పష్టంగా తన శ్లోకంలో తెలుపుకొన్న రాయలను, లవంగితో సహా గంగమ్మ అమాంతంగా లాక్కొపోవడమేమిటి? ఈ శ్లోకానికి కూడ 'వివరణ' వ్రాసిన వీరికి రాయల చరమ దశలోని మధురాపురీ నివాసం తెలియదా? సత్యదృష్టితో చరిత్రను సమీక్షించ గలిగిన వారికి ఆ-సత్యచరిత్ర యిలా సత్య విషయాన్ని విశదం చేస్తూంది. వినండి.

పండితరాయలకు 200 ఏండ్ల క్రితం ఉన్న - అనగా శ్రీనాధునికాలంలో ఉన్న డిండిమభట్టకవికి ప్రస్తుత లవంగి సన్మానం చేసినట్లు డిండిమకవి వంశచరిత్రను తెలిపే "విశేషరత్నమాల" అనే గ్రంథం చాటుతూంది. కనుక 'లవంగి' రాయల జీవిత కాలంలో లేనేలేదన్నమాట సత్యం కదా!

ఇక ఈ "లవంగీ గాథ", రాయల శత్రుపక్షంలోని పండితులు లేవదీసి వ్యాపింపజేసి చరిత్ర కెక్కించినదే అనీ, దీనికి ఆధారాలేవీ గానరావనీ, లవంగీ ప్రేమసూచకాలైన పద్యాలేవీ రాయల గ్రంథాల యొక్క పూర్వప్రతులలో లేవనీ, పిమ్మట ముద్రించిన రాయల గ్రంథ ప్రతులలో ప్రతిపక్షి పండితులు ఈ లవంగీ విషయక పద్యాలు జొనిపిన నిదర్శనాలున్నాయనీ, "మహా మహోపాధ్యాయ" పండిత దుర్గాప్రసాద మహోదయులు, 'దేవర్షి' భట్ట శ్రీ మధురానాథశాస్త్రి మహాశయుల వంటి ప్రామాణిక పండిత విమర్శకులు తమ రచనలలో సవివరంగానూ, సప్రమాణంగానూ ప్రదర్శించారు. (చూ. 19.6 సం॥రం లో 3వ సంస్కరణగా- నిర్ణయసాగర ప్రెస్‌లో ముద్రించిన రసగంగాధర పీఠిక, ఇంకా ఇదే ప్రెస్‌లో 1947 వ సం॥రం లో 6వ సంస్కరణగా ముద్రించిన రసగంగాధర పీఠికలు, 1942 లో అన్నామలై యూనివర్సిటీ ప్రకటించిన 'పండితరాజ జగన్నాథ' అనే ఆంగ్ల గ్రంథం ఈ విశిష్ట విషయాలన్నీ "పండితరాజ జగన్నాథ మహాకవిః" అనే మదీయ సంస్కృత గ్రంథంలో సవివరంగా - సప్రమాణంగా విశదీకృతాలైనవి. ఇన్ని ప్రసిద్ధ ప్రమాణాలు - రాయలుకు, లవంగికి ఏ విధంగానూ సంబంధం లేదని చాటుతూండగా ఈ యిరువురి సంబంధ కల్పనకై ఆచార్యులవారివంటివారు స్వీయ నూత్న కల్పనలతో సత్యాన్ని కప్పేసి తద్వారా అప్పయ దీక్షితుల వంటి మహామనీషులకు అంతకుముందులేని అపయశస్సును సంపాదించి పెట్టడం బాగులేదని మనవిచేస్తున్నాను. ఈ రచనకు ఆక్షేపణలున్నచో తెలుపగోరుచున్నాను.

విబుధజన విధేయ,
ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి, ముంగండ.

# శ్రీకృష్ణదేవరాయుల కాలంనాటి నాణెం

ఇటీవల గుంటూరుజిల్లా, నరసరావుపేట తాలూకా నెకరికల్లులోని ఎన్. ఎస్. సి. సబ్ డివిజన్‌లో సీనియర్ అసిస్టెంటుగా పనిచేస్తున్న శ్రీ ఎస్. ఎ. సత్తార్‌గారికి ఒక రాగినాణెం దొరికింది. ఆ నాణాన్ని పరిశోధన కోసం నాకు ఇవ్వడానికి ఆయన అంగీకరించాడు.

ఆ నాణెం గుండ్రంగా వుంది. ఆ నాణెం వ్యాసం 1.4 సెంటిమీటర్లు. దాని బరువు 3.4 గ్రాములు. ఆ నాణెంపై చిహ్నం, లిపి స్పష్టంగా కనిపిస్తున్నాయి.

నాణెం బొమ్మవైపున కిరీటం ధరించి రెండు చేతు లెత్తి నమస్కరిస్తున్న గరుడ విగ్రహం ముద్రించి వుంది. గరుత్మంతుని రెక్కలు విప్పివున్నాయి. నాణానికి రెండవ వైపున దేవనాగరి లిపిలో అసంపూర్ణంగా మూడు పంక్తు లలో "శ్రీ ప్రతాపకృష్ణరాయ" అని వ్రాసి వుంది.

నాణెంపై వున్న ఆ లిపినిబట్టి ఆ నాణెం విజయ నగర చక్రవర్తులందరిలోను అగ్రగణ్యుడైన శ్రీకృష్ణదేవ రాయులదని తెలుస్తుంది. ఆయన క్రీ.శ. 1509లో రాజ్యా నికి వచ్చి 1529 వరకు పాలించాడు. శ్రీకృష్ణదేవరాయ లకు వైష్ణవమతంపట్ల అభిమానం వుందని ఈ నాణెంపై ముద్రించిన గరుడ విగ్రహాన్ని బట్టి స్పష్టమవుతుంది. శ్రీకృష్ణదేవరాయలు బంగారు నాణాలు, రాగి నాణాలు వేయించాడు. ఆయన వేయించిన బంగారు నాణాలలో వరహా, అర్ధ వరహా, పావు వరహా అని మూడు రకా లున్నాయి.

శ్రీకృష్ణదేవరాయలు వేయించిన రాగి నాణాలలో గరుడవిగ్రహంవున్న నాణాలు, నందీశ్వరవిగ్రహంవున్న నాణాలు అని రెండు రకాలు. వీటిలో ఎక్కువ బరువు కలిగిన నాణెం 16.09 గ్రాములు బరువు వుండగా అతి తక్కువ బరువు కలిగిన నాణెం 1.6 గ్రాములు మాత్రమే వుంది.

ఆయన వేయించిన కొన్ని బంగారు నాణాలమీద కమలంపై నిలబడివున్న శ్రీ వేంకటేశ్వరస్వామి, మరి కొన్ని నాణాలమీద ఆసీనుడైవున్న బాలకృష్ణుని ప్రతిమ ముద్రించబడి వుంటుంది.

శ్రీకృష్ణదేవరాయలు తుళువ నరసనాయనకు, నాగాంబకు కల్గిన రెండవ సంతానం. చిన్ననాటి నుండి తిమ్మరుసు సంరక్షణలో పెరిగాడు. ఆయన సహాయంతోనే



**460** సంవత్సరాల నాటి శ్రీకృష్ణదేవరాయల నాణెం

1509లో విజయనగర సింహాసన మధిష్టించాడు. రాజ్యానికి రాగానే బీజపూరు సుల్తానును ఓడించి రాయచూరును జయించాడు. తరువాత తనపై తిరుగుబాటు చేసిన గంగరాజునుఓడించి ఉమ్మత్తూరు, శివసముద్రం, శ్రీరంగ పట్టణాన్ని స్వాధీనం చేసుకున్నాడు. తరువాత తూర్పు దిగ్విజయయాత్ర (1519)ను ఉదయగిరిలో ప్రారంభించి కొండవీడు, కొండపల్లి, రాజమహేంద్రవరం మొదలైన ప్రాంతాలను ఆక్రమించి, అక్కడ నుండి కటకం వెళ్ళి ప్రతాపరుద్రగజపతి నోడించి అతని కుమార్తెను వివాహ మాడాడు. మళ్ళీ 1521లో బీజపూరు సుల్తాను అయిన ఆదిల్‌షాను ఓడించి రాయచూర్ ప్రాంతాన్ని స్వాధీనం చేసుకున్నాడు. ఈ విజయాలతో కృష్ణదేవరాయలు దక్షిణదేశంలో తిరుగులేని సార్వభౌముడు కావడమేగాక, శత్రువులకు సింహస్వప్నమయ్యాడు.

రాయలు ఎంత గొప్పవీరుడో అంతటి సాహిత్య వేత్త, కవి, పండిత పోషకుడు. తాను స్వయంగా కవి అయి తెలుగుభాషలో "ఆముక్తమాల్యద" అనేఉద్గ్రంథాన్ని రచించాడు. అష్టదిగ్గజాలను పోషించాడు. ఈయన గొప్ప వైష్ణవ భక్తుడు. అనేక దేవాలయాలు నిర్మించాడు, ఎన్నో దేవాలయాలకు దానధర్మాలు చేశాడు.

ఇన్ని సద్గుణాలుకలిగి వైభవోపేతమైన జీవితాన్ని గడిపిన శ్రీకృష్ణదేవరాయలు తన కుమారుని మరణానికి తిమ్మరుసు పన్నిన కుట్ర కారణమని భావించి ఆయన కండ్లు పీకించి తర్వాత అతడు నిర్దోషి అని తెలుసుకొని మనోవ్యధతో 1529లో మరణించాడు.

శ్రీ వరికూటి వెంకట సుబ్బారెడ్డి

## మందుములవారి వంశము

ఇది "50 ఏండ్ల హైదరాబాదు" అను గ్రంథమును రచించిన శ్రీ మందుముల నరసింగరావుగారి వంశ వివరము. దీని ముఖ పత్రమున వారిట్లు వ్రాసికొనిరి. "ముందు తరమువాంఛ నిమిత్తమై నేను మా వంశమును గురించి ముక్తసరిగా ఈ ప్రకరణము వ్రాసిపెట్టుకొన్నాను." ''ఎమ్. నరసింగరావు''

మా మూల పురుషుడు పెద్దవెంకన్న పంతులుగారు. ఆయన శా. శ. 1550 క్రీ. శ. 1628 లో మందుములలోనుండి మహబూబ్ నగర్ జిల్లాలోని కలువకుర్తి తాలూకాలో ఇపుడు మేము నివసించు గ్రామముల దేశముఖీ సంపాదించి నివసించెను. అందువలన మేము మందుముల వారమైతిమి. ఆ గ్రామము హైదరాబాదునకు సుమారు 22 కి. మీ. దూరమున నుండి యిపుడు రామచంద్రాపురములోని "భారీ విద్యుచ్ఛక్తి లిమిటెడ్" లో చేరినది. పరంపరాగతముగా తెలిసినంతవరకు మరియు మా పూర్వులు వ్రాసిపెట్టిన ప్రమాణ పత్రములను బట్టి పెద్దవెంకన్న పంతులుగారి మూలపురుషుడు అక్కిరాజు నామధేయుడు. అతడు మచిలీపట్టణము సమీపమున నున్న తంగెళ్ళపల్లినుండి క్రీ. శ. 1552లో ఇబ్రాహీంకుతుబ్‌షా వారి కాలమున హైదరాబాదు వద్దనున్న పటన్‌చెఱువు కేతెంచెను. వీరి యింటిపేరు "కుమ్మెరవారు" వీరిని గురించి "ఇబ్రాహీం కుతుబ్‌షానామా'' అను గ్రంథమున పేర్కొనబడినది.

పటన్ చెఱువులో అపుడు రంగారావుగారను వ్యక్తి దేశ పాండ్య మరియు ''మన్నెవార్'' పదవులలో నుండెను. ఆయన యుక్తవయసులోనున్న అక్కిరాజు తెలివితేటలు జూచి మెచ్చి తమగృహమున నుంచుకొని కూతురునిచ్చి వివాహముజేసి పిమ్మట కుతుబ్‌షావారి సమ్మతితో అతనికి మందుముల, తెల్లాపురము, నడిఖుర వగైరా గ్రామముల కరణీకము మరియు మక్తాభూము లిచ్చెను.

ఇబ్రాహీంకుతుబ్‌షా మా మొదటి మూలపురుషుడైన అక్కిరాజు యొక్క బుద్ధిచాతుర్యమును మెచ్చుకొని రాజభవనము యొక్క అధికారిగా నియమించుకొని ''చరికొండ పరగణా'' మజుందారి పదవి నిచ్చెను. ఆ పరగణా ఆదాయమునుండి రాజ భవన వ్యయము వెళ్ళుచుండెను. ఆ పదవిపై అక్కిరాజు పిమ్మట అతని వంశీయులు శ్రీయుతులు కేసన్న, రంగశాయి మరియు పెద్దవెంకన్నగారలు దాదాపుగా 175 సంవత్సరములుండిరి.

కుతుబ్‌షా రాజవంశమున చివరివాడైన తానీషాగారి కాలమునుండి మా వంశీయులకు చరిగొండ పరగణా మజుందారీ పదవితో సంబంధము పోయెనుగాని పెద్ద వెంకన్న పంతులుగారికి తానీషావారి మామగారగు అబ్దుల్లా కుతుబ్‌షావారి కాలమున చరిగొండ పరగణాకు సంబంధించిన 96 గ్రామముల దేశముఖీ మాత్రముండెను.

రంగశాయికి ఇద్దరు భార్యలుండిరి. పెద్దామె పేరు అళహరమ్మ. రెండవ యామె పేరు నాగుబాయమ్మ. అళహరమ్మకు చెల్లన్న-పక్కన్న అని యిద్దరు, నాగుబాయమ్మకు పెద్ద వెంకన్న-చిన్న వెంకన్న అని యిద్దరు కుమారులు కలిగిరి కాని వీరు అళహరమ్మ కుమారుల కంటె పెద్దవారు. పెద్దవెంకన్న పంతులు చెల్లన్నకు అన్నలతో తమ పూర్వీకులు సంపాదించిన మందుముల వగైరా గ్రామములలో నుండే ఆస్తిలో సగభాగము పంచియిచ్చి పరిష్కారము చేసికొని, తమ్ముడైన చిన్నవెంకన్న పంతులుతో గలిసి చరికొండ పరగణా "మజుందారీ" అనుభవించుచుండెను. కొన్ని సంవత్సరములు గడచిన పిమ్మట చిన్నవెంకన్న పంతులు "కాశీ, గయా" మొదలగు పుణ్యతీర్థములు సేవింపబోయి, ఆ యాత్రలలోనే మరణించెను. ఆయనకు రామచంద్రుడను ఒక కుమారుడుండెను. పెద్దవెంకన్న పంతులు అతనికి తన భాగము నుండి సగము పంచియిచ్చి రామచంద్రాపురము టంగుటూరు మొదలగు 18 గ్రామముల వతను మరియు ఆస్తి పాస్తులు స్వాధీనము జేసి తాను చరిగొండ పరగణాలో నివసించెను.

పెద్దవెంకన్న పంతులుకు కేశమ్మ, నాంచారమ్మ అని యిద్దరు భార్యలుండిరి. నాంచారమ్మ వీరవైష్ణవులైన తిప్పరుసు ఖంటివారి అడపడుచు. పెద్దవెంకన్న పంతులు మరియు ఆయన పూర్వీకులందరు ఆ ప్రాంతములోని తంగెళ్ళపల్లిలో నున్న కాలము నుండి గోలుకొండకు వచ్చిన అక్కరాజు మూలపురుషుని ఆరభ్య రంగశాయి వరకు శైవులు, స్మార్త సంప్రదాయపరులు కాని నాంచారమ్మ ప్రభావము వలన పెద్దవెంకన్న శైవసంప్రదాయమును త్యజించి వైష్ణవ సంప్రదాయ మవలంబించెను. నాటి నుండి వీరు కందాళవారి శిష్యులైరి. ఇప్పటి వరకు వైష్ణవాచార పరాయణులై యున్నారు.

నాంచారమ్మకు ఒక కుమారుడు జన్మించి మాతాశిశువులు మరణించిరి. కేశమ్మ కారుగురు కుమారులు జనించి యిద్దరు మరణించిరి. మిగిలిన నలుగురు రామచంద్రరావు, నరసన్న, రఘునాయకుడు, సీతాపతి అనువారు. తండ్రి ఈ నలువురికి రావిచేడు, వింజమూరు, గొడకొండ్ల, తలకొండపల్లి గ్రామములలో నాలుగు కోటలు గట్టించి ఒక్కొక్కరిని ఒక్కొక్క కోటలో నుంచెను. అట్టుల రామచంద్రరావు రావిచేడు, నరసన్న వింజమూరు, రఘునాయకుడు గొడకొండ్ల, సీతాపతి తలకొండపల్లిలో నుండిరి. తండ్రి చరికొండ పరగణా మొత్తము గ్రామాల యింతెజాము ఏర్పాటు చేసెను.

ఈ సందర్భమున దేశముఖీ పదవికి సంబంధించిన బాధ్యతలు వగైరా గురించి కొంత వివరించు టవసరము. ఇపుడు కొన్ని గ్రామములు గూడిన హల్కా. కొన్ని హల్కాలు గూడిన తాలూకా. కొన్ని తాలూకాలు గూడిన జిల్లా. క్రీ.శ. 1857 న కంటె మొదలు పరిపాలనా పద్ధతి యిటుల లేకుండెను. కొన్ని గ్రామాలు గూడిన పట్టి, కొన్ని పట్టీలు గూడిన పరగణా. కొన్ని పరగణాలుగూడిన సర్కారు. కొన్ని సర్కారులతో గూడిన ప్రాంతము సూబా అనబడుచుండెను. గ్రామాధికారు లిప్పటివలెనే కరణాలు, పటేళ్ళు ఉండిరిగాని వారిపై పరగణా ఒక్కంటికి ఒక దేశముఖ్ ఒక దేశపాండ్యా అధికారులుగా నుండిరి. చెఱువులు కుంటలు వేయించుట. బావులు త్రవ్వించుట, భూములు పడావా పడకుండ వ్యవసాయ యోగ్యముగాజేయుట, రైతులచే సరిగా వ్యవసాయము జేయించి సర్కారు సిస్తు వసూలుజేయించుట, ప్రతిగ్రామమునకు నిర్ణీతమైన సిస్తు రఖమును ప్రభుత్వమునకు చెల్లించుట, మొదలగునవి దేశముఖుల బాధ్యతలు. పరగణాలోని భూములవి మరియు రైతులవి సర్కారీ రకము లెక్కలు సిద్ధము చేయుట దేశపాండ్యాల బాధ్యతగా నుండెను. చరికొండ పరగణా కలువకుర్తి మరియు పడకల్లు పట్టీలతో గూడియుండెను. మా పూర్వీకులీ పరగణాకు దేశముఖులుగా మంత్రి సోమరాజు మరియు గొబ్బూరివారు దేశపాండ్యాలుగా నుండిరి.

వెంకన్న పంతులుగారి నలుగురు కుమారులు తమ తమ బాధ్యతలు నెరవేర్చుచు కొంత కాలము బాగుగనే జరిపిరి కాని కాలమెప్పు డొకేతీరుగా నుండదు. రాజకీయముగా ఢిల్లీలో కేంద్ర ప్రభుత్వము గోలకొండలో రాష్ట్ర ప్రభుత్వము బలహీనము చెందిన కారణమున దేశమున అరాచక పరిస్థితులు దానికి తోడు కరవు కాటకములు తాండవమాడెను. దుష్టులు పట్టపగలు చరికొండ సీమలోని 96 గ్రామములను దోచిరి. ఆ పరిస్థితులలో మా పూర్వీకులు నిర్ణీతమైన సర్కారీ సిస్తురఖము సమయానికి చెల్లించలేకపోయిరి. ఆసమయముననే మన్నెవారు పదవి నలంకరించినవారు మాపూర్వుల యొక్క జన్మస్థానమైన మందుముల పైబడి సర్వస్వము దోచుకొనిరి. ఆ కారణమున మందుములలోనుండు మావారు దేశాంతరములకు పారిపోయిరి. ఇటుల క్షామము మరియు అరాజక పరిస్థితుల

వలన రాజార్థము వెళ్లక ద్రవ్యభ్రష్టులై మావారు గొబ్బూరి వారి విరోధమునకు గురియైరి. రామచంద్రరావు గారు బెల్లపుకొండ దుర్గమున జైలు జీవితము గడుపవలసివచ్చి అందులోనే శ్రమ పడుచు కాలముజేసెను. రామచంద్రుని కుమారుడు సూరన్నగారు పినతండ్రుల సహాయమున నేదోయొక విధముగ కొంత సర్కారీ డబ్బుచెల్లించినప్పటికి ఇంకను 3వేల రూప్యములు బాకీయుండెను. దానికై సర్కారువత్తిడి భరించలేక "గురుమిటికాల" దేశముఖులైన కానకుర్తి మల్లారెడ్డిగారి సహాయము కోరగా ఆయన చరికొండ పరగణాలోని సగము దేశముఖీ అనగా కలువకుర్తి పట్టీ తనపేర విక్రయము వ్రాయించుకొని డబ్బిచ్చెను. ఆ డబ్బులో సూరన్న సర్కారు బాకీతీర్చెను గాని గొబ్బూరివారింకను మావారిని కష్ట పెట్టుచునే యుండిరి. దానికి కానుకుర్తి మల్లారెడ్డి సహించక గొబ్బూరు వెంకటపతిని నిర్బంధించి భద్రాపురము గడీలో ఖైదు చేయించెను. ఆయన అందులోనే గతించెను. ఇటుల చరికొండ సీమలోని కలువకుర్తి పట్టిని విక్రయించినపిదప మా వారికి పడకల్లు పట్టీ గ్రామములు 48 మాత్రమే మిగిలెను.

ఈ దేశముఖీపద్ధతిని మా వారు క్రీ. శ. 1863 వరకు అనుభవించిరి. ఆ కాలమున ఈ పద్ధతిని "సర్బస్తా సిస్టం" అను చుండిరి. ఆ పద్ధతి ప్రకారము సర్కారువారు పదిఏండ్లకొకను గ్రామములపై రఖం నిర్ణయించెడివారు. కరువులు వచ్చినను, కాటకములు వచ్చినను అది చెల్లించవలసినదే. ఈ పద్ధతిప్రకారము దేశముఖ్ దేశపాండ్యాలకు వారు నిర్వహించే బాధ్యతలకు ప్రతిఫలముగా గ్రామమున కొన్ని భూములు సేరీలని, ఇనాములని, సిస్తులేకుండ ఇచ్చుచుండిరి. ఇది పోగా సర్కారుకు వారు యిచ్చిన డబ్బులో 5% దేశపాండ్యాలకు 10% దేశముఖులకు నిచ్చుచుండిరి.

క్రీ. శ. 1863 లో అపుడున్న ప్రధానమంత్రి మొదటి సాలార్‌జంగుగారు జిల్లా బందీచేసి మొత్తం రాష్ట్రాన్ని 14 జిల్లాలుగా విభజించి ఒక్కొక్క జిల్లాక్రింద తాలూకాలు ఏర్పాటుచేసినారు. ప్రతిజిల్లాకు అవ్వల్ తాలూక్‌దారు (కలెక్టర్) మరియు అతని క్రింద కొందరు దువ్వం సువ్వం తాలూక్‌దార్లను (ఇప్పటి డిప్యూటీ, సబ్ కలెక్టర్) మరియు ఒక్కొక్క తాలూకాకు తహశీలుదారును నియమించినారు. ఇది ఒక గొప్ప సంస్కరణమనియే చెప్పవలెను. దీనితో అంతవరకములలోనున్న సర్బస్తా లేక (రెవెన్యూ ఫార్మింగ్) పద్ధతి అంతరించెను.

తలకొండపలె శాఖకు మా తాతగారు రామచంద్రరావు, రావిచేడు శాఖలో రామారావు, వింజమూరి శాఖలో కృష్ణారావుగారి భార్య అలవేలాయి, గొలుకొండ్ల శాఖలో అనంతరావుగారి హయాములో ఈ సంస్కరణలు క్రీ. శ. 1867 లో అమలునకు వచ్చినవి. చరికొండ, తలకొండపల్లి మొదలగు గ్రామాలు నల్లగొండ జిల్లాలో జడ్చర్ల తాలూకాకు చేర్చబడినవి.

ఈ సంస్కరణ వలన దేశమున చాలామంది దేశముఖ్ దేశ పాండ్యాలలో అసంతృప్తి బయలు దేరినది. కొందరు దేశముఖులచ్చటచ్చట తిరుగుబాటుచేసిరి. అటుల చేసినవారికి కొందరికి సాలార్‌జంగ్ మరణశిక్ష విధించెను. మొత్తముపై దేశముఖ్ దేశ పాండ్యాలను తృప్తిపరచడానికి అదివరకు వారు నెరవేర్చుచున్న బాధ్యతలు ముందు నెరవేర్చలేకున్నప్పటికి అంతవరకు అనుభవిస్తు వచ్చిన సేరీలు ఇనాములు మక్తాలు మరియు రుసుములు ఇక ముందుగూడ కొనసాగగలవని సాలార్‌జంగ్ అజ్ఞ యిచ్చెను కాని ఆ అజ్ఞాను సారము నియమించబోవు ఇనాము కమీషనులో వారందరు తమ తమ సనదులు భగోటా కాగితములు దాఖలు చేసి రుజువు చేసికొనవలసి యుండెను. ఇది ఆ కాలమున దేశముఖులకు, దేశపాండ్యాలకు పరీక్ష సమయము. ఇనాము కమీషనువారు కొందరి పత్రాలు తిరస్కరించిరి. కొందరివి రుజువు సరిగాలేవని ¼ వంతు లేక ½ మాత్రమే బహాలు చేసిరి. కొద్ది మందివి మాత్రమే పూర్తిగా బహాలు జరిగెను.

ఈ తవాయిలో దేశమున మనవారి దగ్గరున్న పూర్వపు రాజులు, సామంతులిచ్చిన దానపత్రములు, శాసనపత్రికలు అన్ని అసాముల దగ్గర లేకుండ సర్కారునకు జేరెను.

సాలార్‌జంగ్ సంస్కరణలు పాటింపబడిన తరువాతనే మా తాతగారైన రామచంద్రరావుగారు గతించిరి. అప్పటికి మానాయనగారి వయస్సు 7 సంవత్సరములు. అపుడు మా వారు సమయానికి ఇనాం కమీషనులో కాగిత పత్రాలు చూపించి తమవి రుజువు చేయించుకోలేదు. ఆ కారణమున మా సేరీ యినాం మక్తాలు ప్రభుత్వ పరమాయెను. కొన్ని సంవత్సరముల తరువాత మా నాన్నగారు ఇనాము కమీషనులో ఆలస్యమునకు కారణము జూపుచు దరఖాస్తు పెట్టుకొనిరి. అపుడు క్రీ.శ. 1901లో మా సేరీ యినాం మక్తా భూములు మరల మాకు దత్తము జేయబడినవి. మా నాయనగారు తమ జీవితకాలము వరకు అంటె క్రీ. శ. 1943

వరకు నేను మరియు మా తమ్ముడు రామచంద్రరావు క్రీ. శ. 1952 వరకు అవి అనుభవించినాము. ప్రథమ ప్రజా ప్రభుత్వ స్థాపనానంతరము రామకృష్ణారావుగారు ముఖ్యమంత్రిగా నున్న కాలమున క్రీ. శ. 1952 లో దేశముఖీ, దేశ పాండ్యాలకు రాష్ట్రంలో అంతవరకున్న ఇనాం, సేరీ, మఖ్తా భూములు మరియు నగదు రుసుములు అన్నియు అంతరించినవి. భూసంస్కరణలు అమలు లోనికి రావటమున అంతవరకూ కౌలుదార్లుగానున్నవారు యజమానులుగా మారిపోయిరి. సొంత సేద్యములో కొద్ది భూములు మరియు శిథిలమైన కోటగోడలు మాత్రము మాకు మిగిలినవి.

నేను అక్కరాజునకు 11 వ, వెంకన్న పంతులుగారికి 8 వ తరము వానిని. మా వంశమున పెద్దవెంకన్న పంతులుగారికి సీతాపతి, అతనికి నరసన్న, ఆయనకు పాపయ్య, అతనికి సుబ్బారావు కలిగిరి. సుబ్బారావునకు లక్ష్మారావు, రామచంద్రారావు అని యిద్దరు కుమారులు గలిగిరి. రామచంద్రరావునకు వెంకటనరసింహారావు, సుబ్బారావు, రంగనాయకమ్మ, వెంకటనరసమ్మ, అనంతమ్మ అను సంతానము గలిగిరి. సుబ్బారావును గౌడకొండ్ల పట్టిలో జేరిన అప్పారెడ్డి పల్లిలోని కృష్ణారావునకు దత్తు ఇచ్చిరి. రంగనాయకమ్మను మహబూబ్‌నగర్ తాలూకాలోని మునగాలచేడు కేశవరావుగారికి, వెంకటనరసమ్మను బూర్గుల నరసింగరావు కుమారుడైన వెంకటేశ్వరరావుగారికి, అనంత లక్ష్మమ్మను మంత్రి కృష్ణారావుగారికి యిచ్చి వివాహములు చేసిరి.

వెంకట నరసింహారావుకు చేవెళ్ళ దేశముఖ్ రామచంద్రరావుగారి కుమార్తె రామాబాయిని యిచ్చిరి. ఆ దంపతులకు నరసింగరావు, రామచంద్రరావు, రంగనాథరావు అను కుమారులు, వెంకటనరసమ్మ, అనంతలక్ష్మీదేవి అను కుమార్తెలు కలిగిరి. రంగనాథరావును రావిచేడు సూర్యారావునకు దత్తత ఇచ్చిరి. వెంకటనరసమ్మను దాదేపల్లి రంగారావుగారికి, అనంత లక్ష్మమ్మను బూర్గుల నరసింగరావుగారి కుమారుడు రామకృష్ణారావుగారికి, యిచ్చి వివాహము చేసిరి. ఈ రామకృష్ణారావుగారే హైదరాబాదులోని ప్రథమ ప్రజా ప్రభుత్వముయొక్క నాయకత్వము వహించిరి. తరువాత కేరళ మరియు ఉత్తరప్రదేశ్ గవర్నరుగా నుండి క్రీ. శ. 1962 లో రిటైర్ అయిరి. వీరి గురువు కందాళ బంగారు భావనాచార్యులవారు.

దాదేపల్లి రంగారావుగారు క్రీ. శ. 1946 లో, బూర్గులవారు క్రీ. శ. 1967 లో స్వర్గస్థులయిరి.

నరసింగరావునకు, రామచంద్రరావునకు, రెండేసి వివాహములు జరిగెను. నరసింగరావుగారికి మొదటిభార్యవలన సంతానము లేదు. రెండవభార్య అయిన రాధమ్మగారు దుస్తుంపేట దేశ్‌ముఖ్ రామరాజావారి కూతురు. వీరికి యశోద, ఇందిర, హేమలత, రమణ అను నలుగురు కుమార్తెలు, నరసింహారావు, గోపాలకిషన్ రావు, రాధాకృష్ణ అను కుమారులు గలిగిరి. రాధమ్మ క్రీ. శ. 1945లో మరణించెను. రామచంద్రరావు మొదటిభార్య ఆయారు దేశపాండ్య లక్ష్మారావుగారి కూతురు రత్నమ్మ. వీరికి ఊర్మిళ, రామ్మోహన్ రావు, మదన్‌మోహన్, రంగ అను సంతానము గలిగిరి. రత్నమ్మ క్రీ. శ. 1938లో మరణించెను. రెండవభార్య సీతమ్మకు నళిని, సుశీల, జగన్‌మోహన్‌రావు, విజయమోహన్‌రావు అను వారు కలిగిరి. మదన్‌మోహన్‌రావు "ముజాయితాపురం"లోని మా పినతల్లి కొడుకు నరసింహారావునకు దత్తుపోయెను.

నా పెద్ద కుమార్తెయశోదను బూర్గుల రామకృష్ణారావు గారి పెద్ద కుమారుడైన రంగనాధరావు గారికి, రెండవకుమార్తెఇందిరను కొండపల్లె శ్రీనివాసరావునకు, మూడవ కుమార్తె హేమలతను నందమూరు వెంకట నరసింహారావునకు, నాలుగవ కుమార్తె రమణను బొడ్డపాటి రవీంద్రనాధునకు ఇచ్చి వివాహం చేసినాము.

రామచంద్రరావు పెద్దకుమార్తె ఊర్మిళను అయితవోలు తిరుమలరావుగారికి రెండవకుమార్తె రంగను కొండపల్లి మనోహర రావు గారికి, మూడవకుమార్తె నళినిని వెలిజాల శ్రీనివాసరావునకు ఇచ్చి వివాహములు జరిపితిమి. నాపెద్ద కుమారుడు నరసింహారావునకు బూర్గుల రామకృష్ణారావు గారి రెండవ కుమారిత కృష్ణకుమారిని, రెండవ కుమారుడు గోపాలకృష్ణారావునకు తురగా విశ్వేశ్వరశర్మ గారి జ్యేష్ఠకుమార్తె శారదను ఇచ్చి వివాహములు జరుపబడినవి. రామచంద్రరావుగారి పెద్ద కుమారుడు రామ్మోహన రావునకు బూర్గుల రామకృష్ణారావు గారి తమ్ముడైన వెంకటేశ్వర రావు గారి పెద్ద కుమార్తె సుగుణను ఇచ్చి వివాహము జేసిరి. ఇటుల బూర్గులవారి కుటుంబముతో మా కుటుంబమునకు దగ్గర సంబంధ బాంధవ్యము లున్నవి.

గ్రంథకర్తగారి వంశము




(ఈ వ్యాసమునకు మాకు నరసింగరావు గారి సోదరుని పెద్దల్లుడు శ్రీఅయితవోలు తిరుమలరావుగారు వివరములందించిరి. వారికి కృతజ్ఞతలు.)

**శ్రీయుతులు కే. కిశోరుబాబు, కే. అశోకుబాబు.**

# జైన క్షేత్రము - గుమ్మిలేరు

శ్రీ మేడవరపు సంపత్ కుమార్ గారు "భారతి" మాసపత్రిక 1932 నవంబర్ 59 సంపు. - 11 సంచిక 68 పుటలో ప్రచురించినటి "జైనక్షేత్రం గుమ్మిలేరు" అను వ్యాసమును గ .నించి చాల సంతసించితిని. అయితే 1982 అక్టోబర్ నెల 59 సం. 10 సంచి 64-68 పుటల "భారతి" మాసపత్రికలో పచురింపబడిన "బౌద్ధ - తామ్రకరండము." (డుళ్ల) అను చారిత్రిక - సాంస్కృతిక వ్యాసముపై వెలువడిన పరిశీలనా వ్యాసముగుటచే శ్రద్ధగాపరిశీలించి సమాధానమీయ వలసిన బాధ్యతను కలిగియుండుటచే నీవ్యాసమును ప్రత్యుత్తరముగా వెలువరించ వలసి వచ్చినదని మనవి చేయుచున్నాను —

౧ మొదటి పేరాలో "కేవలం బౌద్ధ విహారాలు, శైవ తీర్థాలు గురించి మాత్రం చెప్పేరు. అదే పరిసర ప్రాంతమందు పైవాటితోబాటు అహమహమికముగా పరిఢవిల్లిన జైనవైభవాన్ని గుర్తించక పోవడం చాలా విచారకరం" అని తమ ప్రగాఢ సంతాపాన్ని వెలిబుచ్చినారు - నేను బౌద్ధ మతస్థుడనుగాని, బౌద్ధ మతాభిమానునిగాని - శైవ మతోద్ధారకుడనుగాని కానని విన్నవించుకొనుచున్నాను. అట్లే నే "జైనమత ద్వేషిని కాని జైనద్రోహిని" కాని కానేరనని విన్నవించుచు అంజలిడు చున్నాను. ప్రతి వారును ప్రతి విషయము నందును సర్వజ్ఞులు కానేరరు. అందుచే వ్యాసకర్తలైనను గ్రంథకర్తలైనను తమకున్న విజ్ఞానముతోనే తగు విధమున శ్రద్ధా భక్తి భయ వినయములతో కార్యసాధన గావింతురు. తెలియని విషయముల సుదీర్ఘముగా విమర్శింప బూనుట లేక పరివర్తనగా వెల్వరించుట సాహసముగు నేమోయని నా భయము. అంతియగాక గుమ్మిలేరు కాని దాని పరిసర ప్రాంతములందు గాని జైనక్షేత్రమున్నట్లు నేను కనివిని యుండని కింతిజ్ఞుడనైతిని.

౨ వ పేరాలో "వ్యాసంలో మరొక పెద్ద పొరపాటు పడ్డారు. "గుమ్మిలేరు" గ్రామ సమీపమునందు (గుమ్మినేరుకాదు) అని విమర్శించినారు. మంచిదే. ఈ గుమ్మిలేరు గ్రామము నా కాబాల్యము నెఱిగినదే. ముద్రాపకులు ముద్రించుటలో ఏ తొందరలోనూ గుమ్మిలేరును గుమ్మినేరుగా ముద్రణగావించిరి. ఆ పదములోని "లే" అను అక్షరమునకు బదులుగా "నే" అక్షరము పొరబాటే కావచ్చును. అయితే అది వ్యాసకర్తదిగాక ముద్రాపకులందలి అక్షరముల సమకూర్చు వారిదియు, ఆ పత్రమును సరిదిద్దు వారిది మాత్రమే కాగలదని నా మనవి. ఇట్టి దోషములు సాధరణ కరపత్రముల మొదలు మహాగ్రంథముల వరకును దృగ్గోచరములే. అందుకు తార్కాణ మా వ్యాసమునందే "గుమ్మిలే(నే)రు" కు ముందుగానే వెనుకవైపు పీఠఫలకము నందారు "వైపుల" అని ముద్రింపబడెను. అయితే వెనుక పీఠమున "కిరు" వైపులననియే కాదా యుండవలెను. కావున ఇట్టి అక్షర దోషములను "అర్థ రాహిత్యముగానంత వరకు వ్యాసకర్తలపై కుఱికింపు నెంత న్యాయమో సమర్థనీయమో తామేయోజింప వేడెద.

౩. మిగిలిన యీపరిశీలనా వ్యాసాంశములకు సమాధానము. సావధానచిత్తులరై పరిశీలించి దోషములనెఱిగింప ప్రార్థన. "ఆర్. అండ్. బి." శాఖవారు 1969లో మండపేట అలమూరు రహదారిని మరమ్మతులు గావించిరి. అందు గుమ్మిలేరునకు దక్షిణపు వైపునగల "వరహాల" కాలవపై నున్న యిరుకు వంతెనను తొలగించి వెడల్పు గావించిరి. అట్లిప్పుడచ్చట త్రవ్వుటలో నిలువు లోతున ఈ శిలావిగ్రహము బయల్పడి ప్రజల నాకర్షించినది. దాని నెట్లు భద్రపఱచవలెనో యోజింపగోరి ఆ యూరి సంపన్న గృహస్థులైన శ్రీవంక రామమూర్తిగారి వద్ద భద్రపఱచిరి. వారే ఆ విగ్రహమునకు ఛాయాబింబములు (ఫోటోలు) తీయించిరి. వారి కోరికతోనే ఆనాడు 1 అక్టోబరు 1959 తేదీ "ఆంధ్రప్రభ దిన పత్రికలో." ఆ ఛాయాబింబము సహితముగా ప్రకటింప బడినది. అందుపై ఆంధ్రప్రదేశ్ పురావస్తు తత్త్వశాఖవారి నిర్ణయము ఆర్కియాలజికల్ అసిస్టంటు డైరెక్టర్ ఆ. ప్ర. గుంటూరువారు 24 అక్టోబరు 1969 తేదీన శ్రీ రాళ్లబండి సుబ్బారావు, ఆంధ్ర హిస్టారికల్ రీసెర్చి సోసైటీ అండ్ మ్యూజియమ్సులో పని చేయు నధికారియైన శ్రీ బి. అక్కిరాజు గారిని ఆ విగ్రహము స్వాధినపఱచుకొని తేచ్చుటకై బంపించి యున్నారు. శ్రీ అక్కిరాజుగారు ఆ దినమున గుమ్మిలేరు వచ్చి విగ్రహమును పరిశీలించి క్రీ. శ. నకు సంబంధించిన కాలమందలి బుద్ధ విగ్రహముగా నిర్ణయించి గ్రామస్థుల సమక్షమున గ్రామధికారులనుండి స్వాధినము గావించు

కొనిరి. కాని రాత్రిదానిని రాజమహేంద్రవరం జేర్చు సందర్భమున గ్రామస్థులు కొందరు రద్దుపడి బండిపైనున్న విగ్రహమును ఆ యూరిరోడ్డు ప్రక్కను జేరిన చెఱువునకు దేంటివేసిరి. అపుడు ఆ వివాదపరిష్కారము నిమిత్తము రాజమహేంద్రవరపు సబ్‌కలెక్టరు వారి విచ్చేసిరి. గ్రామస్థుల కోరిక మన్నించుచు ఆ విగ్రహము స్థలాంతరమునకు మార్చుటగాని, అన్యాక్రాంతము గావించుటగాని, రూపురేఖావిలాసముల పరివర్తనము గావించుటగాని, పురావస్తుశాఖ వారి సూత్రములకుగాని వ్యతికారించని పద్ధతుల (షరతులు)పై ఆ గ్రామస్థులకే వదలివెళ్ళిరి. గ్రామస్థులా విగ్రహమునకు మందిర నిర్మాణము గావించి సురక్షిముగా భద్రపఱతుమని విన్నవించిరి. ఆపిదప కొంతకాలమునకా విగ్రహమునకు నొక మందిరముగావించిరనియు, భద్రపఱచి ప్రజలకు ప్రదర్శించినారనియు విన సంతసమయ్యెను.

ఆ విగ్రహము నేడు దొరికిన స్థలమునందు గాక వేరొక తావున గుమ్మిలేరు కాలువకు జేర్చబడుట గుమ్మిలేరు గ్రామస్థులు గాక రాజమహేంద్రవరపు జైన సంఘమువారు జైనాలయము నిర్మించి అందు తామాక్రమించి, స్వంత ఆస్తిగా అనుభవించుట పురాతనపు రూపురేఖా విలాసముల స్వేచ్ఛగా మార్పు చేసి అన్య విధముల భ్రమింపజేయుట అద్భుతము, ఆశ్చర్యము. ఇట్లు ఇన్ని మార్పులు ఎపుడు, ఎవ్వెవరివలన ఏ ప్రభుత్వానుమతి పత్రములతో జరిగినవో నూహింప శక్యము గాకున్నది.

వారు తామీ విగ్రహమును 23వ తీర్థంకరులగు పార్శ్వపార్శ్వకు నిదిగా నిర్ణయించి గుమ్మిలేరు జైన క్షేత్రముగా నిరూపింప దొర కొనిరి. సంతోషము. అయితే ఇంతవరకు నేనుగాని, నేనెఱిగిన విజ్ఞులు గాని, ప్రాంతీయులు గాని గుమ్మిలేరు ఒక సామాన్య గ్రామముగానే పరిగణించు చున్నారుగాని జైనక్షేత్రముగా గుర్తించినట్లు ఎఱుకలేదు. పోనిండు ఆ సమీపగ్రామములందైనను ఆ గుర్తులు గానరావు. ఏ గ్రంథమునందుగాని, రికార్డులందుగాని ఆ విషయ ప్రస్తావన గానరాదు. అందుకే గుమ్మిలేరు తమరన్న జైన క్షేత్రముగా గుర్తింప సావకాశము గలుగుటలేదని నా మనవి.

ఇది జైన తీర్థంకరులగు పార్శ్వనాథుని విగ్రహముగా తాముద్వాక్కుచ్చినారు. దానికి సావకాశమేర్పడుటలేదు. మీరన్న పార్శ్వనాథుని శిలావిగ్రహములు మొన్న మొన్నటి వరకును కాకినాడ తాలూకా "ఆర్యావట" గ్రామమున కొన్ని బుద్ధవిగ్రహములతో వాటిని నిలిపిరి. పురావస్తుశాఖవారిచే గుర్తింపబడి భద్రపఱుపబడి నేను కాకినాడకు చేరియున్నది. మఱియొకటి కాకినాడతాలూకా "శిలి" యను గ్రామపు బయట శ్యామలవర్ణ పాషాణ శిలామయమై యున్నది. జైన విగ్రహములు సాధారణముగా శిరోముండనంమ్మై యుండును. అందు పార్శ్వనాథ విగ్రహముల శిరోభాగము రెండుగాని, అంతకెక్కువగాని వరుసలలో సర్ప ముఖములు (ఫణాగ్రములు) ఛత్రాకారమున నుండుట ఆచారము. నేను చూపిన పార్శ్వనాథ విగ్రహములు గమనించిన తేటతెల్లము కాగలదు. బుద్ధ విగ్రహములు జైన విగ్రహముల కన్న పుష్టిగాను గంభీరముగాను, శిరాగమున (ఉంగరములు బోలిన) చిఱు వెండ్రుకలు గాని, ముడిగాని యుండును.

దిగంబర, శ్వేతాంబర విషయములు - శ్వేతాంబర విగ్రహములకు వస్త్రధారణయందు సన్న రేఖలు, వళులు ఏర్పడును దిగంబరముల చిహ్నములుండవు. అతి పెద్దవైన నట్టి పాషాణ విగ్రహములందు ధ్యాన ముద్రలో నున్నవాటికి గుహ్యాంగములు ప్రత్యక్షముగా చేరినవి. దిగంబరములో కేవల కౌపీన ధారణలో నిర్ణయించుట బహు కష్టము.

ఈ విగ్రహమును బోలిన విగ్రహములే (కవలలవంటి రూపమున) అవే కొలతలు, రూపురేఖలు గల బుద్ధవిగ్రహములు రామచంద్రపురంతాలూకాలో మాచవరం, వెల్ల గ్రామములందునుగలవు. ఈ విగ్రహములకు సామాన్యవైఖరి గాక వెనకవైపున చేరబడుటకు వీలుగా నుండు యొక శిలాఫలకము విగ్రహము నంటి యున్నది. దానికిరువైపుల సింహశీర్షాగ్రములు గల శిలాదండములు ఆ శిలనంటియున్నవి. దానిని గమనింప ఈ విగ్రహములు సామాన్య విగ్రహములు గాక ఒక చైత్య, విహారా, ఆరామ, స్తూపాది బౌద్ధక్షేత్రాధిపతులుగా సూచించుచున్నవి.

మఱియొకటి "వెల్ల" గ్రామపు చెఱువునందు దాగియున్నది. దానికి పృష్ఠభాగమున (స్థాపనార్థమగు) పీఠముగలదు.

ఆంధ్రప్రభ నాడు ప్రచురించిన ఛాయా బింబమును మాచవరము, వెల్ల గ్రామమందలి బుద్ధవిగ్రహమును దీనిని గమనించిన బౌద్ధమో, జైనమో నిరూపింప బడగలదు.

అయితే నేటి గుమ్మిలేరు విగ్రహమును పూర్తిగా పూర్వ రూపమును మార్చి వారిచ్చవచ్చినట్లు శిల్పవైఖరినీ మార్చి అన్యమనస్కుల గావించి భ్రాంతిగొల్పుచున్నారు. అనాటి విగ్రహములకు పీఠమున అక్షర సముదాయ లేదు. నేడిద్దానికి పీఠభాగమున నేటి దేవనాగరి అక్షర సముదాయమే ఇట్టి స్వేచ్ఛారూప పరివర్తనకు నిదర్శనము. తమరీ పై విషయము న్ని సమగ్రముగ బరిశీలించి నా దోషముల తగువిధముల నెఱుక గావించిన కృతజ్ఞతాంజలితో స్వీకరించెదనని సవినయముగా ప్రకటించుచున్నాను. అట్టి సదవకాశము గల్పించి విశ్వశ్రేయకులు కాగోరెది.

ఇట్టి విధమున నేడు పురాతన విగ్రహములు ఆరోజున కారోజు అన్యాక్రాంతములై స్వేచ్ఛా రూపముల ధరించి తొల్లిటి రీతులు రూపఱి పోవును. సంస్కృతీ సాంప్రదాయములకు దూరములై దేశచరిత - సాంప్రదాయ భంగకారకము లగటనే పురావస్తుతత్త్వశాఖ వారీ పై విషయముల గమనించి సత్వర చర్యల గైకొనుచు సక్రమమున సేకరించి భద్రపరుచుట, సంరక్షించుట శ్రేయస్కరమని భావించుచు పురావస్తుతత్త్వశాఖాధికారులకును విన్నవించు కొనుచున్నాను.

శ్రీ ముసునూరి సాంబశివరావుమూర్తి

## నన్నయ్య గద్యగతులు

వచనము, గద్యము తెలుగులో దాదాపు యేకార్థములోనే ప్రయోగింప బడుచున్నది. కొన్ని తావుల - అనగా అర్వాచీనాంత

గద్య మొదలగు చోట్ల మాత్రమే 'గద్య' అనేగాని వచనమను వాడుకలేదు. సంస్కృతములో గద్యకు వచనమను నామాంతరము లేదు. నిజమునకు వచనమనే పదము సంస్కృత పదమైనప్పటికిని అది ఆ భాషలో గద్యకు బదులుగా వాడబడలేదు. తెలుగులో యే కాలమున అది గద్యకు మారు పేరయిందో చెప్పలేము గాని నన్నయ కాలము నుండియు అవి పర్యాయములై యుండునని వచ్చును. "నవార్థ వచన రచనా విశారదు" (1-1-8) అను చోట వచనమునకు వేరే అర్థమున్నను గద్యమునకు పర్యాయమైన వచనమును కూడ నన్నయ మనసునందుంచుకొనియే ప్రయోగించి యుండు ననుట అసమంజసము కాదు. "వచనము లేకయ వర్ణన — రచియింపఁ గొంతవచ్చు." (నిర్వ. రా. 1-15) అని తిక్కన పేర్కొనుటచేత తిక్కన కాలము నుండి అవి పర్యాయములే యని మాత్రము మనము ఖచితముగా నిర్ణయింపవచ్చును.

సంస్కృతములోను కన్నడములోను దాదాపు 10వ శతాబ్ది నుండి చంపూ కావ్యములును, సంస్కృతములో అంతకు ముందు చాలా కాలము ప్రత్యేకముగా గద్య కావ్యములు రచితములు. సంస్కృత కన్నడ చంపూ సంప్రదాయముల ననుసరించి నన్నయ చంపూ రీతిలోనే ఆది కావ్యావిర్భావమునకు నాంది పలికెను. తరువాతి కవులందరును నన్నయనే అనుసరించినవారై దాదాపు యీ పద్ధతియే 19వ శతాబ్ది వరకు అవిచ్ఛిన్నముగా సాగిన దనవచ్చును.

నన్నయ తాను రచించిన రెండున్నర పర్వముల భారత భాగములో మూడవ వంతు వచనమునే ప్రయోగించియున్నాడు. తెలుగులో మరి యే కవియు వచనమునకు నన్నయ యిచ్చిన ప్రాధాన్యత నివ్వలేదు. పద్య గద్యములను వేర్వేరుగా లెక్కించినట్లైతే అన్నిటికన్నా వచన సంఖ్యయే అధికము. తరువాత స్థానము కందపద్య మాక్రమించును.

నన్నయ సంఖ్యలో మాత్రమే గాక రచనా విధానములోను పద్య గద్యముల కభేదమాత్రముగా రచన సాగించినాడు. ఇట్లు వచనమునకు పద్యమున కిచ్చినంత గౌరవము నిచ్చిన కవి తెలుగులో మరియొకడు లేడు.

'గద్యం కవీనాం నికషం వదంతి' అను ఆర్యోక్తి తెలుగులో ఒక్క నన్నయయందే ప్రవర్తించును. మిగిలిన చంపూకవులెవరును గీటురాయిగా భావించి వ్రాయలేదు.

తెలుగులో నన్నయ పద్యవిద్య కాద్యుడైనట్లే గద్యవిద్యకును ఆద్యుడగుటయే గాక ఆద్యంతములు నతడే యనుటలో (ప్రాచీనులలో) అసమంజస మెంతమాత్రము లేదేమో యనిపించును.

సంస్కృతమున ఆలంకారికులు గద్యమును చూర్ణకము, ఉత్కలికా ప్రాయము, వృత్తగంధి అని మూడు విధములుగా విభజించిరి. ఈ చూర్ణకాది భేదములను నన్నయ యెట్లు నిర్వహించెనో తెలుపుటయే యీ వ్యాసోద్దేశము. ఇట వామనుని కావ్యాలంకార సూత్రవృత్తిలోని లక్షణములే గ్రహింపనైనవి. (విస్తర భీతిచే లాక్షణికు లందరి లక్షణములను, వాని ఔచిత్యానౌచిత్యములను పరిశీలింపక విడువనైనది.)

1. చూర్ణకము :- వామనుడు దీనినే చూర్ణమని వ్యవహరించెను. 'అనావిద్ధ లలిత పదం చూర్ణమ్' అని అతడు నిర్వచించెను. (1-3-24)

భరతముని గద్యమునే చూర్ణమని పేర్కొనెను. తెలుగులో సంకీర్తన లక్షణకారకుడు కృష్ణమాచార్యాదుల వచనములను చూర్ణములనియే ప్రయోగించెను. (చూ. వచనరచన-తాళ్ళపాకవారు-సింహావలోకనము-వేటూరి ప్రభాకరశాస్త్రి పు. 99)

సులభశైలియే దీనికి ప్రాణమని భావింపవచ్చును. లలిత పద సమాయుక్తమై యుండుట, అసమాసకమై యుండుట దీని ప్రధాన లక్షణము. ఒకరకంగా జెప్పవలెనంటే తేట తెలుగు తియ్యదనమంతా చూర్ణకములోనే యిమిడి పోవును.

నన్నయ యెక్కువగా సంస్కృత పదజాలమునే ప్రయోగించియున్నను తెలుగువారి కర్థముకాని సంస్కృత పదజాల మందు తక్కువ. నన్నయ వచనములలో ఉత్కలికాప్రాయము కన్నా చూర్ణకములే యెక్కువ. ఆయనది కథాకథన పద్ధతి యగుటచేత చూర్ణకములే యెక్కువ దొరలిన వనవచ్చును.

ఈ వచన భేదముతో చిన్నచిన్న వచనములు లెక్కకు మిక్కిలి గలవుగాని పెద్దవచనముల రెండింటిని మాత్రము ఉదాహరింతును.

(i) "వ. అట్టి యిందోత్సవంబున నతి ప్రీతుండయిన యింద్రు వరంబున నుపరిచరుండు బృహద్రథ, మణివాహన, సౌబల యను రాజన్యులనియెడి కొడుకుల నేవురం బడసి వారల నెక్కు దేశంబుల కభిషిక్తులంజేసిన నయ్యేవురు వాసవులు వేఱువేఱు వంశకరులయి పరగి రట్లుపరిచరుండు లబ్ధసంతానుండయి రాజర్షియయి రాజ్యంబు సేయుచు నిజపుర సమీపంబునం బాఱిన శుక్తిమతియను మహానదిం గోలాహలంబను పర్వతంబు గామించి యడ్డంబు వడిన .. " (1-3-28) ఇత్యాది వచనమంతయు చూర్ణకమే.

(ii) "వ. దీని యందు రాక్షస భావం బుపలక్షింప వలవదు మాకు నాత్మీయ బుద్ధియ యుండు ననిన హిడింబ ధర్మరాజునకుం గుంతీదేవికి మ్రొక్కి యేకాంతంబునఁ గుంతి కిట్లనియె నవ్వా! సర్వ ప్రాణులకు సామాన్యంబయ్యును మనోజరాగంబు వనితల కసహ్యంబయి విశేషంబయి యుండు నేను వృకోదరు నిమిత్తంబు మదనబాణ బాధితనయి . " (1-6-222) ఇత్యాది మరి కొంత వచనమున్న.

2. ఉత్కలికాప్రాయము : 'విపరీత ముత్కలికాప్రాయమ్' అని వామనుడు దీనిని నిర్వచించెను (1-3-25). విపరీత మనగా చూర్ణకమునకు వ్యతిరిక్తమైనదని యర్థము. చూర్ణకము అసమాసకము కాగా ఉత్కలికాప్రాయము దీర్ఘసమాసకము. ఇది యెక్కువగా ఓజోగుణము నుద్దీపింపజేయును.

దండ్యాచార్యుడు "ఓజః సమాసభూయస్త్వ మేతద్గద్యస్య జీవితమ్" అని కావ్యాదర్శములో నిర్వచించెను (1-80). ఓజోగుణము = గద్యము > ఉత్కలికాప్రాయ గద్యము — అని భావింపవచ్చును. ఇది సమాస భూయిష్ఠమై యుండును. సమాసభూయిష్ఠ

మైన గద్యమే యెక్కువగా రాణించుననియు అసమాసక గద్యము వినుటకు సొంపుగా నుండదనియు దండి అభిప్రాయమైయుండును. నిజమునకు సంస్కృతములోని గద్య సమాస భూయిష్ఠమైతేనే అందంగా ఉంటుంది. అసమాసకత అందు రాణించదు. తెలుగు పదజాలములో నిది కుదరదు. కావున తెలుగులో ఉత్కలికాప్రాయ గద్యమును రచించు కవులు అట్టి సందర్భములందు సంస్కృత పదజాలమునే ఆశ్రయించిరి.

నన్నయ ఉత్కలికాప్రాయముల నేలనో అంతగా రచింపలేదు. ఆయన కథాకథన పద్ధతి కిది సరిపోదు కాబట్టి దాని నంతగా రచింపలేదేమో అని అనిపించును. పద్యములలో ఓజోగుణమును యెన్నోమార్లు ప్రదర్శించిన నన్నయ అదే సందర్భములోని దయ్యేను వచనములో నీ గుణము నంతగా స్పృశింపలేదు. అసలే వ్రాయలేదని అర్థము కాదు. తక్కువగా వ్రాసెనని భావము. దీనికి రెండు ఉదాహరణములు పరికింపుడు —

(I) "వ. అనిన విని జరాసంధుండు సటాసముత్పాటన కుపిత కుంజరవైరియుంబోలెఁ గడునలిగి పటుకుటిలభ్రుకుటిఘటిత నిటలుం డగుచుఁ బురుషోత్తమున కిట్లనియె" (2-1-195).

(ii) "వ. .. ద్రుపదుండైశ్వర్యగర్వంబున మెచ్చక పలికిన విని ద్రోణుం డవమానజనిత మన్యుఘూర్ణమానమానసుండయి యెద్దియుం జేయునది నేరక పుత్రకళత్రాగ్నిహోత్ర శిష్యగణంబులతో హస్తిపురంబునకు వచ్చె...." 1-5-206).

వేట వన, పుర వర్ణనాదులలో నీ గద్యభేదము నెక్కువగా తెలుగు కవులు వాడిరి. దీనికి నన్నయయే మార్గదర్శకుడు కానోపు. పురవర్ణన సందర్భములోని ఒక ఉదాహరణ తిలకింపుడు-

(iii) "వ. అని పంచిన వారును వారణావతంబున ననవరత సురభికుసుమ ఫలభార నమ్రశాఖా విశాల తరువనరేఖాలంకృతం బనియును, వన జలకేళీ కందుక మృగయాది వివిధ విహార హర్మ్యప్రదేశాభి శోభితం బనియును నవసుధా ధౌతసౌధ సుధాకరనికర ప్రభాపటల ప్రధ్వంసితాసితపక్ష దోషంబనియును.." (1-6-133) ఇత్యాదిగా మరి కొంత వచనము గలదు.

3. వృత్తగంధి :- 'పద్యభాగవత్ వృత్తగన్ధి' (1-3.23) అని వామనుడు నిర్వచించెను.

కవులు సాధారణముగా ఛందోయుక్తమైన రచన యందే ఆసక్తి కలిగి యుందురు. చంపూ కావ్యమునందు పద్యముల మధ్య అచటనచట వచనములు ప్రవేశించు చుండును. ఆ పద్యముల వేగములోనే గద్యమునందును ఛందోయుక్త రచన గాన్పింప వచ్చును. కేవల గద్యకావ్యము నందును కవికి తెలియకనే వృత్తగంధులు రచితములు కావచ్చును. ఇట్టివానినే వృత్తగన్ధి గద్యములుగా లాక్షణికులు పేర్కొనిరి.

నన్నయ రచనలో యిట్టివి పెక్కులు గలవు. కొలది మార్పులను గావించిన పూర్తి పద్యపాదములు లభించు వచనము లున్ను గలవు. అసమగ్రముగా పరిశీలించియు నేనే యింతవరకు 30 దాకా యిట్టి వచనములను గుర్తించితిని. సూక్ష్మ పరిశీలన గావించిన యింకను యెన్నింటినో గుర్తింపవచ్చును. విస్తరభీతిచేరెండుఉదాహరణములనుమాత్రమే పేర్కొందును.

i) "వ. గరుడండును గద్రువ పంచిన పనులెల్లను వినత యనుమతంబున నతి వినయ పరుండై చేయుచు." (1-1-43)

ఇందు సీస పద్యపాదము గలదు. —

సీ. "గరుడండును గద్రువ పంచిన పనులెల్ల
ను వినత యను మతంబున నతివిన
య పరుఁడై చేయుచు" —

(ii) "వ. అని రూక్షాక్షర వచనంబుల నాక్షేపించుచున్న శిశుపాలుంజూచి సహింపనోపక భీమసేనుం డతిరౌద్రాకారంబున నలిగిన." (2-2-50)

ఇందు కంద పద్యపాదములు రెండు గలవు,

కం. — "రూక్షాక్షర వచనంబుల
నాక్షేపించు — శిశుపాలుఁజూచి సహింపన్" —

కొలది మార్పులతో నన్నయ వచనముల నెన్నింటినో పద్యములుగా మార్చవచ్చునని తెలియుచున్నది. ఒక్క ఉదాహరణ మాత్ర మిచ్చెదను.

(iii) "వ. అగ్గరుఁడని మహాత్మ్యంబు నీవు నెఱుంగుదువది యెట్లనినఁ దొల్లి కశ్యపప్రజాపతి పుత్రార్థియై భవత్ప్రభృతులైన దేవగణంబులను వాలఖిల్య ప్రముఖులైన మహాముని గణంబులను దనకు సహాయులనుగాఁ బడసి .... " (1-2-84)

ఇందు తేటగీతి పద్యము గలదు — కొలది మార్పులతో.

తే గీ. "అగ్గరుఁడని మహాత్మ్యంబు నీవు నెఱుఁగు
దువది యెట్లనినన్ దొలి కశ్యపు (డను
యా) ప్రజాపతి పుత్రార్థియై భవత్ప్ర
భృతులయిన దేవ గణ (ములన్) వాలఖిల్య" —

ఈ విధముగా గద్య భేదములను నన్నయ యెంతో చక్కగా భారతమునందు నిర్వహించి తర్వాతి కవులకు యెన్నియో అంశములందు మార్గదర్శకుడైనట్లే వచనరచన యందును మార్గదర్శకుడయ్యెను. పద్యగద్యముల రెండింటికి నాద్యుడై నన్నయ సంస్తవనీయుడయ్యెను.

శ్రీ వి. సత్యనారాయణ

## లేఖ

## విజ్ఞప్తి

నేను "మట్లరాజుల చరిత్ర" అను పుస్తకమును వ్రాయుచున్నాను. వీలునుబట్టి చాలా శాసనములను సేకరించగలిగినాను ఇకనూ సేకరించవలసినది చాలావున్నది. పండితులు, పరిశోధకులు వీలునుబట్టి మట్లరాజుల పూర్తి వంశావళిని - చరిత్రను వ్రాసి ఈ క్రింది అడ్రస్సుకు పంపించి, నా ప్రయత్నమును సఫలీకృతము గావించుదురని ప్రార్థించుచున్నాను —

మట్లరాజుల వంశావళి మదరాసు ప్రాచ్యలిఖిత భాండాగారములో వున్నదని వింటున్నాను. ఈ నాలేఖను తమ సహచరులకు చూపించ కోరుచున్నాను. రచయిత చిరునామా :

డాక్టర్ తలుపూరు వాగేశ్వరరావు, (మాజీ) కార్వేటినగర్ ఆస్థాన వైద్యులు, బ్రాహ్మణవీధి, కొత్తపేట, చంద్రగిరి-517 101.

# గ్రంథ విమర్శలు

## శ్రీ గాయత్రీ మంత్రము

[శ్రీ పండిత నరదేవ్ వేదాలంకార్ హిందీ మూలమునకు ఆంధ్రానువాదం. అనువాదకులు : శ్రీ. పి. వి. రమణారెడ్డి, ప్రిన్సిపాల్, అవుతు రామిరెడ్డి జూనియర్ కళాశాల, కొల్లిపర-522 304. క్రౌన్ సైజు 32 పుటలు. శ్రీ దయానంద సంస్థాన్, న్యూ ఢిల్లీ వారి సౌజన్యంతో ప్రకటించబడింది. ప్రతులు అనువాదకుల వద్ద దొరకును.]

ఆయా మంత్రాలవల్ల నిర్దిష్టమైన ఫలాలు లభిస్తాయి. కాని, గాయత్రీ మంత్రజపం వల్ల జపించేవారికి రక్షణ కలుగుతుంది. గానం చేసే వారిని - జపించేవారిని రక్షించడం వల్లనే ఆ మంత్రానికి ఆ పేరు వచ్చింది. మంత్రాలన్నింటిలో దీనిని మించినది లేదు. "న గాయత్ర్యాః పరో మంత్రా న మాతుః పరదైవతమ్" అని అభిజ్ఞులు చెప్తారు. తల్లిని మించిన దైవం లేదు, గాయత్రిని మించిన మంత్రం లేదు - అని దీని అర్థం. ఈ గాయత్రీ మంత్రాన్ని బోధించడమే బ్రహ్మోపదేశం.

కొంతకాలం క్రిందటి వరకూ దీని హక్కు కొందరికే భుక్తమయి ఉండినా, యిప్పుడు అందరూ దీని ప్రయోజనాన్ని పొందే అవకాశం ఏర్పడింది. అనువాదకులు శ్రీ విశుద్ధానందపురి స్వామివారి ఉపదేశం వల్ల ప్రభావితులై, ఆధ్యాత్మిక ప్రచారం సాగిస్తున్నప్పుడు ఈ మంత్రాన్ని బోధించడం జరిగేది. ఈ మంత్రార్థాన్ని గురించీ, వైశిష్ట్యాన్ని గురించీ తెలుపవలెనని చాలా మంది కోరినందున, అది గ్రంథరూపంలో ఉంటుందని దీని ప్రకటనకు పూనుకున్నారు. హిందీలో పండిత నరదేవ్ వేదాలంకార్ గారు రచించిన గ్రంథం సంగ్రహంగానూ, సులభంగానూ, ప్రామాణికంగానూ ఉన్నందున దానినే అనువదించారు.

శ్రీ రమణారెడ్డిగారు సంస్కృతాంగ్ల హిందీభాషల్లో గట్టి కృషి చేశారు. ఆంధ్రయూనివర్సిటీ, లాహోర్ యూనివర్సిటీ, కాశీ హిందూ విశ్వవిద్యాలయం మొదలైన గొప్ప సంస్థలవల్ల సాహిత్యవిద్యాప్రవీణ, శాస్త్రి, సాహిత్యరత్న, ఎం. ఎ. మున్నగు పట్టాలు పొందారు. కొన్ని కళాశాలల్లో అధ్యక్షపీఠం అలంకరించి విషయబోధనలో మంచి అనుభవం సంపాదించారు. ఆయన తమ అనుభవాన్ని ఈ రచనలో ఉపయోగిస్తూ సులభపద్ధతిలో అందరికీ సుబోధంగా దీనిని కూర్చారు. గాయత్రీ మంత్రాన్ని గురించి తెలిపే ప్రత్యేక గ్రంథాలూ, సంధ్యావందన భాష్యం మొదలైనవీ ఇది వరకే ఉన్నాయి. అవి శాస్త్రాలకు సంబంధించిన పారిభాషిక పదాలతో కూడి ఉన్నందున అందరికీ సులభంగా అర్థం కావు. అందువల్ల అందరికీ బోధపడే రీతిలో సంగ్రహగ్రంథం అవసరం ఉన్నది. దీన్ని ఈ చిన్న గ్రంథం తీర్చగలిగింది.

ఇందులో గాయత్రీ మంత్ర జపానికి కావలసిన నియమాలు, గాయత్రీ మంత్రార్థమూ సంగ్రహంగా చెప్పబడినవి.

అర్థవివరణతో పాటు ఈ మంత్రంలోని ('తత్స వితుర్వరేణ్యం, భర్గోదేవస్య ధీమహి, ధియో యోనః ప్రచోదయాత్' అనే దానిలోని) పదాలు ఒక్కొక్క దానికీ విశిష్టార్థం విపులంగా చెప్పబడినది. సులభంగా గాయత్రీ మంత్రాన్ని గురించి తెలుసుకోవాలంటే ఈ పుస్తకాన్ని చదవడం అవసరం.

## శ్రీ వేదాంత పంచదశి సారసంగ్రహము

[శ్రీ విద్యారణ్యులు రచించిన సంస్కృత మూలానికి ఆంధ్రానువాదం. అనువాదకర్త : శ్రీ అరిపిరాల వేంకట సోమాచార్యులు, రిటైర్డ్ ఇంజనీరు (పి. డబ్ల్యు. డి.) బాపూజీనగర్, కొవ్వూరు, పడమటి గోదావరి జిల్లా. క్రౌను సైజు 8+201 పుటలు. వెల: రూ. 10 లు. ప్రతులు గ్రంథకర్త వద్ద దొరకును.]

సాధారణంగా లౌకిక విషయాలమీద ఉండే ఆసక్తి ఆధ్యాత్మిక విషయాలమీద ఉండదు. ఒకవేళ ఆసక్తివున్నా, ఆ విషయాలను బోధించేవారు శాస్త్రీయవిషయాలను సులభంగా అర్థమయేరీతిని చెప్పలేకపోతే ఆ ఆసక్తి తగ్గిపోతుంది. అందువల్ల వేదాంత విషయాలను తెలిపేవారు ప్రజా సామాన్యానికి అనువుగా సులభంగా బోధించవలసి వుంటుంది. ఈ విషయాన్ని గ్రహించే శ్రీ శంకర భగవత్పాదుల అనుయాయులు, అద్వైత మత ప్రచారకులు అయిన విద్యారణ్య మహాస్వాములు పదిహేను అధ్యాయాలలో అందరికీ సులభంగా అనుష్టుప్ ఛందస్సులో వేదాంత విషయాలను వివరిస్తూ "వేదాంత పంచదశి"ని రచించారు. దానికి అనువాదరూపంగా వచనంలో ఈ "వేదాంత పంచదశి సారసంగ్రహం" వెలువడింది.

సంస్కృత భాషను అభ్యసించేవారికి మొదట కాళిదాసు మహాకవి రఘువంశంతో పారం ప్రారంభిస్తారు. ఆ విద్యార్థి క్రమ క్రమంగా ప్రౌఢంగావున్న నైషధాదులను చదివి పాండిత్యం సంపాదిస్తాడు. ఆ విధంగానే వేదాంతంలో సామాన్యవిషయాలు తెలుసుకోడానికి మొదట వేదాంతపంచదశినే ప్రారంభిస్తారు. ఇందలి విషయాలు అవగాహన అయిన తర్వాత పై గ్రంథాలు అధ్యయనంచేసి, సమగ్రంగా వేదాంతతత్త్వాన్ని గ్రహిస్తారు.

వేదాంత పంచదశిలోని పదిహేను ప్రకరణాల్లోనూ వరుసగా తత్త్వవివేకం, మహాభూతవివేకం, పంచకోశవివేకం, ద్వైత వివేకం, మహావాక్యవివేకం, చిత్రదీపం, తృప్తిదీపం, కూటస్థదీపం, ధ్యానదీపం, నాటకదీపం, యోగానందం, ఆత్మానందం, అద్వైతా నందం, విద్యానందం, విషయానందం వివరించబడి యున్నవి. పూర్వ మీమాంసకు "అర్థ సంగ్రహం" ఎటువంటిదో ఉత్తర మీమాంసకు ఈ అద్వైత పంచదశి అట్టిది.

సంస్కృతంలో చిన్న శ్లోకరూపంలో ఉన్న విషయాన్ని తెలుగువచనంలో వివరించాలంటే కొంత ఎక్కువగానే వ్రాయ వలసి ఉంటుంది. లేకపోతే అంశం సుగమంగా ఉండదు. అను వాదకులు వివరంగానే వచనం వ్రాశారు. మూలసారాన్ని సంగ్ర హించుటవల్ల సారసంగ్రహమని పేరుపెట్టి ఉంటారనుకుంటాను. వచన రచన సులభంగా అర్థమయ్యే రీతినే సాగింది.

అనువాదకులు ఆంగ్లంలో ఉన్నత విద్యను అభ్యసించి, బాధ్యతాయుతమైన ఇంజనీరు పదవిని నిర్వహించిన ప్రతిభా వంతులు. ఇంగ్లీషు అభ్యసించినా సంస్కృతంలో కూడా కృషిచేసి, పాండిత్యం సంపాదించారు. వారిదృష్టి వేదాంతంమీదికి మళ్లడంతో అందులో ప్రగాఢ కృషి చేశారు. నియమనిష్ఠాపరులై శ్రీవిద్యో పాసకులైనారు. తానుతెలుసుకున్న వేదాంతవిషయాలను ఆంధ్రుల కందజేయడమే వారి సంకల్పం. ఆయన విషయం సుబోధం కావడానికి చిత్రాలనుకూడా ఇందులో చేర్చియున్నారు.

శ్రీ సోమాచార్యులుగారు ఈ గ్రంథాన్నిగురించి చెప్తూ, అద్దంలో ముందుభాగం మాత్రమే కనబడుతున్నట్లు, ఇందులో సాధారణ విషయాలే చెప్పబడినవనీ, వెనుకభాగం కానరానట్లు - విశేషవిషయాలు చెప్పబడలేదనీ, వాటికోసం విశిష్టాలైన గ్రంథాలను చూడవలసి యున్నదనీ చెప్పడం వారి సహృదయతను వెల్ల డిస్తున్నది.

దీని ముద్రణకు తిరుమల-తిరుపతి దేవస్థానాలవారి ఆర్థిక సహాయం లభించడం ముదావహం.

తిరుమల వేదశాస్త్రాగమ విద్యాకేంద్రం అధ్యక్షులు శ్రీ ధూళిపాళ రామచంద్రశాస్త్రిగారు, శ్రీ గాయత్రి పీఠాధిపతులు శ్రీ చిదానంద భారతీస్వామివారు, 'శ్రీ శంకర కృప' సంపాదకులు శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారు ఈ గ్రంథ ప్రాశస్త్యాన్ని వెల్లడిస్తూ సదభిప్రాయాలను ఇచ్చారు. అద్వైతమత జిజ్ఞాసువులు ఆదరించవలసిన గ్రంథం ఇది.

## శ్రీ బులుసు వేంకట రమణయ్య

# పాముల ప్రపంచం

[రచయిత: డా. మైనేని కేశవ దుర్గా ప్రసాద్. భానుపబ్లికేషన్స్, గుంటూరు వారి ప్రథమ ప్రచురణ. వెల ఏడున్నర రూపాయలు. రచయిత పేర జంతుశాస్త్ర విభాగం, నాగార్జున యూనివర్సిటి, నాగార్జున నగర్ - 522 510 అన్న చిరునామాకు రాసి వివరాలు పొంద వచ్చును.]

వయోజనుల విద్యాప్రణాళిక క్రింద జాతీయ బహుమతిని పొందిన రచన ఇది. జీవశాస్త్ర జ్ఞానం ఏ మాత్రమూ లేనివారికి కూడ అర్థమయ్యేలా ఉపన్యాస ధోరణిలో ఈ రచన కొనసాగింది. ప్రకృతి వ్యవస్థలో మానవాళికి సర్పరాశికి మధ్యనున్న సంబధ బాంధ వ్యాన్ని మరింత విస్తృతంగా చర్చించి ఉండవచ్చును.

ప్రపంచపర్యంతంగా లభ్యమయ్యే 2500 ప్రజాతుల పాములలో కేవలం 52 ప్రజాతులు మాత్రమే విషసర్పా లని తెలిపి ఉండవలసింది. పాము నాలుకకున్న విశిష్టతను వివరించలేదు. పాముువిషయంలో నాలుక కేవలం రుచిని మాత్రమే తెలిపేదికాదు. దానికి ఘ్రాణశక్తి, శ్రవణశక్తి ఉండడమేకాక గుర్తించి, అనుభూతం పొందగల చైతన్యం కూడ ఉంటుంది. దీని మీద ఈనాటికీ పరిశోధన కొన సాగుతోంది!

"నాగుపాముకు ఏకపత్నీవ్రతం ఉంది" - అనే మాట శాస్త్రీయఆధారంలేనిది. ర్యాట్‌స్నేక్‌ను జెర్రిపోతు అని అంటారు కాని జెర్రి అని పిలవరు (31వ పేజి). జెర్రి, తేలు వంటివి ఒక కోవకు చెందినవి.

"పాముకాటుకు మంత్రాలు పనిచెయ్యవు" - అనే మాట సందేహాస్పదమైనది. కొన్ని వేల సాక్ష్యాలు అందుబాటులో ఉండగా అబద్ధమని త్రోసి పారేయడం పిడివాదం. పాములను హిప్నటైజ్ చేస్తారన్న సంగతి రచయిత తెలుసుకోవలసిన అవసరం ఉంది. పాము విషాన్ని హరించే ఎన్నో మూలికలుండగా లేవని రచయిత అనడం దుందుడుకు చర్య.

పాములవల్ల ఉపయోగాలను ప్రస్తావించేటప్పుడు పాము విషానికి వైద్యరంగంలో ఉండే అపూర్వమైన స్థాయిని వ్యక్తపరచలేదు. నరాలకు సంబంధించిన కుష్ఠు, మూర్ఛ, ఉబ్బసం వంటి వ్యాధుల నివారణకు మలయా దేశానికి చెందిన పంబూ, టామూల్ వంటి సర్పజాతుల విషాన్ని ఉపయోగిస్తారు. ఎన్నో ఎంజైమ్‌ల తయారీలో నాగుపాము విషాన్ని వాడుతారు. ఇవన్నీ రచయిత చెప్పలేదు.

పుస్తకంలోని వ్యంగ్యచిత్రాలు మంచి రిలీఫ్‌ని ఇస్తాయి. మొత్తం మీద వెల ఎక్కువ అని అనిపించకపోతే ఒక్కసారి చదవదగ్గ - చదివి, ప్రోత్సహించదగ్గ ప్రాథమికస్థాయి రచన ఇది.

**డా॥ గుమ్మనూరు రమేష్‌బాబు**

## మధునాపంతుల సాహిత్య వ్యాసాలు

[మూల్యం:- రు- 10-00లు. ప్రతులకు:- మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, త్యాగరాజనగరం, రాజమహేంద్రి - 1]

ప్రసిద్ధాంధ్ర కవి శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి గారి సాహిత్య వ్యాసాలివ్వి. ఈ వ్యాసాలలో ప్రాచీనాంధ్ర మహా కవుల కవితా వైదుష్యాన్ని, వచ్యాంధ్ర సాహిత్యంలో '1900 సంవత్సరం నుంచి 1947 వరకూ వికసించిన వ్యాసరచనా సంవిధానాన్ని, నేటి పద్యరచనా భవితవ్యాన్ని వివరిస్తూ చివరిగా వారి సాహిత్య దృక్పథాన్ని పేర్కొనటం జరిగింది.

ఆంధ్రమహాభారతము- వచనోపక్రమము అనే వ్యాసంలో మూడు అంశాలకు ప్రాధాన్యం ఇవ్వటం జరిగింది. మొదటిది నన్నయగారి దృష్టిలో వ్యాకరణ, పురాణ, కావ్యములకు గల స్థానం. రెండవది 'అథ' అని సంస్కృతాంధ్ర అవ్యయములకు గల బలీయమైన సంబంధం. మూడవది నన్నయగారి వచనోపక్రమంలో కావ్యాదిని గల 'అని'లో సూచ్యార్థసూచన. రెండవ వ్యాసం నన్నయ తిక్కనలు- అవతారికల తెన్నులు. నన్నయ గారు వారి అవతారిక పరోక్ష పరిభాష పద్ధతిలో, తిక్కనగారు ప్రత్యక్ష సంభాషణ పద్ధతిలో చెప్పారని చెబుతూ నన్నయగారిని రాజనరేంద్రుడు 'భారత బద్ధ నిరూపితార్థ మేర్పడఁ దెనుఁగున రచియింపు మధిక ధీయుక్తి మెయిన్' అని అడిగినట్లు ఆంధ్ర మహా భారతావతరణకు గల మూల కారణాన్ని వివరించారు. తిక్కన గారికి హరిహరనాథుడు కలలో కనిపించి 'కృతిపతిత్వ మర్థించి వచ్చితిఁ దిక్కన శర్మ' అనడం జరిగింది. నన్నయగారి పరోక్ష పద్ధతికి, తిక్కనగారి ప్రత్యక్షపద్ధతికి వారి వారి శైలీ సంవిధానమే కారణం. ఒకరిది వర్ణనాత్మకం; ఒకరిది నాటకీయం. "ఒకని కవిత ప్రసన్న కథాకలితము. వేరొకనిది ఊర్జిత కథోపేతము; ఒకడు నానారుచిరార్థ సూక్తినిధి; వేఱొకఁడు నానారసాభ్యుదయోల్లాసి; ఒకఁడు జగద్ధితమునకు భారతము వ్రాసెను; వేఱొకఁడు బుధ సంతోషమునకు భారతము వ్రాసెను" అని నన్నయ తిక్కనల దృష్టి కోణాల్ని సత్యనారాయణశాస్త్రి గారు స్పష్టం చెయ్యటం జరిగింది. "తెలుగు సారస్వతమున నన్నయ తిక్కనల భారతావతారికలు పూర్వోత్తర మీమాంసలకుఁ బ్రతిచ్ఛందములు. భట్టారకులది జైమిన్యంశ. సోమయాజులవారిది ద్వైపాయనాంశ. తెలుగు కవుల పాలిటికి వారు ధర్మబ్రహ్మ దర్శన కారులు" అని శాస్త్రిగారు నన్నయ తిక్కనల పట్ల వారికి గల భక్తి ప్రపత్తులను వెల్లడించుకున్నారు. నన్నయ తిక్కనల గద్య పద్యములు అనే వ్యాసంలో శాస్త్రిగారు ఒక విశేషాన్ని సోదాహరణంగా చెప్పారు. నన్నయగారి గద్యరచన అలతి మార్పులతో పద్యరచనగా మారుతుంది. తిక్కనగారి పద్యం గద్య లక్షణాన్ని కలిగి ఉంటుందని ఈ రెండిటికీ శాస్త్రిగారు విస్తారంగా ఉదాహరణలు ఇచ్చారు. "నన్నయ పద్య విద్యకు వలెనే, తిక్కన గద్య విద్యకు అద్వైప దేష్ట. నన్నయ గద్యమును సైతము పద్యముగా పాడి చూపించెను. తిక్కన పద్యములో వ్యక్త వాఙ్మధురమైన గద్యము నుపన్యసించెను" అని శాస్త్రిగారు అభిప్రాయపడుతున్నారు. అక్షర రమ్యత శరీర లక్షణం కాగా లోనారయుట ఆత్మ లక్షణ మయింది నన్నయగారికి. రసోచిత పదబంధం, పద్య నిర్మాణంలో ధ్వని శిల్పం తిక్కనగారి ఆస్తి. ఇద్దరిలో ఏ ఒక్కరినీ తక్కువ పరచటం నా అభిప్రాయం కాదని శాస్త్రిగారు అనటం వారి పరిశుద్ధ వాక్కుకు తార్కాణం. నన్నయగారి వెన్నెలరేయి వ్యాసంలో అరణ్య పర్వమంతా నన్నయగారే రాసారనే వాదంతో శాస్త్రిగారు భేదించారు. వాస్తవంలో అంగీకరించారు. అరణ్య పర్వంలో నన్నయగారి పద్యరచనాంతంలోనూ, వారి జీవితాంతంలోనూ ఒక

విశేషాన్ని చూపించారు. "ఆదిపర్వము బ్రహ్మచర్యాశ్రమము; సభాపర్వము గార్హస్థ్యము; అరణ్య పర్వము వానప్రస్థము .. సరిగా యుధిష్ఠిరుని వానప్రస్థములో భట్టారకుల తరీయాశ్రమ స్వీకారము జరిగియుండును.... నన్నయస్వామి ప్రథమ చాతుర్మాస్య దీక్షానంతరము ముక్తుడయ్యెననుటను శారద రాత్రులు అను చరమ పద్యము సూచించును" ఇట్లా నన్నయ్య కావ్యరచనాంతానికీ, జీవితాంతానికీ ఒక సంబంధాన్ని సహేతుకంగా చూపించారు శాస్త్రిగారు.

కవిసార్వభౌముడైన శ్రీనాథుని ఉపదేశఫణితి అనన్యాదృశమని, అతని వృత్తి మనోజ్ఞత అలంకార ప్రాభవము, భావోచ్ఛ్రితి, రసాభివ్యక్తి, వ్యంగ్యవైభవము సాటిలేనివని, అతని కవితా పద్ధతులు అనంతర ప్రబంధ కవులకు మార్గదర్శకములైనవని చెబుతూ "ఆయన కావ్యరసాస్వాదమనగా - పాయసాపూప సంపన్నము, కలమాన్న పూర్ణము, రంభానారికేళ ఫలశాక సాకల్యము, అజ్యధారాఘుమఘుమితము, శరచ్చంద్ర చంద్రికా ధవళ చిక్కణ దధి సమృద్ధము, నైన భోజన మహోత్సవము" అని వర్ణించారు.

తెలుగు వ్యాసము-తద్వికాసము అనే వ్యాసం ఒక 47 సంవత్సరాల తెలుగు వ్యాస రచనా వికాసమునకు డాక్యుమెంటరీ. 1900-10, 1910-20, 1920-30, 1930-40, 1940-47 ఇట్లా ఐదు భాగాలుగా ఈ వ్యాసం విభజింపబడి, కాలక్రమ పద్ధతిలో రాయబడింది. అనాడు వెలసిన పత్రికలు, వాటిలో వచ్చిన వివిధ రచయితల వ్యాస సారాంశం, వాదాలు, ప్రతివాదాలు సవిస్తరంగా వివరించారు శాస్త్రిగారు. ఉదాహరణకు- "విధినిషేధములు లేని గ్రామ్య పదభూయిష్ఠముగ్గా వాడుకొను భాష యాయా కాలములం బట్టియు, నాయా రాజులం బట్టియు, అయా మానిసులం బట్టియు, నాయా దేశములం బట్టియు క్షణే క్షణే మార్పునొందుచు గులటవలె స్థైర్యము లేక యుండునుగాన మన మాతృభాషను పై రెండు స్థితులలోనే స్థితికిందెచ్చుట యుచితమో యాలోచింపుడు" అని కాశీ కృష్ణాచార్యులుగారు రాసినపుడు గిడుగువారి 'గ్రామ్యభాష కాదు వ్యావహారిక భాష' అన్న వ్యాస గర్జను విన్నవారూ ఉన్నారు. అంతెందుకు అనంతర కాలంలో కూడా ప్రాచీన కవిత్వాన్ని వివాహం చేసుకొన్న భార్యతోనూ, ఆధునిక కవిత్వాన్ని ఉంచుకున్న దాంతోనూ పోల్చి కావ్యాలు రాసిన వారు లేరా? భాషా స్వరూపం సాహిత్య సాక్షాత్కారం వారి వారి చిత్తసంస్కారం మీద ఆధారపడి ఉంటుంది. "సంప్రదాయాలను ధ్వంసం చేయడం కళాశీలికొక క్రీడ కాదు. ఎంతో అవసరం కలిగి వీటి వినాశం వల్లనే లోకాన్ని ముందుకు తీసుకువెళ్ళవలసి ఉంటుందన్నప్పుడే అతడిందుకుద్యమిస్తాడు. తన ప్రజ్ఞాతిశయంవల్ల నూతన సంప్రదాయాలను విధిస్తాడు" అన్న శ్రీ శ్రీ వ్యాసంలోని పాదాలను ఉదహరించి వాటిని 'శ్రీరంగం వారి నీతి నిర్వచనాలు' అని అపహాస్యం చేశారు శాస్త్రిగారు. భాషాస్వభావంలోనూ, సాహిత్య స్వరూపంలోనూ, సామాజిక అవగాహనలోనూ అంధ్రదేశంలో అధునికతకు ఆద్యుడైన గురజాడనే కాకిని పొడిచినట్లు పొడిచారు తెలుగు వాళ్ళు శ్రీశ్రీ ఒకలెక్కా? మొత్తంమీద ఈ వ్యాసం భవిష్యత్ పరిశోధకులకు మార్గాన్ని చూపెట్టే వ్యాసం. వేదము వారి వ్యాఖ్యలు, హాస్య రస తరంగిణి - సాక్షి, విశ్వనాథవారి వచన శైలి ఈ మూడు వ్యాసాలలో సాధారణ సత్యాన్ని ఒరోసారి చూసేటట్లు చేశారు శాస్త్రిగారు. నేటి పద్యరచన భవితవ్యము వ్యాసం ఈ కాలం లోని పద్య రచయితల కృషికి దర్పణం. నవ్యాంధ్ర కవుల వ్యుత్పత్తిని ఉదాహరణలతో విశదపరిచారు. "కవితకు ప్రధానములైన రసభావములను మనస్సులో పెట్టుకొని ఎక్కడ పద్యరచన సాగినదో అక్కడ సహృదయుడు ఆనందింపగలుగుచున్నాడు" అనేది శాస్త్రిగారి అభిప్రాయం. అసలు కవిత్వ పదార్థం ఉన్నప్పుడు అది పద్యమైనా, గద్యమైనా, గేయమైనా, వచన గేయమైనా వినక తప్పదు. "శ్రీరంగం శ్రీనివాసరావు గారు సరేసరి. పూర్వాశ్రమముల యందలి వీరి పద్యములు, వీరి సంప్రదాయ గౌరవము క్రొత్త తరము వారికి కొంత తెలియజేయవలసి యున్నది. అదియు సాగుచున్నట్లే యున్నది" అని శాస్త్రిగారు అంటున్నారు. సాగకేం సాగింది. కాని అపమార్గానపడి అంగ్రతిష్టపాలయింది. ఈ విషయం ఈ వరకే శాస్త్రిగారికి తెలిసే ఉంటుంది. నా సాహిత్య దృక్పథము అనే వ్యాసం శాస్త్రిగారి కావ్యాత్మకు సంబంధించినది. సాహిత్య సంప్రదాయంలో శాస్త్రిగారు ఏ వైపున ఉన్నది, వారి స్థిరమైన, శాశ్వతమైన అభిప్రాయాలు ఈ వ్యాసంలో ఎంతమాత్రం తొణకని పద్ధతిలో వెల్లడయ్యాయి. ఆంధ్ర పురాణం రాయటానికి ఏర్పడిన పరిస్థితులను ఆయన వివరించారు. అంధ్ర రచయితల సాహిత్య, భౌతిక జీవితాలను సంకలించారు. "ఛందో మర్యాదలో ఉన్న కవిత్వమే స్థిర ప్రయోజనం సాధించ గలిగింది."

"సార్వకాలికమై మానవసమాజం యొక్క అభ్యంతర జీవితాలను ఏకసూత్రబద్ధం చేయగల శక్తి ఒక సంప్రదాయ సాహిత్యానికే ఉంది" మొదలైన అభిప్రాయాలతో నేనూ నాలాంటి వారు మరి కొంత మంది అంగీకరించం. సాహిత్యాశీలురు, సాహిత్య పరిశోధకులు, సాహిత్య విద్యార్థులు చదవలసిన వ్యాస సంకలనమిది.

శ్రీ టి. ఎల్. కాంతారావు.

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patril Press, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 61247.